# న వ ల లు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| హత్యారహస్యము | | 1 | 8 | అరత్కణీయా | | 1 | ( |
| కుముద్వతి | | 1 | 8 | దయ్యాలు | | 0 | 12 |
| సింహగడము | | 1 | 8 | హనుమచ్ఛాస్త్రి కథలు | | 1 | 0 |
| మణిహారము | | 1 | 8 | ప్రేమసుందరి | | 1 | 8 |
| ప్రజరాణి | | 1 | 8 | ఫాస్టు | 1 వ భా | 1 | 8 |
| కాశీఖండము | | 1 | 8 | డిట్టో | 2 వ భా | 1 | 8 |
| సేవాశ్రమము | 1 వ భా | 1 | 8 | మొంగలాయీదర్బారు | 1 వ భా | 1 | 8 |
| సేవాశ్రమము | 2 వ భా | 1 | 8 | డిట్టో | 2 వ భా | 1 | 8 |
| అంతఃపురము | 1 వ భా | 1 | 8 | డిట్టో | 3 వ భా | 1 | 8 |
| అంతఃపురము | 2 వ భా | 1 | 8 | డిట్టో | 4 వ భా | 1 | 8 |
| హత్యాభ్రమ | | 1 | 8 | గంగ | | 1 | 8 |
| షేరీరాణి | | 1 | 8 | కోహినూరు | | 1 | 8 |
| రాజ్యలక్ష్మి | | 1 | 8 | ఆక్లీన్ మణేలా | | 1 | 8 |
| విదురుని యుపదేశములు | | 0 | 12 | లలిత | | 1 | 0 |
| కాంచనమాల | | 1 | 0 | పెండ్లిదండ | | 1 | ( |
| సీమంతిని | | 1 | 0 | ఉదంకుడు | | 0 | 1 |
| సుశీల | | 1 | 0 | అవంగి | | 1 | |
| యమునాభాయి | | 1 | 0 | మాధవి | | 1 | |
| శ్యామల | | 1 | 8 | భారతకథాసారము | | 1 | |
| కాలసర్పి | | 1 | 0 | కథాకల్పవల్లి (చిన్నకథలు) | | 1 | |
| గృహదహనం | 1 వ భా | 2 | 0 | 9 గురు రచయితల నేటి | | | |
| డిట్టో | 2 వ భా | 2 | 0 | ఉత్తమనాటికలు | | 1 | |
| చోరశిఖామణి | | 1 | 8 | శకుంతల | | 1 | |
| చిన్నకోడలు | | 1 | 8 | రాజరాజు | | 1 | |
| అపరిచిత | | 1 | 8 | ఇష్వాకుడు | | 1 | |
| సంజీవి | 1 వ భా | 1 | 8 | గుసగుస పెళ్ళి | | 1 | |
| డిట్టో | 2 వ భా | 1 | 8 | పెళ్ళిట్రయినింగు | | 1 | |
| దాసీకన్య | | 1 | 8 | రెండురెళ్ళు | | 1 | |
| స్త్రీసాహసం | 1 వ భా | 1 | 8 | అప్పడు | | 1 | |
| డిట్టో | 2 వ భా | 1 | 8 | కాలక్షేపం | 1 వ భా | 1 | |

# మోహ పిశాచము

గ్రంథకర్త:

వాశిరెడ్డి మల్లికార్జున



పబ్లిషర్సు:
కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి
1948

 [వెల రు 1—8—0

# పీఠిక

In Society Law doth feign
For Sooth Love doth reign
To catch God. Love weaveth the universal net
To catch the devil Law weaveth the personal late
True it is in simple life
One can get diamonds rife
Heaven wards as they show hight
In peace walketh to his might
Formless is the power
Bearless is her shower
Danceth in destruction
Enjoyeth in construction.

యోగి పరదృశ్యముల ఇచ్ఛాశక్తిచే ఆనందించును. కవి హృదయమందలి అంతఃశక్తిచే ఆనందించును. కవి ప్రేమచే సిద్ధినొందును. యోగి ఇచ్ఛాశక్తిచే ముక్తినందును. ఇద్దఱిమార్గములు వేరైనను గమ్యస్థాన మొక్కటే. అంతఃశక్తి ప్రేరేపణయే కవివ్రాతయగును. యోగివలె స్వార్థపరుడుగాక, కవి తన యానందమును యితరుల కెఱుకపరచును. కవులలో మానసిక, బుద్ధేతర, ఆధ్యాత్మిక కవులు గలరు. మొదటివాడు ఇంద్రియలోలతను, ద్వితీయుడు ప్రేమను, తృతీయు డంతఃశక్తిని, జగమందలి చిత్రచర్యను వర్ణించును. నాఅంతఃశక్తియను ద్రవము కవితాకన్యచే

వెచ్చజేయబడి బుద్ధియను మూసలో యీపొత్తమురీతి రూపముజెందె. కనుకనే "మోహపిశాచము" అని నామ మిడితిని. హింది, ఉర్దు, ఆంగ్లాంధ్ర కుసుమములు నాకిదె నూత్న పరిచయ మగుటచే భాషాసేవకులు నాతప్పుల మన్నింప ప్రార్థన.

వైద్యమందు "చతుర్వైద్య చికిత్సామంజ" రన పేర ఆంగ్ల హోమియొ పార్థివ ఆయుర్వేద వైద్యముల, మైనర్ సర్జరి, మంత్రసానత్వము మొదలైన వాటిని స్వానుభవమునుంచి వ్రాతగ్రంథములనుంచియు సంగ్రహించి రచియించితిని. ప్రథమమున వీరవెంకయ్యగారి కివ్వబడి, రిజిష్టరుకాబడి ముద్రణాలస్యముచే సర్వమునాకే తిరుగ ప్రెస్సునుండి పంపబడెను. ప్రకటనకర్తయని జెప్పుకొను నొకదొంగవాని చేతికి జిక్కెను. దాదాపు మూడువందలు పుటలుగలవు. అద్దానిని నాయనుమతిలేనిది అచ్చువేయించకుందురుగాక.

వా. మల్లికార్జున



# మోహ పిశాచము

## మొదటి ప్రకరణము

రత్నమును ఏరీతి ప్రకృతి ప్రకాశింపజేయుచుండెనో చూతము. ఆమహాతల్లి కరుణారాశి తనగర్భమున, అందు భారతదేశమున మహాపురుషు లుద్భవిల్లెననిగాబోలు ఒయ్యారమునందె భవిష్యత్తును తెలుపనైనతెలుపక నిర్విచారముగ అంతఃకరణునితో క్రీడించుచున్నది. సత్యమునకాతల్లిగర్భము పురుషులచేతనేగాక సీమంతులచేతనుఅలంకరింపబడెననసందేహమున్నదా? అంశుమాలి తనయంశువుచే సర్వంసహాయగు సీమంతిని బహువిధముల నొప్పించి గ్లానముజెంది విశ్రాంతిగైకొన గాబోలు కాంతివిహీనతతో సీమంతినిజయించుట మానవునకు బహుకష్టతరమని చాటుచు విశ్వదేవియొక్క మేలిముసుంగు చాటుకుమెల్లన జారుచుండెను. భూదేవితో గెలుపుగొందలేక జారునివోలె రవిజారుచున్నాడని జెప్పిజలదరములు వికవిక నవ్వుచున్నయవి. గెలుపోటులు మానవునకు సహజధర్మములు; గెలుపోటులు, వృద్ధినాశనములులేనిది యీభూవలయము కదలజాలదు; నేడు సూర్యభగవాను కృశించనోపు వేసవియందు తనశక్తియినుమడించ భూదేవి ముఖవికాసము మాలుగురీతి జేయగలడు; నేడు గెలుపని

సంతసించవలదు. ఓడిపోతిమని క్లైబ్యమునందవలదుసుమా? అని ప్రభాతవాతముపయోదమునకు మంచితనమున బోధించుచున్నదోయన తూలించుచుండెను. ద్యోవీధిని యిట్టి అల జడిజరుగు టెందునో యని భావించికాబోలు జీమూతములు మహాగాంభీర్యముతో, శాంతిగాంతులతో నిశ్శబ్దముగా పై వంక కెకనుదోయిని నిగుడ్చి పరికించుచుండెను. సముద్రయాని తాధరించుకొన్న రత్నమాలను దివిటీవలె నింతవరకు రంజిల జేసిన ప్రవరుడుగానంబడమి పూర్ణముగా "అనూత్నవరుడు కాంతివిహీనుడాయెననియెంచి స్వార్థతనుజెందక తనవరుని క్షీణదశనుజూచి సహింపలేక తాను ధరించుకొనియున్న రత్నములకాంతినైన యిత్తునను వేగముతో ముందునకురుకుచుండెను ఇంతవఱకు అంతర్భాయమైన రత్నవికాసతను ఇప్పుడు బయలునకు విరివిగా క్రమ్మరుచుండెను. క్షీణదశకు రానున్నదని మనంబున తలంచి ప్రకృతీమతల్లి మెల్లన క్రొత్తావిసేదదీర్చుచుండెను. ఎచ్చటజూచినను బహుశాంతి మయముగ, గంభీరముగనున్నదని జెప్పకనొప్పదు. బాల బాలికలెల్లరు సహజప్రేమచే ఒయ్యారమున ఆటపాటలందు ఓలలాడుచుండిరి, పిల్లలచేష్టలకు వారితలిదండ్రులు మోద మున మునుంగుచుండిరి. పగలెల్లయు కార్యములందు నిమగ్నులైయుంటచే మానసికోపాసకులు చల్లనిగాలికై వీచిన ప్రదేశముల కేగుచుండిరి. శరీరోపాసకులు ఉత్సాహమువెల్లి

విరియుచుండ" దీనదయాళుని, పరమపావనుని, నిత్యానందు ని వేనోళ్లసుమధురమైన గీతములందుజొన్పి పాడుకొనుచు కేళీవినోదంబులదేలుచు గృహాభిముఖులై యేగుచుండిరి.

సుందరవదన తేర - చహెరాపర్ - దిల్ నాచ్ కర్ తాహై
ఏక్ దఫేపావో - తేరమురళీమెగావో
మక్కన్ కేచోరా - మదనస్వరూపా
బహన్ కెరంగ్ వాలా - బడాహమఖ్ కెబాల
తేరకిల్ కిల్ కుసచ్ హై - దిల్ గఫ్లత్ మెపడహై
బేతాబ్ హోజాయ్ గా - వేణునాద్ సునెగా
మేరదిల్ కాఫల్ కీమె - తేరచహెరాచాంద్ హై
నాచ్ కర్ నేకుఆవ్ - నజర్ ఏక్ దఫెదేవో
తేరకిల్ కిల్ మె - మేరదిల్ చల్ చల్ కర్ తాహై
మేరాప్యారా - మిల్ నేజారా గోకులబాలా (ఉర్దు)

శ్రీకృష్ణభగవానుని మోహనాకారమందు మనస్సుల ప్పరి. పక్షులన్నియు గూళ్ళకేగుచు తియ్యని ఫలపుష్పా మెక్కి తియ్యని పదంబుల గానముజేయుచు, భగవత్కీ వేనోళ్ళబొగడుచు, ప్రకృతీమతల్లియొక్క క్రీడలకు సహా హాతులగుచు, భగవత్సందేశముల మానవుల వీనుల విం వినిపించుచు మానవుని జీవితము కఠినము మాజీవితము కజీవితములని చాటుచున్నవో యన వాటియందె కాశి కై ప్రవర్తించు మానవులకై వీరి మూర్ఖత్వమునకు జాలి

నొంది యుప్రత్యూహమును వీరికై సేవలజేయుచు దేవలో ఋషీశ్వరులన నొప్పుచు ఈకఠినభూఖండమున నివశించ నిచ్చ లేక మానవుని నిరపరాధము చర్యలజూచుచు ద్యోవీథిని సచరించుచున్నవి. అలనాటి దేవగాంధర్వులు కలికాలంబుః గుప్తవేషంబున దివ్యమైన గానమును సల్పుచున్నవి. ఓపక్షులార! మీజీవితమేమి? మీపతితపావనంబైన ప్రేమమహిమయేమి? స్వార్థపరతలేమి యేమి? మిమ్ముల పీడించుమానవుల మీరు తిరిగి ప్రేమించుటజూడ మీయందె పూర్ణమైన సత్యాగ్రహము నిండియున్నది. మీనుండియె మానవుడు తనకొఱకై ధర్మముల సృష్టి జేసికొనవలెయును. నీజీవితము ఋషిజీవితము కఠినహృదయుడగు మానవుడు రానొల్లని వనప్రదేశంబున నీయిచ్ఛానుసారంబుగ గీతముల నల్లుకొనుచు, గానము జేయుచు ఆనందాంబుధి నోలలాడు గగనకుసుమమా? మానవుని బాహ్యనేత్రమునకు భూఖండమున పుష్పచ్ఛాయయే గానిపించునుగాని దేవలోకమునుండి మానవు నుద్ధరించవచ్చిననిరాడంబరజీవికా గగనకుసుమంబులుగానిపింపవు. అవియెల్లమహాపురుషుల అంతర్ముఖంబున దోచును. కవిపుంగవులు వాటి గీతముల గానము జేయుచుంద్రు. గగనకుసుమక్రొత్తావికి భూకుసుమ క్రొత్తావి మరింత మాధుర్యమును దెచ్చుచున్నది. గగనకుసుమంబు లుచ్చరించిన గీతమును భూకుసుమంబు మరింత మాధుర్యమును బూసి గానము జేయుచున్నది. ఈమాధుర్యము నానందించున దెవ్వరు? ప్రకృతీమతల్లి, ఆనందమునః

నైమఱచియున్నది. ఆతల్లి! మనోహర తంత్రీనినాదము ? ఆహా! ప్రకృతిభాష మానవునకు దెలియదు. తెలియదా ? దేవకన్నియలకు ? సెలయేరుగంభీరము బాడుచున్నది. జీమూతములు వ్రాయుచున్నవి నిశ్చలమున. మారుతము వాయించుచున్నది. దేవకన్నియ మానవులకై తెనిగించుచున్నది. జగత్సాక్షియైన సూర్యభగవానుడు చిఱునగవులతో ఆనందించుచున్నాడు. ఏమిగీతము. ఏమిపదగంభీర్యము. ప్రకృతీమతల్లి ఈకృత్రిమమైన ప్రదేశమును విడిచి ఒంటరిగా గీతముల బాడుకొనుచున్నది. భౌతికసౌఖ్యములకై జీవితాంబుధిని జచ్చుచున్న మానవులమధ్య ఆతల్లి నివశించనొల్లదు. మానవులందు ప్రేమనశించెనని ఆతల్లి వంటరిగా వాపోవుచున్నది. మానవప్రహాదము యింకినది. ఇంకేల నివశింతుననుకొన్న దాతల్లి. మానవునిమధ్య జీవమునశించినది. జీవచ్ఛవంబులై మానవజాతి వెఱ్ఱిదానివోలె వీధులందు గ్రుమ్మరుచున్నది. మహాత్ములవల్లని లాభము తాత్కాలికమైపోయినది. మానవ ప్రదేశమంతయు శివప్రేరితమై శ్మశానభూమిగా మారినది. ఆజగజ్జననీమతల్లి యిందుకై వాపోవుచు విపినప్రదేశముల వెఱ్ఱిదానివోలె గ్రుమ్మరుచున్నది. తన వ్రాతనుమార్చుమని బ్రహ్మకు జెప్పుకొనుచున్నది. పాపభారము హెచ్చినదని వాపోవుచున్నది. ఆమె శరీరమంతయు జలదరించుచున్నది. హాప్రభూ! నాసత్సంతానము చైతన్యహీనులగా జేయునీకు ఒప్పునా ? గంభీర ఆలోచనలుగల నాఋషి కులమెద్ది ? నా

ప్రభువగు నీయందె ఎల్లకాలము రమించెడి యోగికులమేది ? ధర్మరక్షణార్థమై తనువును దగ్ధమొనర్చెడి ధీరజాతియేది. ఆత్మప్రకాశము కాఱుమబ్బుచే క్రమ్మబడినది ? ఇంకేటిధర్మము. ఈపె కంఠధ్వని మాఱుమ్రోగుచున్నది. ఆతిపైయొక నాతివీణతంత్రిని నాటుచున్నది. పైగీతమును ప్రకృతీమతల్లికడ ప్రతిదివసము నేర్చుకొంటున్నది. ఈకన్నియకు మానవుడుపాధ్యాయుడుకాడు. ఆజగజ్జననీయ తల్లికడనె పాడుకొనుచున్నది. ఆతల్లి చనుబాలనేగ్రోలుచున్నది. అంతఃకరమున దివ్యమైన శక్తినిపూరించుకొంటున్నది. ఈమానవజగమున తనశక్తిని నిలువబోవుచున్నది. ఆమెగీతమును మాధుర్యముగను, గంభీరముగను ఉచ్చరించునపుడు ఆపెహృదయము వ్యాకులగుచున్నది. రక్తముతెల్లనై కంటివెంటజాఱు చుండెను. ఆపె ప్రతినరము గీతమును ప్రతిగీతము నాలాపన జేయుచున్నవో యనినటుల ఉద్రేకపూరితములై తంత్రీనినాదముపకు చేదోయి వాదోడుగా ప్రతిధ్వనించుచుండెను. బాహ్యాకన్నులు నిర్జీవములైనవి. అంతరేంద్రియము విద్యోతించియుండెను. ఆపె నేత్రముల కెద్దికాన్పించుచుండెను. ఇక్కాలపు స్త్రీజనంబువోలె భౌతికశరీరములందలి సోయగమును ప్రముచ్చిలించుచుండలేదు. దన కనకవస్తువాహనములకై ఆతని హృదయము సీరసించుట లేదు. కీర్తికాముకాలుకా వొడంగుటలేదు. ఆయిందిరను ధర్మదేవత ఆవహించియున్నది. ధర్మదేవత తనముందు నాట్యమాడుచున్నట్లుగాంచుచున్నది. ధర్మదేవత ఏడ్చుపడ్పులు ఈపెకర్ణ

కుహరములందు ప్రతిధ్వనించుచున్నవి. ఏమని ? అధర్మమూర్తిని ఇక్కాలమున ధర్మమున కాలవాలమైన భారతదేశమున పోషించువారు లేరని సహజప్రేమ! కాదు కాదు మోహము లేదు? క్రైస్తదేవుడు, బుద్ధదేవుడు నాటిన ప్రేమవృక్షము. హరిశ్చంద్రుడు నాటిన ధర్మవృక్షము. చంద్రదమయంతులు నాటిన యాహిణ్యావృక్షములు, నేటికి భారతదేశమున నీరు వోసి పెంచువారలు లేక కృశించిపోవుచున్నవి. ప్రేమ, ధర్మ, దేవతలు, విపినప్రదేశముల రోదజేయుచున్నారు. రహస్యముగ వారి అంతర్యాత్ములతో మనవి జేసికొనుచున్నారు. అంతర్యామి ఏమని జెప్పుచున్నాడు? "ఓ నాచేనియమింపబడిన మూర్తులారా వాపోవజనదు. ప్రస్తుతము మిమ్ముద్ధరించ "సౌదామిని" యనుకన్య ఈజగమున కప్పుకొనిన అంధకారమును భేదించసిద్ధురాలై యున్నది. కొంతకాలమునకు పురుషుడుద్భవిల్లి కానున్న కార్యమును పూర్తిజేయు గలడు" అని వారలనోదార్చుచున్నట్లు మనయిందిరవీణులకు వినవగుచుండెను. ఇంకను గీతమీతీరున వాయించుచుండెను.

సస్యఫల, జలసమృద్ధహిందూ!
సరళసుహృదయ, ధీరజాతిహిందూ!
మోహముగ్ధమె మానవజాతి హిందూ!
దూర్ కరాహై భావ్ కాహిందూ!
హిందూవిపిన మేదగ్ధహోతాహై!

కంఠము స్పందనమందుచుండెను. ఈగీతమునువాయువు భారతదేశమునంతటను మాఱుమ్రోగ జేయుచుండెను. ఈ గీతమునకు మానవజాతి కర్ణకుహరములు మూతవడియుండెను. విన శక్తిహీనులు, ధర్మ, ప్రేమప్రకృతీమతల్లులు మానవ జాతిని వీడియుండిరి. జాతినిర్జీవమైనది, దగ్ధమగుచున్నది. దగ్ధముకాగలందులకు సహజవేషమునుమార్చి ప్రేతవేషమును ధరించినది మానవజాతి దగ్ధమగుచున్నది. భీతినలుప్రక్కల క్రమ్ముకొన్నది. పొగలెగయుచున్నవి ఫటఫటా "యనుభీకర ధ్వనులు విననగుచున్నవి. ఈదృశ్యమంతయు ఇందిర కనులార జూచుచున్నది. హస్తమందున్న వల్లకి ఆలాగె నిలచిపోయినది. ఇంతవరకు పాడుచున్నగీత ముద్వోగీధినమాఱు మ్రోగుచున్నది ఈకన్నియపెదవులు కాంతివిహీనములై కదలుటలేదు. నిట్టూర్పుపుచ్చుచున్నది. కన్నులెఱ్ఱనై రక్తమునుగార్చుచున్నవి. నేత్రములు గగనమువంకకె మఱలియున్నవి. చైతన్యహీనురాలుగా కన్పించుచున్నది. ఆమెహృదయము తీవ్రముగ గొట్టుకొనుటచే కుచద్వయము కదలుచుండెను. అంతరాత్మ ఆ సుభగకేద్దియో జెప్పుచుండెను. గంభీరవాక్కుల వినుచున్న దీకన్య. ఈమె ముఖవికాసము ప్రతిక్షణమున కనేకవిధముల మారుచున్నయది. ఒక్కపరి తనవసనముచే ముఖమును కప్పుకొని వాపోవజొచ్చెను. అప్రయత్నముగ ఆమెనోటినుండి యీ వాక్యములు వెలువడజొచ్చెను. "ఓప్రేమమయీ, ధర్మమూర్తిమతల్లీ! ఈజగముననిను పోషించువారలేలేర? నావంటిఅబలకె

యీ బయలునందు కనిపించవలెనా? కళాహీనురాలవైతివా తల్లీ! నిను పోషింతురను ఆసచే బిడ్డల నింతవఱకు పెంచితివి ద్రోహులు, స్వామిద్రోహులు, మాతృద్రోహులైరా? ఈ జనులు కృత్రిమ వేషముల వైచికొని వెఱ్ఱికుక్కలవలె తిరుగాడుచుండిరా? వారల పోషించుచున్న జీవజంతువుని నిర్దాక్షిణ్యులై కరుణను గోల్పోయి యీ నీచశరీరమును పోషించు మెక్కుచుండిరా? సారాయము పానీయమాయెనా? వైధవ్యమును బలుకుట మానవునకు చులకనై పోయెనా? మానవజాతి ప్రేమబంధముల ద్రెంచుకొని విచ్చలవిడిగ దిరుగాడుచుండెనా? స్త్రీజాతి లజ్జావిశేషంబును గోల్పోయి స్వాతంత్ర్యమను పేరఁ పురుషుని వెంటాడుచుండెను. జ్ఞానులమను పేర మానవజాతి మరణించుచుండి గొప్పలెల్లరు మూలల ముక్కుమూసిక కూర్చుండిరా? భగవత్ప్రీలలకు తోడురాని భక్తిజ్ఞానములు భగవంతునికి రుచించునె? మానవజాతి ఒకరి నొకర ద్వేషభావముతో చండాడుకొనుచుండిరా? ఓతల్లీ! నీసవతియగు అధర్మ దేవతయే యిపుడు గెలుపొందినది. తల్లి మానవజాతి కృత్రిమసౌఖ్యములందు మునింగి జీవమును గోలుపోయి శల్యములై విశ్వవీధులందు సైతానులవలె తిరుగాడుచున్న మాట సత్యము. ముమ్మాటికి సత్యము. నీయందింతవఱ కిమిడియున్న కతను నీసవతి యిప్పుడు భీకరరూప

మున నీదు సంతానముపై విచ్చలవిడిగ ఇచ్ఛానుసారముగ దీర్చుకొనుచున్నది. మతమను కీటకమును మానవు లుద్భవిల్ల జేసికొని యీర్ష్యాళువులై సోదరునిపై సోదరుడు. తండ్రిపై కుమారుడు సేవ్యముజేసి తన్నింతగా పెంచిన కల్పవృక్ష మనదగు గోమాతపై కృషీవలుడు ఖడ్గముల నెత్తియున్నాడు. మతము నిజముగా నిర్జీవమైనది. ఆత్మను గోల్పోయినది. తల్లీ! సరియ! నీఆదేశమేమి? నీరక్తమగు నీటిచేతను నీకండ రములగు ఫలములచేతను పంచభూతము లగు నీచేత నిర్మింప బడ్డ యీశరీరమును నీకే అర్పింతును. లేకున్నచో నేను ఋణవిముక్తురాలను గాజాలను? ఏమందువు తల్లీ? అమ్మ యింతవఱకు సుఖలాలసనై ప్రకృతీమకడ క్షీరమునుగ్రోలుచు యీశరీరము స్త్రీయని లజ్జించి గృహములందె బంధింపబడి యుంటిని. ఈశరీరము స్త్రీయైన అగునుగాక? నానిజస్వరూ పము స్త్రీత్వమెద్ది? అని తలపోయుచుండెను. ఈపె విచార భారమును జూడలేక సూర్యభగవానుడు గ్రుంకెను. ఇందిర ఉపలబ్ధిజెందెను. ఆమె మనస్సుకు శాంతములేదు. మనో ఆకాశమందు తుపాను వర్షించుచునే యుండెను. మెల్లని పద ధ్వనులతో గృహాభిముఖురాలాయెను.

---

# రెండవ ప్రకరణము



నాగేశ్వరము నంతటను చల్లనిపందిళ్ల వేసియుంచిరి. అది వసంతఋతువు పైని కాఋమబ్బులు క్రమ్మియున్నవి. పురవీధులన్నియు చక్కనితోరణముచే నలంకరింపబడి యుండెను. సర్వగృహము చక్కగ శోభించుచుండెను. ప్రకృతి సౌందర్యమంతయు యీపురపరిసరములందె నెలకొని యున్న దన సందేహములేదు. ఈప్రదేశములందు చీడవృక్షములు మిక్కుటము వీటినుండియె కర్పూరతైలమును తీతురు. ఇచట భాగీరథీ సరయు గోమతీసంగమము పారుచుండును. పురము బహుసుందరముగ నుండును. పురమువెంబడి సంగమము ఒడ్డునే ఉద్యానవనము కలదు. బహువిధ ఫలవృక్షలతాదులతోనిండియున్నది అందొక సౌందర్యభవనముకలదు. ఇట్టి అవయవములను గల్గిన ప్రకృతి ఆభవనము నందొక కన్యను అల్లారుముద్దుగ పెంచుచుండెను ఆమెకెక్కువ దాసీజనంబు లేరుగాని ప్రకృతియె ఆమెనుసంగీత, సాహిత్యాహారములతో హృదయలతను పోషించుచుండెను. ఈసుభగ ఎన్నడును పర ప్రదేశములకు వెళ్ళిఎఋగదు. పరవేషభాషల జూచి మెఋగదు. ప్రకృతిచే పోషింపబడుటచే ప్రకృతి నియమములనె పాటించుచుండును. సహజనిరాడంబరమునె ప్రేమించు చుండును. ఆమె సహజసౌందర్యమున నొప్పుచుండెను. ఆస్యము

నవమోహనాకృతిచే విభాసమాన మందుచుచుండెను. ఆపె ఓష్ఠము కుంకుమరంగున స్పందనమందుచుండెను. ఆమె సహజ సౌందర్య మెట్టిదో చూతము.

సీ. రాకాసుధాంశు నిరాకరింపగజాలు
నెలతరో నీముద్దు నెమ్మొగంబు
అరవిందములసొంపు నతిశయింపగజాలు
కలికి నీవెడదలౌకన్నుదోయి
అలమృగేంద్రముబట్టి యపహసింపగజాలు
నీరజపత్రాక్షి నీదునడుము
బంగారుకుండలపరిహసింపగజాలు
నారి నీముద్దువక్షోరుహములు

తే. గీ. కన్నబిడ్డవు ప్రకృతికౌగాక నీవు
లేకయున్నచో భువి నినుబోలు లేమయున్నె
నీదునామంబు సౌదామినీయునజెల్లు
అంధకారమున్ చెండాడుయబలవనగ.

పై పద్దెమును ఉచ్చరించుచు సూర్యభగవానుడీమెను తనకిరణములచే సమాశ్లేషించుచుండెను. ఇందుమణి పేరు సౌదామినిగమారెను. నీరదకదంబములన్నియు జోహారొసంగుచుండెను. ధ్వాంతమును భేదించి అంబరమున పయనించుచున్న కైరవంపు ఆమెసౌందర్యమునకుతనకిరణములచేమరింత పూతపూయుచుండెను. అప్పుడామె చందమిట్టులున్నదనిగహనాంతరాళమున కోయిలలు మృదుమధురస్వరముచే వర్ణించు

చుండెను. సాంధ్యఅరుణద్యుతులు ఎగసిమెగసి యీపెయధర పల్లవమును గ్రోలుచుండెను. మారుతము శిశిరోపచారముల సల్పుచుండెను. శుకపికశారికాదులు యీమె సౌందర్యమును గీతములందుజొన్పి పాడుచుండెను. ఈపె నివసించువనము హరిచందనాగములు, కర్పూరవారంబులు, లవలీనికుంజములు పున్నాగావనీజంబులు, సహకారబృందములు, మందారము, వనకుజాదులచేఅలంకరింపబడియుండెను. కులాయములందుండి శ్రావ్యముగ గీతములుపాడు శుకపికాదులుగలవు. వనమధ్యంబున సెలయేరుగలదు. చాతకనెమిళ్ల నృత్యములు నేత్రానందముగనుండును. భవనమున నిలబడుచో "చండీ" కాపర్వత దృశ్యము వర్ణనాతీతముగనుండును. ఆభవనము సోపానముపై సౌదామిని ప్రఫుల్లవదనముతో సూర్యుని ఉపహాసమును పరికించుచు ఉపవేష్టించియుండెను. కనుబొమలు దీర్ఘాలోచనను చాటుచునే యుండెను. అంతరిక్షమున అంటుకొనియుండెను. ఆలోచనాసముద్రమున మునింగియున్నదనవలయును. ఆస్యమందలి జీరలు క్షణమునకొకమాదిరిగా మాఱుచుండెను. ఆమెతలంపులీరీతినియున్నవని ముఖవికాసము దెలుపుచుండెను.

"ఓహో ఖడ్గరాయ్‌ని వివాహమాడుటయా? ఇది యేటివింత! కానిమ్ము! ఆంగ్లతురుష్కభాషలందు విద్యాధికుడు! అయిననేమి? కృత్రిమమానవుడాతడు? నేనో ప్రకృతి పుత్రికను! ఇట్టివారికి పొందుకూడుటెట్లు! అన్యాచారవలంబియతడు! స్వమతాచారవలంబిని నేను! ఇద్దరికుల మొక్కటైనను

హృదయములందు సహస్రముగా భేదముగలదు. ఇట్టివింత వివాహములచేతనె దేశమంతయు నరోచకము పాలైనది. భగవంతుడు మానవునకు వివాహమేల తెచ్చిపెట్టెను? మోక్షసాధనకొఱకు సహజప్రేమచే విశ్వావలను సేయుటకు ఖడ్గరాయ్ రాజైననేమి? నాహృదయరాజ్యమును పాలించుపరిపాటి లేదు. నన్నింతకాలము పెంచిన ప్రకృతీమతల్లికి వ్యతిరేకము నడువజాలదు. ఆమెకు బాసయిచ్చియుంటిని. ముందు స్త్రీసంతతికి దారిజూపవలయుగాక? ఖడ్గరాయ్ నవీనుడు. ఆ నవీనుని హృదయజలధియగు ప్రేమయింకినది. మోహముమాత్రము భీకరవృత్తిని రాజ్యమేలుచున్నది అట్టిమూర్తికి నేబలిగాజాలను. నాప్రేమను "మత కులములు అడ్డుపడజాలవు. కులమున పేరున ప్రేమ లేనియడారిలోకూలబోను. వివాహముమానుకొనియుండగలనుగాని యిట్టియసంబద్ధబంధమును దెచ్చిపెట్టుకొనను. నా జన్మతావచ్చిన నాదు స్వాతంత్ర్యలక్ష్మిని డబ్బుకై యూసించి యింకొక పురుషున కమ్ముకొనను. సహజప్రేమస్వాతంత్ర్యముల నెప్పుడు అమ్ముకుందునో ఆసమయముననే విధవనగుదు. మగడు శరీరధారియైనను విధవనేయగుదును. మంగళసూత్రమెందులకు? దేహధారుల బంధించితిమనియా? కాదు! కాదు! ముమ్మాటికిని కాదు! అంతఃకరణమునను ప్రేమమూర్తుల బంధించితిమని గుర్తు. అట్టిప్రేమలేని వివాహమేల? ఓపిచ్చుజనులార? ఏటి వెర్రితనమిది. పిల్లకూనలబట్టి ప్రేమయనగ నేమొ తెలియని కాలమందు మంగళసూత్రము

లచే బంధించుచుంటిరా? కులమను కారణమున ఎంతటి వివేకహీనులికేని స్వకులమని భ్రమసి అబలను సంసారాంబుధిని ముంచుచున్నారా? మీఘోరరాక్షస కృత్యములచే ప్రేమప్రవాహమును అడ్డుతగిలితిరా? ముమ్మాటికిని మీరు రాక్షసులు. విద్యయను పేరన విద్యావరుననకు మీకూనల బలిజేయుచుంటిరా? ధనమనుపేర హృదయశూన్యమగు ఎడారులలో పసిపిల్లల విడనాడుచుంటిరా? స్త్రీకి శృంఖలము చేతులార తల్లితండ్రులగు మీరు తొడుగుచుంటిరా? ఎట్టి ఘోరము. పశువుకంటెను స్త్రీని స్వాతంత్ర్యహీనురాలిగా జేయుచుంటిరా? ఆగుడు! ఆగుడు! ఇచ్చట సౌదామిని గలదు. అని గంభీరవాక్కులు హృదంతరాళమున ఆత్మ పల్కుచుండెను. నెమ్మదిని సౌదామిని ఆలకించుచుండెను. ఇంతలో గొల్లబాలుడు ఇరువదిమూడు వత్సరముల మేనున ధరించి మిక్కుటమైన సోయగంబు మురిపంబుజూపగా వచ్చు చుండెను. మేక సమూహముమధ్య శ్రీకృష్ణభగవానునిబోలె దేదీప్యమానముగ వెలుగొందుచుండెను. శరీరచ్ఛాయ మేడి పండును మించుచుండెను. నాటి కాళిదాసు నే డుదయించెనా యని ప్రతివానికి సందేహము పొడముచుండెను. నిండు చందురు కాంతిని మించుచున్న తెల్లని ఖాదీవసనముల ధరించియుండెను. చేత గ్రంథరాజములు చెన్నారుచుండెను. ఆతని నేత్రము బహుదీర్ఘములై అతని ఉత్కృష్టము ఆలోచనల దెల్పుచుండెను. మన సౌదామిని నేత్రములు యీ

వ్యక్తిపై బ్రాలెను. ఆమెమనోవృత్తులు మారుటచే ఆస్యము ప్రభాయమానమాయెను. ఇదివరలో కార్మ్కొనిన వారి దమాలికలు సూర్యుని జననముచే ధ్వాంతము ధ్వంసమందు నట్లు ఆవ్యక్తి కాసపించుటచే పలాయనమాయెను. ఇదివఱ లో మహాచనువున్నట్లు ఆవ్యక్తి గొఱ్ఱెలగుంపును తన సహా చరుని ఆధీనమున నుంచి సోపానములపై ఆసీనయైయున్న సౌదామినివంకకే వచ్చుచుండెను. అతని పెదవులపై చిఱు నగవు లెగయుచుండెను. అతని నామధేయ మేమో విచా రింతము, గోకులచందు, వారిసంభాషణ యిద్ది.

'గోకులచందు, మూడుదినములనుంచి యీపరిసరము లకు రాకుండుటకు కారణమేమో జెప్పగలవా ?

గోకులచంద్—ఏమిగానుండును మాబోరగ్రామమున అతిగంభీర్యములైన ఉపన్యాసములు జరుగుచున్నవి. బౌద్ధ మతధర్మములగురించి బౌద్ధసన్యాసియొకడు ఉపన్యసించుటచే యిచటకు నాకు రావీలుపడలేదు.

సౌదామిని—బౌద్ధధర్మములు సర్వోత్తమములుగాని యీనాటి వివాహములం చైతన్యములేనట్లు బౌద్ధధర్మము లంజలి చైతన్యమునశించి ఎండువృక్షములబోలె నీరసించి యున్నది.

గోకుల—సౌదామిని ! నేడు మీపురమంతయు మహా వైభవముగ నలంకరించబడ్డది. అదియెద్దో అడుగుదమని యే యిటకు ఆత్రముతోవచ్చితి. వివాహమనుమాట వింటచే జ్ఞప్తికివచ్చినది.

సౌదామి—నాకింతవఱకు విదితమైనదేమనగా ప్రకృతికి చైతన్యమునకు నిలయమగు యీనాగేశ్వరపురమందు ఇంకను ఐదుదినంబులకు ప్రేతములకు మహావైభోగముగ వివాహమును చేతురట.

గోకుల—వినుటకు మహావింతగానున్నది. ప్రేతము పెండ్లియేమి?

సౌదామి—తెలియకున్నదా? ఆవివాహములే నిశ్చయములైనచో నాకింతవఱకు విద్యగఱపిన యీభౌతికదేహమా ప్రేతమగును' గోకులచందు స్వాంతముపై వాక్కులవినుటతోడనె నిర్విణ్ణుడైపోయెను.

గోకుల—సౌదామిని? పలుకరాని పలుకులపలికెదవేల? ఇంతకాలమునుంచి నాకావిషయమును తెలుపకుంటివేమి?

సౌదామి—తెలిపి చేయునదేమున్నది? పలుకరానిదేమున్నది. ఈచైతన్యదేహమును 'ఖడ్గరాయ్' యనుమర్త్యుని ఖడ్గమునకు నామాతాపితలు బలియివ్వ మ్రొక్కుబడియుండిరి. ఆమ్రొక్కుబడిని ఐదుదినములలో చెల్లించవలెనని నామాతవలని ఆజ్ఞ.

గోకుల—ఏమటులందువు ఆర్మూర పట్నమునేలు ఖడ్గరాయ్యేన? ఇందులకు నీవొప్పకుంటకు కారణమేమి? ఒకానొక కార్యము ఆపట్నమునకు మొన్న వెళ్ళియుంటిని. ఆపట్న సౌందర్యమేమని జెప్పుదును.

సీ. ఆకాశతలమున నటచెడు మేఘపంక్తుల
గదల్చుపసిండి గోపురములు

లలితంపుచంద్ర మండలముతో స్నేహంబు
గోరుచుండెడి గాలిగోపురములు
భానుమండలముతో బవరంబుసేయ
నూతనచంద్రికాతబద్ధవరణములు
ధరణిఘోటకములదండించు హేమదం
డనిబద్ధచారుధ్వజనిచయములు

తే. గీ. దివ్యమాణిక్యములగెల్చి తేజరిల్లు
దీపములునవరత్నసందీపితాన
నములుగలిగితమింగాంచు నరులకెల్ల
నవరసురపురమనదానవని జెలగె.

ఇట్టి వైభవములతో అల్మూరుపట్నము దేదీప్యమానముగ హిందూదేశమునకంతటికి వెలుగందుచున్నది. ఆచుట్టునున్న జీమూతములు, నదులు, వనములతో గూడిన ప్రకృతిసౌందర్యమేమి? అట్టి అల్మూరు పట్టణరాజకన్యవుగా బోవుచువలదనుచుందు వేమి?

సౌదా——ఇంతవఱకు నాకడనేర్చిన ప్రథితసారస్వతమును నాకెవప్పగించితి చాలుచాలు కవికింతమనోఆడంబరము వలదు. నీనవీనకవిత్వముచాలు? బౌద్ధమతమునకు తగినవాడవే? బౌద్ధమతము అమితవిరాగముబూని మానవచాంచల్యముబూని 'తనకు తామఱచి' తనవ్యక్తిత్వమును తానె భుజించినది, చైతన్యహీనురాలైనది. ప్రేతయాకారమును

దాల్చినది. జీవముగల వేదముల వలదని మొదలెట్టినది. పాపము హిందూదేశసరిహద్దులనుండి చైన, జపానుదేశము లకు తఱుమబడ్డది.

బుద్ధదేవుడు మనోహరమైన విశ్వప్రేమను చాటించి యుండగా యిక్కాలపు బౌద్ధమతము కఠిన విధానముల సృష్టించుకొని ప్రేమస్వరూపమందున్న చైతన్యమును నశింప జేసి విరాగియై ఆసియాఖండమున తిరుగాడుచున్నది. అట్టి బౌద్ధధర్మముల విని నీవును చైతన్యహీనుడవు అనగా ప్రేమ నాశకుడ నైతివి. బాహ్యనేత్రమునకు ఆల్మూర గొప్ప పట్టణమైన ఐయుండవచ్చును. అందులకేమి లోజీవము లేకు న్నది. సహజప్రేమను గోల్పోయినది. రాజ్యమును ప్రేమ ప్రభావముచే పాలించుటకు బదులు కఠినవిధానముచే పాలించు చున్నది. అందుచే ధర్మము నశించినది రాజ్యమేరీతి యుం డునో రాజు ఆరీతినే యుండును. ఈ యఖండభూఖండము నంతయు నాకిత్తు నన్నను వలదు వలదు ముమ్మాటికి వలదు.

గోకల—ఓహో! ఇదియేమి విపరీతము! ఇంతకాల మునుంచి ప్రేమమూర్తివని ఎంచకుంటిని.

సాదా—చందు! సావధానముగా ఆకర్ణించుము. మరణకాలము సమీపించునపుడు మానవుడేరీతి తన హృద యాగారము తన ప్రేమపూర్త్ములకు తెఱచి చూపునో అదే రీతి నీకు నారహస్యమును వెల్లడించుచుంటిని. ఇక నేను లజ్జచే హృదయకవాటమును మూచియుంచిన లాభములేదు.

"చందు చందు చందు" నా ప్రేమమూర్తివి నీవె? ముమ్మాటికి ఏలటు వణకెదవు. సముద్రమందున్న రత్నములు పల్లెవానికి దొరకుట వినవే! ఏనాడైతె నావనపరిసరముల తిరుగాడుచుండగా నీ సహజకాంతివంతమగు ముఖవికాసమును నేత్రానందముగ గాంచియుంటినో ఆనాడె నాహృదయాగారము నీపరమైనది. నిశ్చయము. ఇది మోహసంబంధము గాదు. పవిత్రమైన ప్రేమ నీవపుడు విద్యావిహీనుడవైనను కాళిదాసుని చరితంబును స్మరించి నిన్నంతవానిగా చేయ నిశ్చయించి యీఅయిదు వత్సరములనుంచి నీకు ప్రతిదివసము సంస్కృతహిందీ సాహిత్యములందు నాశక్తినంతయు నుపయోగించి జెప్పియుంటిని. ఎందువలన అంతగా నీకు బోధించియుంటినో నీయంతరాత్మ నీకిపుడు బోధించుచుండలేదా? ఏమటు జూచెదవు. నాజీవిత నౌకను ప్రోత్సిమచే నడుపగల్గుదువని ప్రేమస్వరూపుడ వగుదువని నీభౌతిక దేహము నాయందు లేకున్నను నీప్రేమస్వరూపము నాహృదయాసీనమందలంకరింప జేసియుంటిని. జీవచ్ఛవంబులైన రాజ్యంబులు నాకేల ముమ్మాటికి నిన్నె వరించియుంటిని. పలుకవేమి స్తబ్ధుడవై యుండనేల? నాప్రేమను నాప్రకృతీమతల్లి యెఱుగు. ఆమెసాక్షిగ నిన్నిదివఱకె వరించి యుంటిని. నేను నీకు భౌతిక సౌఖ్యములచే కూర్చలేకున్నను నాతల్లియగు ప్రకృతిచే నీకెన్నోవరము లిప్పించెద. నాసర్వస్వము నీకర్పించెద. కంపింతువేమి? నాపలుకులు నీకు ములుకులై నొవ్వజేయుచుండెనా? నేను వివాహితనైతిని. నాహృదయ సీమయందు

నీయిచ్ఛవచ్చినట్లు విహరింపుము. ప్రేమామృతమును గ్రోలుము. మత్తిలినిద్రించుము. భగవత్స్వరూపమును గాంచుము. అందరిస్త్రీలవలె నీకు నే భూతమునై శ్మశానవాటికి నడిపింపను. వినుము. ఆనందదాయియగు విశ్వరాజ్యమునకు సహాయభూతురాల నగుదును.

గోకుల—ఏమిసౌదామిని! నీధైర్యము, మూఢత్వము గొప్పరాజుకు భార్యవు కానుంటివి. గొప్పజమీందారుని కుమార్తెవేమి? నావంటిబీదవానిని వరునిగాగోరుటేమి? ఇది యంతయు మహాచిత్రముగా నున్నది.

సౌదామి—చిత్రమా? జగమేచిత్రము! ప్రేతవివాహము మహాచిత్రము. నీయంతరాత్మ ఏమనిపల్కుచున్నదో నన్నువిననిమ్ము?

గోకుల—నా అంతరాత్మ స్తంభించియున్నది. మూగ్రై యున్నది.

సౌదామి—కానిమ్ము! నాశపథము నాలకించుము. జగమునందు నాకు మరొకవివాహము లేదు. నా అంతఃకరణమందున్నస్వామిని పరులకధీనము జేసియుంటిని. నాయొక్క ప్రేమను అంగీకరించుచో అంగీకరింపనిండు. లేకున్నచో నిసుము వినుము. విరాగినై మానవసేవ, మాతృసేవ జేయుచు ఇచ్ఛానుసారము దేశమెల్లెడల తిరుగాడెదను. వింటివా? ఏల కంపింతువు.

గోకుల—కంపించ కేమున్నది. హృదయము ద్రవ్య లగుచున్నది. ఇట్టికఠినశబ్దముల ఎన్నడేని వినలేదు. సీమంతినీ, నీకింత తెగవరితనమువలదు. జననీజనకులమాటమీరుటతగదు.

సౌదామి—ఇంకను నీపిచ్చినినువదలలేద? జననీజనకుల మాటచొప్పున గాద మూఢముగానమ్మి వివేకమును గోల్పోయి భారతదేశము యిటులైనది. ఏనాడునీవు వలదం దువో ఆనాడె నాస్త్రీత్వము నశించును. నేచుకన్పించు సౌం దర్యలత వైరాగ్యముచే నిర్దయగా ద్రెంపబడును. స్వైరత బూని భూవలయమున తిరుగాడును.

గోకుల—నిన్ను వితర్కించు నేర్పు నాకడలేదు. నాకు విద్యనేర్పిన తల్లివి నీవు. నన్నిట్లుగోరుట పాడిగాదు. అదియు గాక బంధరూపకమైనవివాహమున నామనస్సంటియుండలేదు.

సౌదా—ఇదియెట్టి తత్వశాస్త్రము చాలు, చాలు. ఇదినవీన వేదాంతము రత్నగనిత్రవ్వలేక రత్నములబోలుఱాళ్లను ఏరుచున్నది. కులమొండితనమును పోనివ్వకుంటివి? సౌందర్యవంతమగు, ప్రేమవంతమగు ప్రపంచకమును భగవానుడేల సృష్టించి యుండెనని తలంచితిని. జగజ్జననీమ తల్లియగు ప్రకృతి వైకుంఠాలయమునకు ద్వారపాలిక. ఆమెకు అనుగుణముగ నున్నవానినే ఆమె లోనికిబోనిచ్చును. ఆమెచంటి యందు ఈశ్వరుడు పాలనుగ్రోలుచున్నాడు. ఆమెకరుణవచ్చి చంటిపై చెంగును తొలగించి ఆ దేదీప్యమానసుడగు ఆబాల

కుని గాంచగలవు. ఆతల్లిని వ్యతిరేకించి జయమును బొంద నసాధ్యము.

గోకు—అటులైనచో బుద్ధదేవు డేలసన్యసించె, శంక రుడేల చైతన్యుడేల?

సౌదా—కోతినిజూచి నక్క వాతవెట్టుకొన్నటులా? వారు మహాపురుషులు. మానవజాతికి 'మోహామంధు మునుం గవలదని' చాటుటకు అటుల జేసియుండిరి. వారు అధ్యాత్మిక ధీరులు. చెడుమంచులు ఎల్లకాలము ఒకటివెంట ఒకటిగా నడ చును. చెడునందు మంచిగద్దు! మంచియందు చెడుకద్దు. భగ వానుడు నీకు బుద్ధియేల యిచ్చెనో విశదమా? వివేకము నుపయోగించి చెడునందున్న మంచిని గ్రహించుటకు, మంచి యందున్న చెడును విడిచిపెట్టుటకు అంతియేగాని పూర్ణ ముగా చెడును వీడుట మానవునకు సాధ్యమునుమీ? నేను నీకుగురువని భ్రాంతిపడుచుంటివి అది మూఢనమ్మిక. భార్యకు భర్తవిద్య గరపుటలేద, అతడు తండ్రి యగుచుండెనా? కాళి దాసునకు కాళి ప్రత్యక్షమై యిచ్చిన సందేహనివారణెద్ది యొజ్ఞప్తిగలదా?

గోకు—నేను వాదనందు గెలువలేను సౌదామిని, చాలకాలమాయెను వెళ్ళవగునా?

సౌదామిని వగచి 'మీరెచటకు వెళ్ళినను నాహృద యము మీయందెయుండును. నన్ను మఱువకుందురుగాక'

యని లజ్జావదనముతో బల్కెను. గోకులచందు తడబడుపాద ములతో సోపానములదిగి గృహాభిముఖుడు కానుండెను. మరొకద్వారమునుండి సౌదామినితల్లి ఆమె వికలచిత్తమును గుర్తించి కాబోలు ఆమె కేద్దియో బోధించ వచ్చుచుండెను. అలజడి జెందు హృదయముతో గోకులచందు త్వరితముగా ఉద్యాన వనమును దాటివెళ్ళెను.

---

## మూడవ ప్రకరణము

నవీనుని వివాహము మూడుదివసంబులుమాత్రమే గలదు. ఆతనిపట్టణమగు ఆల్వార నవీసలంకారముతో శోభ యమానముగనుండెను. రేయివిద్యుద్దీపములచే పగులుగను, పగులుచలువపందిళ్ళఛాయచే రేయిగను మారుచుండెను. ఇతని స్నేహితబృందమంతయు పరదేశములనుండియు మూగు చుండిరి. నవీనునివివాహము నవ్యలావణ్యముగ నుండునని యాపురవాసులు తలంచుచుండిరి. విధికృతమెటులుండెనో ఎవ్వానికెగోచరముగాదుసుమీ! ఆహావిధివిచిత్రములు, ఆహా సర్వేశ్వరు చైదములు! ఆహానాగేశ్వరపురవాసులముఖ విలా సము లేమాయెను. ఎందుదాగెను. సూర్యకాంతిని కారు మబ్బులు మఱుగుపఱచునట్లు, ఆయూరిప్రజల ముఖవికాస మును దుఃఖవార్త యొకటి మఱుగుపఱచెననియె జెప్పదగును.

హాహాకారములు విచారదేవత అణగద్రొక్కుచుండెను. సర్వ జనులు ప్రతిదినమాచరించు కృత్యములనైన ఆచరించనొల్లరైరి. ప్రతివీధి యందును జనసమూహములు మిక్కుటముగా మూగదొడగెను. గొప్పలెల్ల జమీందారుని భవనముకై వడి పరుగులిడుచుండిరి. యీ ఖేదమును పడతులెల్ల గవాక్షముల కడనుండి విచారనేత్రములతో తిలకించుచుండిరి. ఆబాల గోపాలమూం పూట నిరాహారదీక్షనుబూనిరి. వీధులందు అశ్వములనెక్కి సిపాయిలు బహువేగమున వెడలుచుండిరి. ఈదుఃఖకరమైన దృశ్యమునకు వాయువుసైతము భోరున రొదసేయుచుండెను. ఈవిచారదృశ్యమునుగాంచలేక సూర్య భగవానుడుదయించ లేదు. దాసదాసీజనంబెల్ల రాజకన్నియ ఉద్యానవనముకై ఏగుచుండిరి. ఆవనమంతయు గంభీరతను గోల్పోయి సౌందర్యశూన్యమై నిశ్చేష్టితమైయుండెను. పాఠక మహాశయా ? ఈకరిణదృశ్యమునకుగల కారణమెద్ది? మన సౌదామిని ధర్మరాజ్య పరిపాలనకై ఏగుటయేకారణము. భారతదేశమంతటను మూగియున్న అంధకారమును చండాడ మెఱుపువోలె ధీరతతో ఏగిన సౌదామినిగుఱించియే! ఆరాజ్య మునకంతయు రత్నమై వెలింగినకన్యను ధర్మదేవత అపహరించినది. తననిగూఢప్రదేశములకు గొంపోయినది. సౌదామిని తనబిడ్డయని చాటనున్నది. శిరోజములనిమిరి, బహువిధాలంకారము జేసి, హృదయసీమను నవ్యలావణ్యమగు పుష్పరాశిచే

అలంకరించి, తనచంటిపాలచే పోషించు తరువాత బంప నున్నది. ఈపెను వెతుకగ వెళ్లిన సూర్యభగవానుడుసాక్షిగ గగనమందు సంచరించవచ్చియుండెను. ధర్మదేవత తన ముసుంగుచాటున చాటి దాయుటచే భూఖండమునకు సాక్షి భూతుడైన సూర్యునకేని గనిపింపకుండెను. ధర్మదేవతకంటె సూర్యుడు హెచ్చు విధివిధానము ధర్మము. ఆధర్మము యొక్క ఆజ్ఞానువర్తియై రవిసైతము తనకార్యక్రమము జరుపు చున్నాడు. అట్టిసూర్యునకు తనగుట్టును జెప్పనాధర్మదేవత, అదియునుంగాక తననింతవఱకు సాధించుచున్న అధర్మ దేవతను సాధించునిమిత్తమై ఏకాంతమున తననేర్పునంతయు ప్రోవుజేసి తయారుజేయుచున్నది. ఆయంత్రమునకు జీవము పోయుచున్నది. తన తెలివి తేటల నంనుపయోగించుచున్నది.

సూర్యుడు ఖిన్నుడై తనయాశాభంగమును వెలిబుచ్చు చున్నాడు. నిశ్చేష్టితుడై ఆలోకరవంకనె తన కిరణజాలిని నిగిడించి జూచుచున్నాడు. ...గ్గురశ్వములపై ఆలోకరాను ప్రవేశించిరి. వారినేత్రము విచారపానీయముచే ప్రక్షాళన జేసి కొనుచుండెను. ఆరాజ్యవైభవలంకారముల జూచి మరింత వారిస్వాంతములు కలతజెందుచుండెను. బ్రహ్మాండ మైన విచారవార్తను నవీనుని కందిచ్చిరి. నవీను డుగ్రు డాయెను క్రోధానలము హృదయసీమయందు తాండవించు చుండెను. రోషాయత్తచిత్తుడైనాడని అతని నేత్రద్వయమె

తెల్పుచుండెను. ఎట్టి సాహసకార్యమున కైనడంగ నిశ్చింతుడై యుండెను. పలువుర పెద్దల పిలిపించెను. ఆలోచనాపరులెల్ల అతని జూచిన కొలది హడలుజెందుచుండిరి. అందు త్తమునిచే యీక్రింది లేఖను చదివించెను.

వాగేశ్వరము
9—ఏప్రిలు—1659

"మీకీ క్రింది విచారవార్తను దెలుపుచున్నందులకు చాలగా చింతిలుచున్నాము. రేపటిదినము వివాహనిశ్చితము సర్వజనవిదితము. విధికృతము మనవాంఛలకు వ్యతిరేకించి యున్నందులకు మాస్వాంతము ప్రవాహరూపముగా మారి మీకడ కేతెంచియున్నది. నిన్నటి రేయినుండియు మాగారాబు పుత్రిక కన్పించుటలేదు. మారత్నమును ఎవ్వరే అపహరించి నటుల అనుమానించు చున్నాము. జరుగనుండవలసిన వివాహము చాలమంది కయిష్టముగా నుండెననియే యోచించితిమి. ఈ క్రూరకృత్యము మీవిరోధులెవ్వారే జేసియుండనోపు. అశ్వనీదళమును నలువైపులకు నేడే బంపియుంటిమి. ఈఘటనము కొద్దిదినములకు భేద్యముకాగలదు. ఇందు మీ ప్రయత్నముకూడ తోడుకావలసి యుండునని తలంచెదము. ఇట్టి విషమపరిస్థితుల కల్పించినందులకు దైవమును దూరుచున్నాము

కృష్ణసింహు.

ఈవిచిత్రమును విన్నవారి హృదయములు తావుల దప్పి చరింపుచుండెను. సాహసించి మాట్లాడుటకు పెదవులు స్పందనమందుచుండెను. ముఖములందు వ్యాపించియున్న రక్తమంతయు హృదయ గుహాలకు వేగమున జొరబడి యుండెను. కొందరి హృదయములు రోషముచే దహింపబడు చుండెను. నవీనుఁడుద్వేగపూరితుడై వారిమధ్య నిలచి యీ రీతిని గంభీరవాక్కుల కురిపింప మొదలిడెను.

"ఈచిత్రము నంతయు మీరు సావధానులై వినియె యున్నారు. ఇదియెల్ల నిశ్చయముగా కృష్ణసింహుని కల్పన యని నేను రూఢిగా జెప్పగలను. ఆకన్యకు ఈ వివాహ విషయమై సంపూర్ణసమ్మతి లేనటుల వినియుంటిని. అద్దాని గప్పిపుచ్చుటకై పన్నిన పన్నుగడమిది. దీనికి ఉపసంహా రమును చేయకొల్లక నుండను. ఈ అవమానము ప్రతి క్షణము నాహృదయమును భేదించుచున్నది. ఇట్టి అవమాన మును మానవుడెవ్వడు భరించబోడని మీకుదెలసియే యుం దును. ప్రతిక్షణమిది నాహృదయము నీసమాచారము చిత్ర వధజేయుచున్నది. ఆకన్యను కృష్ణసింహు డెచ్చోటనోదాచి యుంచి యీాయుపాయమును పన్నియుండును శ్రద్ధతో ఆల కించుడు. నాఆజ్ఞగాగై కొనుడు. క్రియరూపున దాల్చుడు. ఈవచ్చిన ముగ్గురుయోధుల ఖైదునందు యిదెనా ఆజ్ఞగా బంధించుడు. ఇరువదొక్కదినములో యుద్ధపరిసరముల

నన్నిటిచక్కగా సమకూర్చి వాగేశ్వరమును శ్మశానవాటికగా మార్చవలసినది. అంతవరకు నాక్రోధాగ్ని చల్లారనేరదు. కాదు. కాదు. ఈవచ్చిన ముగ్గురిలో ఇద్దఱమాత్రమే బంధించి మూడవవాని శిరమును బోడిగామార్చి యీపై వార్తను కృష్ణసింహుని కంపుడు. ఈయిరువదొక్కదివసములలో సక్రమముగా వారి పుత్రికనుయిచ్చి వివాహముజేసిన ఉభయపక్షములవారు అన్యోన్యకూర్మిని ఉండగలరు. లేనిచో సత్యముగా యుద్ధమునకు వారు మమ్ములజేసినపరాభవము కారణముకాగలదు". ఈ పైకఠినశాసనములకు అచటకు జేరినసభ్యులు కృష్ణసింహుడుజేసిన నీచకార్యమునకు తగిన భైషజ్యమని నవీనుని పొగడిరి. నిరపరాధులైన ఆ యిద్దఱయోధుల బంధించ వీరియోధులు నుంకించిరి. నక్కపై సింహబలమా? ఆయిద్దఱయోధుల హృదయగుహాలందు జ్వాలాగ్ని ప్రజ్వరిల్ల, రోషమున చాటినవారితనువులు దాగుకొన వారిపైకురుకు యోధులనెదిర్చిరి. చావనైనచత్తుము కాని శృంఖలాబద్ధులము కానేరమని నుడువుచుండిరి. రోషకూసములన్నియు ధ్వనించుచుండెను. యోధుని ధర్మమును వారుచక్కగా నెఱవేర్చిరి. అయిననేమి? వారిఖడ్గకౌశలము క్రిందచాలమంది హతులైరిగాని, ఎట్టకేలకు వారియధీనులు కావలసివచ్చెను. ఈదృశ్యమును పరికించుచున్న భూఖండసాక్షి అతనికోపమును మరింతఅగ్నిచే జూపుచుండెను. యీ

ఘటన మంతయు వాయువుచే వాగేశ్వరమున కంపబడ్డది. ఆహా ఏమి సంఘటిల్లినది వైభోగముల దేలుచున్న వాగేశ్వ రమునకు చిన్నతనమునుంచియు అల్లారుముద్దుగా పెంచబడిన పుత్రికను గోల్పోయిన దుఃఖసాగరమెగాక యవొకవార్త. ఈశ్వరా నీపరీక్షయేమి ? ఇంతకఠినపరీక్షయా ? దుర్బల మానవజాతికా ! అందు వయోవృద్ధుడగు కృష్ణసింహునకా! మరియు ఒక జమీందారునకు గొప్పరాజుతో సంఘటనమా? విధీ ! నిన్ను నిర్మించిన విధాతకాఠిన్యమేమని జెప్పదగును.

ఇందుకు మానవుడేరీతిప్రతిఘటన జరుపవలెను. ప్రతి దివిధికృతమని మర్త్యుడు లొంగియుండవలెనా? ధర్మదేవతకై పలుకష్టములను ఫలహారమును నైవేద్యముగ అర్పించవలయు ను. వృద్ధాప్యముచే శరీరము ముడుతలువడినను రక్తనాళము లందుప్రవహించుచున్న శక్తిసక్రమముగానె క్షత్రియకులోత్త మునకు సర్వవేళల నుండగలదు. ఈవార్తకు అంతఃపురకాంత లెల్ల శోకాగ్ని లొకవైపు యవుచు మరొకవైపు రోషాగ్నిచే మండిపడుచుండిరి. భగవచ్చిత్రమా ఇట్టిచేష్టలు నీకు తగును! మానవుడొనర్చిన పరిహాసించకుందువా? కృష్ణసింహునకు యీవార్త వీనులపడినవెంటనె తనరహస్యాలోచనా సభ్యుల రావించి జరిగినవిశేషము నంతయు వివరించెను. కృష్ణసింహుని నిరపరాధమునకు ఖిన్నులైరి. రాయబారముల చేతనైన సంధిప్రయత్నముల బడయుదమని ఎల్లరు దలంచిరి. జరిగిన

సంఘటనము బట్టిజూడ నవీనుడు హిమాలయాపర్వతశిఖరములు సంచరించుచున్నట్లు ఆతనిచేష్టలచే సర్వవిదితమైనది లేకున్న సందేశమును గొనివచ్చిన యోధుల బంధించుట న్యాయమా? ఇదియేటివింత! అట్టి హిమాచల శిఖరముల నుంచి భూమికై పైకిదించుట మానవున కతికష్టమని కృష్ణసింహుని సహచరులు దలచిరి. యుద్ధమువలన వృధాగా జననష్టము, స్త్రీలదుఃఖము, బీదలకరవు, వ్యాపారలోటు, సస్యఫలకాటు మొదలైనవన్నియు జరుగగలవు. గెలచిన వాడేని సంతోషించునన్నచో అదియు జరుగనేరదు. అనేక బంధుమిత్రువుల గోల్పోను. వలసివచ్చును. రాజ్యమరాజకమగును. ధర్మము క్షీణించును. ఇట్టి వెన్నియో జరిగియుంట జూచియుంటిమి. సత్యమునకు వృద్ధుడగు కృష్ణసింహుని తప్పులందేమియు లేవు. కాని మధాంధుడై నవీనపానీయముచే మత్తిల్లిన నవీనుని క్రోధాగ్నికి తల లొగ్గుటకంటె జయాపజయములు భగవదాధీనములని తలంచి ధర్మదేవతను కాగలించుకొంటమే ప్రతివాని పరమపావనమైన ధర్మమని కృష్ణసింహుని అనుచరులు తీర్మానించిరి. కృష్ణసింహుడు తన విశ్వాసపాత్రులైన అనుచరులతో యీాదిగువగా గద్గదకంఠముతో పలుకసాగెను. ఆత్మీయులారా? నేను జెప్పబోవు పలుకులన్నియు నాహృదంతరాళము నుండియు జలదరించుచు వచ్చుచున్నది. నాకిప్పటికి డెబ్బదివత్సరములు పూర్తిగా

నిండినవి. నా ఏలుబడిలో నాప్రజకు నేనెట్టి సంబంధమైన నొప్పినే కలుగజేసియుండలేదు. కలుగజేయు తలపులేదు. సహజరీత్యా వచ్చుచో వెనుదీయునది లేదు. ఈ వృద్ధాప్యమున నన్నీసంఘట్టములన్నియు ఏపుకతినుచున్నవి. స్వాంతము నాయధీనమందుంటలేదు. పలు పలువిధముల పరువులెత్తు చుండిరి.

పరువుకై నాప్రాణము ధర్మశిఖోత్తునుదీర్ప సంసిద్ధురాలై యున్నది. శరీరము కంపించుచున్నది. తలచిన తొట్లచున్నవి విచారభావములు. అల్లారుముద్దుగా బెంచినపుత్రికను గోల్పోయితి. ఆమె నాకీవివాహము వలదన్నను మూఢత్వమూనియుంటిని. అదియె నన్నింతవఱకు దెచ్చినది అబలకు తగు స్వాతంత్ర్య మివ్వకున్నచో పురుషునకిట్టి ఆపదలే వచ్చుచుండును. విద్యావతి వివేకవతి పుష్పవతి అట్టి హృదయవికాసినిని యిడుముల గుడుపుచుంటిని. నవీనుని క్రూరము నవీన మోహాత్వము నాతల్లి యగు సౌదామినికి తెలిసియె యీతీరున జేసియున్నది. ఆపె స్వాతంత్ర్యమును కాపాడు కొన్నది. విధికృతిచే యీవివాహమె నెఱవేరినచో నను కూర్మితో జూచు నాకూతున కెన్నియిక్కట్టు వాలు జేసెడివాడో! ఒకవిధమున విధాత మంచినె జేసి యుండెనని నా అంతరాత్మ తలచుచున్నది. నాపుత్రిక బుద్ధికౌశల్యముచే భగవన్నిర్మితము లగు కష్టముల నవలీలగ జయించగలదని

నాదృఢనమ్మిక. ఈ విషమపరిస్థితి కనులార జూఁచినచో నా అల్లారుముద్దరాలగు సౌదామిని నాకేమని సలహా యిచ్చి యుండెడిదో? అయిన కార్యమునకై వగవపనిలేదు. కాని నేను దృఢముగా బహిర్గతముగా వక్కాణించెడి దేమనగా యికముందు భారతదేశము అబలల ఆ, ఆ, అబలల ఇచ్ఛలకు వ్యతిరేకముగా వారి తల్లిదండ్రులు నడువగూడనిదే స్త్రీ మహాశక్తి. ఆమె ఇచ్ఛానుసారముగ పురుషుడు తన వివేకము నుపయోగించి కంటకమయమగు యీప్రపంచ మధ్యంబున చరించవలెను. వచ్చిన యిక్కట్టులు వచ్చెను. ఇప్పుడు జరుప వలసిన మన విధ్యుక్త ధర్మమేమి? నారాజ్యము చిన్నరాజ్య ముగానుండు నాశరీరము వృద్ధాప్యముచే దూరబడనుండి నా అంతఃశక్తి నా ఇచ్ఛాశక్తి ప్రజ్వరిలుచున్నది. ఇది అత్యు న్నతమైన ధర్మము. ఈ ధర్మమందునను వీరస్వర్గరాజ్యము గాంచనిండు. యుద్ధమును ప్రవేశపెట్టినది నవీనుడు దానికి తగిన యుపాయముగ ప్రవర్తిల్లవలసిన దక్షులుమీారు. ఇంత కాలమునుంచియు మన భోగములందు శక్త్యుపాసన జేయు కుంటిమి. అట్టికాలము సన్నిహితమైనది. ఇదె నాఆజ్ఞ. నాదు అనుచరులైనను మీారె? నాకొలువునందు అధికారబృంద మైనను మీారె? ఈక్షణమునుంచి యుద్ధము పరికరముల బాగుజేయించుచు భవిష్యత్తును పరికించుచుండుడని జెప్పు చున్నాను'' అటనున్న సభ్యులందరు శ్రద్ధావశులై పైవాక్య

ముల వినిరి. రక్తనాళములందు జీర్ణించుకొనిరి. ప్రభు వింత వఱకు వారి కొనర్చిన మేలునకు వారి ఋణము దీర్చుకొన వలెనని దృఢనిశ్చయులైరి. రాజభక్తిని జూపించ రభసము జెందిరి. సభ ముగియుటతోడనే జయజయ ధ్వానముల గురిపించిరి. ఎవరి ధర్మమును వారు చక్కగా గుర్తించి కార్యోపాసకులైరి.

---

## నాలుగవ ప్రకరణము

విపినారణ్యము భయకంపిత దృశ్యములు ప్రణవమును ప్రకృతిమాధుర్యముగ ఉచ్చరించుచున్నది. సురటివలె సేద దీర్చు మారుతము కర్ణకుహరముల భీకరవృత్తిని ధ్వనించు చున్న విరావము. ఏటిదద్ది? క్రూరమృగములు విచ్చలవిడిగా చరించుచు క్షుత్తును దీర్చికొన ఆహారపానీయములకై నెమ కుచు రొదజేయుచున్నవి. వేడిగాడ్పులు నిర్దాక్షిణ్యముగా విసరుచున్నవి. ఎల్లుజూతమన్నను ఏదేని గమ్యస్థానమును జేర్చు బాట గనిపించుటలేదు. అడుగు వెట్టుదమన్న అడ్డ గించు క్రూరలతాదులు. ఆహా! ఎవరునీవు మూగదానవా? పలుకవేమి? సౌందర్యమును జూచుకొన్న గర్వమా? ఒంట రిగా రాకారణమేమి? అబలవనియైన గుర్తించకుంటివా? ఎట్టి క్రూరకృత్యములేజేసి నాయందు దాగుకొనవచ్చితివా?

మానవప్రపంచకమందువలె నిరపరాధ సంతానమును గల నాయీ ప్రదేశముల అట్టి జాతిని జొరనియ్యవని తెలిసికొనకుంటివా? ప్రకృతి నిలయమని భావించకుంటివా? ముందు నా కఠినపరీక్షకు లోనుగావలెననియైన భావించకుంటివా? యని ప్రకృతి ప్రశ్నించుచున్నదో యన వేడిగాడ్పులు నిప్పుల వర్షమును గురిపించ భూమి నిర్దాక్షిణ్యతను జూపించుచుండెను. ఈ కఠినపరీక్షను జేయుచున్న దెవ్వరని? ఎందునిమిత్తమై? అల్లారుముద్దుగ తన ఆశయముల నెఱవేర్చునని యెంచి తన చంటిపాలనుండి స్రవించు శక్తివంతములైన పాలచే పోషించి మృదుమధురమైన సంగీతసాహిత్య విద్యలనేర్పి పోషించియున్న ప్రకృతీమతల్లియే తన ముద్దురాలగు 'సౌదామిని' నిర్దాక్షిణ్యముగ ఆమెయందు ప్రవర్తిల్లుచు ప్రశ్నలను కఠినముగ నైచుచున్నది. ఈచర్య తల్లులకు న్యాయమని తోచునా? తోచును. భగవానుడు తన కృపారసము మానవజాతిని సృష్టించి సకలసౌకర్యముల సమకూర్చి అతని యపార ప్రేమను వారిని యిడుమల గుడిపించుటందె జూపించుచున్నాడు. దయాసముద్రుడు గనుకనే అతని శక్తిని జ్ఞాపకముంచుకొని ప్రవర్తిల్లమని యిక్కట్టుల గుడుపుచున్నాడు. ఆవిధముననే 'సౌదామినిని' ప్రపంచకమునందు ఎత్తిజూపు తలంపుతో ఆకన్యను ముద్దుగాపెంచిన తల్లియే నేడు కష్టముల గురిపించుచున్నది. ఈశ్వరా ఏమి నీకఠినపరిపాలన?

నిన్నదమూయించువార లెవ్వరేయనియూ? చాలు చాలు! సోపానములనుండి సైతము క్రిందకుదిగి యెఱుంగని కన్నియకా ఇన్నికష్టములు! ఏమి ఔష్ణ్యము తాళలేకున్నది సౌదామిని నిట్టూర్పుల బుచ్చుచున్నది. సాహసించిన స్త్రీజాతియె సాహసించవలయు. పురుషునకుగాని కార్యములు స్త్రీజాతియె సాహసించ వలయును. వారియందు అనంతమైన శక్తి కలదు. మృదుపదంబులు తడబడు చున్నవి. ఆహా విధాతా రక్షింపుము. యని దీనారవముతో పలుకుటకైన విధాతకరుణబూనలేదు. దాహముచే నోరుకదల్పలేకున్నది. నాలుకందు నీరు స్రవించుటలేదు. నేత్రములు ఎర్రనై యున్నవి. ఆహా ఎన్నియామడలనుంచి యీయబల నడచివచ్చుచున్నదో? ఏవేళయందు బయలుడేయున్నది. ఎవని యాస్యమును తిలకించి యుండెనో? ఇదియేమి కష్టపరంపర. ఆకన్య ఔామ్ము స్పందనమందుచుండెను. సూర్యభగవానుడు కఠినముగా కిరణములచే యీసుభగమను పీడించుచున్నాడు. ఎచ్చటనుపానీయము లేదు. ఎండమావులు భ్రమింపజేయుచున్నవి. ఏమిచేయవలయు! ఎంతవఱకు యీకష్టపరంపర యీయబలను వెంటాడును. ముఖవికాసమును హెచ్చరించుచున్న బొట్టుఎండ వేడిమిచే స్రవించుచున్నయది. ప్రకృతియంతయు వికావికనవ్వుచున్నది. ఏమని "ఓ అల్పమానవుడా! నీవు సౌందర్యప్రతిభనీజాతియం దుపయోగకారినిగాని మావిధివిధానమందేమియుపయోగము. నిన్నిట్లుబంధించుచున్నందులకు మాకు

విచారకరమె. అయిన చేయునదేమున్నది. మానవునివలె ధర్మ మును మఱచిమ త్తిలియుండలేము మావిధ్యుక్త ధర్మము నెఱ వేర్చవలెను. విధివిరామము లేదు. మాకునిద్ర లేదు. ఎల్లకా లము మాధర్మములందు నిమగ్నులై చరింపవలసినదె. మేము కరుణయనుమాట నెఱుంగము. మాహృదయములనుంచి అప్రయత్నముగా రావలెను. ఏమి? కరుణామహిమ! ఇంకను మాచర్యను అతిక్రమించపోజూచిన ఓ సుకుమారి? నీవంతము జెల్లదు. అల్లదెఱమలకవృక్షము, తపోవృక్షము, పరమపావన మైన వృక్షము. ఆవృక్షఛాయయందు యీవేళ కొద్దిగా విశ్రమించుము తదుపరి నీక్రియా కలాపమున నీవు బయల పడవచ్చునని బోధించుచున్నదో యన ప్రకృతీలలామ కన్పిం చుచుండెను. ఈబోధను ప్రకృతిభాషను చక్కగా నెఱిగిన సౌదామిని ఆవృక్షముక్రింద పైటచెఱగును పరచుకొని కను మూసెను. శయ్యాతలంబుల నిద్రించు కన్యాలలామగతి యే రీతిని మారెనో తిలకించుడి. మృగతృష్ణలచే తొట్రిలిన ఆ పడతి గండభాగములపై చెమ్మటలుజాఱ సుషుప్తియందు పూర్తిగా మునింగెను. భీకరమైన స్వప్నముల గాంచెను. ఏమని! ఆకాంతారమధ్యమందు తన్నెవరోయిద్దఱుపురుషులు బంధించనున్నట్లు దిగ్గున శరీరము కంపించ లెగచి కూర్చుండ బూనెను. స్వప్నమునుగాంచి జాగ్రతబూని యింకను వణక నేల! సౌదామిని! ఏల కంపించెదవు. నీయొక్క స్వేచ్ఛ నెవ్వారలే మలినీకరించిరా! కనుబొమలు ముడుపోను పను

చుండెనా? ప్రకృతి బిడ్డవేమి? నీకీ కష్టపరంపరేమి? ఆమె యందు ప్రవహించుచున్న ప్రాణశక్తి, తావుల్లప్పెను. పై కెగయనుండెను. ఏమది! అంతటి యుపద్రవమేమి? ఈమె దుస్థితికి తాన్నైజములెల్ల నివ్వెఱపోయి అట్టె జూచుచున్నయవి! ఏమిటావింత! ప్రపంచకమున నెట్టిదో యెఱుగని, కాంతార మధ్యమందు క్రూరమృగంబులు సంచరించు స్థలంబుల కాలా ప్రవాహంబునబడి వచ్చిన ఒక్కతైను భగవాను డెన్నో దుర్ఘటనముల కలిగించుచున్నందులకు! ఆమెనయనములందు రబ్బుజీరలు నశించుచున్నవి! ఎందులకు? ఆపె కిరుప్రక్కల యిద్దఱ కిరాతపురుషులు, ఆజానుబాహులు నిలబడి యుండిరి. వారి ఒఱలందు మెరయుచున్న ఖడ్గములు ఔపహారికమును గోరుచున్నవి. ఆకొనిన సింగములవలె కాఠిన్యమును జూపు చున్నవి. వారి యాకారములెవ్వి? వారిలా! వారు యోధు లైయుండవలయు. లేకున్న యాఖడ్గసామ్యము వారికడ కాన్పించనేరదు. వారిదుస్తులు యోధుని దుస్తులు. వారిపాగ యోధుని కుండదగిన-పాగయె. సర్వసాధారణముగ నవ్వాటి యుక్తప్రాంతమువారు ధరించు పాగలఁబోలియే యున్నాము. చామనచాయను గల్గిన కాయముగలవారు. అందొకని ముఖవైఖరిని బరికించచూడ ఏమని తోచుచున్నది. అల్లదె మహామ్మదీయుని బిఱ్ఱుముఖంబు. కరుణారసమున దడుపబడి వానిముఖమున బ్రహ్మచే నరములనేత నేయబడ లేదు.

కాఠిన్యతయందు పూర్తిగా కాగి చల్లార్చబడి యుండెను. ద్వితీయపురుషుని ముఖవైఖరేద్ది? సమ్మేళన మందినది కరుణ కాఠిన్యతలచే అవసరావసరములబట్టి ఆశక్తులు విజృంభించి క్రియారూపమును దాల్చుననవచ్చును. ఇతనిని బట్టి ఏమని నిర్ణయించదగును. తగును క్షత్రియకులాంశుడగు నేమోనని, మన సౌదామిని—కఠినశయ్యనుండి కండ్లు తెఱచునరికి యీ కఠినదృశ్యము. ఆపురుషులిద్ద రొకేతీరున యీకన్యవంక నె దృష్టినిగుడించి చూచుచుండిరి. ఒక కాంతారమధ్యమందు ఒక కన్యచుట్టు యిద్దఱు పురుషులు మూగియుండుటా? ఎందుకై వచ్చిరో? వారి ప్రక్కనె ఏమిగలవు? అశ్వములు గలవు. వృక్షముల చెంత జీనులచే నలంకరింపబడిన రెండు అశ్వములు బంధించబడి యుండెను.

ప్రథమపురుషుడు—యువతీ ఏలిచట ఒంటరిగా నుంటివో జెప్పగలవా ?

సౌదామిని—ఏల మీకా కారణములు; అబలను ఒంటరిగా గాంచి ప్రశ్నింప మీకెట్టి స్వాతంత్ర్యముగలదు.

ద్వితీయపురుషుడు—అవసరము గలిగినేో ప్రశ్నించు చుంటిమి.

సౌదా—అబలతోగల యవసర మెయ్యది.

ద్వితీయ—రాజాజ్ఞ ప్రతివానితో అవసరముగలిగి యుండును,

సౌదా—రాజెవరు?

ప్రథమ—ఎవరా? ఎవరినివలచి యీప్రాంతములకు వచ్చిరో వారు. ఇంతలోనె మఱపుగలిగెనా?

సౌదా—ఎవరిని వలచితిని?

ప్రథమ—ఎవరిని వలచలేద, హీనజాతికులస్థు డింకొ కడు దొరగానె మతిమల్లియుండెనా?

సౌదా—"జాతి, జాతి, హీనజాతియా? పలుకులు ములుకులు; ఈ చర్చకు సమయమిదిగాదు. ఆర్యులారా! మీమాటలమర్మము నాకెంతమాత్రము తెలియకున్నది. నన్ను కష్టపెట్టక మీరెవరో ఏకార్యమునవచ్చిరో దెలుప ప్రార్థన"

వారిహస్తములందు ప్రేలాడుచున్న సంచులనుండి రెండు పటములదీసిరి. అందొకదానిని యాభీతిల్లిన కన్యకై వడి జూపించిరి. అట్టె ఆమె నేత్రద్వయము మూతలుపడెను. అదె వరిపటము. నవీనుడా! నీకెట్టిహానియొనర్చెను సౌదామిని. భీకరవృత్తిని ఆమె ఎచటకేగిన అచ్చోటకే వెంటాడు చుంటివా? అబలహృదయమును హడలుబుట్టించ పురుషునికి న్యాయమగునా? ఆమెకు నీపై ఎంతమాత్రము ప్రేమలేదని యీమె చర్యలవలన గ్రహింపనేరకుంటివా? నీకేని సరియైన ప్రేమగలదా! ప్రేమయని యెద్దానిని సతతము నీస్వాంతమున తలంచుచుంటివో! సత్యముగా అది ప్రేమకాదు. కాదుప్రేమ, ప్రేమమహిమ అద్భుతము. అయ్యది జగమునంతయు వూపగలశక్తి. అది స్వార్థరాహిత్యము. యిక్కాలమున ప్రేమ

మానవుని హృదయాంతరములందు నివశించుటలేదు. ప్రేమ దగ్ధమగుచున్నది. దగ్ధమగుచున్నపుడు లెగయుచున్న ధూమమును పీల్చియుంటివి. అదియే నిన్నింతగా బాధించుచున్నదా? సత్యమైనప్రేమ మానవుని ఎల్లకాలముల ఆనందవాహినియందే తేల్చుచుండెను. నీయందు నీ ప్రతి రక్తనాళములందు యింకుకొని, వ్యాపించియున్న వస్తువెద్ది! అద్దానికేమని నామకరణ మిడెదవు. "మోహము" పిశాచము. భ్రమింపజేయు భ్రాంతి అది బాహ్యప్రదేశములందు తిరుగాడవలయునేగాని అంతః ప్రదేశముల అంతఃకరణమందు నివశించునది ప్రేమ. నశింపులేనిది. వృద్ధికారకమైనది. బాహ్యమందు నివశించునది మోహము. నశింపుగలది. నాశనహేతువు. ప్రేమ అంతరాత్మను ప్రేమించును. మోహము భౌతికశరీరమును వలచును. కానరాకున్నను ప్రేమదుఃఖించనేరదు. కానరాకున్న మోహమునకు కడగండ్లపాలె. ఇట్టిపిశాచము దరిజేరి ఓ నవీనుడా ఏలబాధపడెదవు. ఒక అబలను ఏల బాధించ జీవచ్ఛవంబవై వెంటాడెదవు. నీశౌర్యము వృద్ధదంపతులమీదనేగాక అబలారత్నముపైనను, అందు ఒంటరిగాజూచి పిశాచమువోలె బాధించనుంకించితివా?

సౌదా—అందున్నవా రెవరు?

ప్రథమ—ఎవ్వరా! సిగ్గునుబాసిన సీమంతి కేమని జెప్పవలెను. ఆలోర్మరపట్టణరాజ్యాధిరాజగు నవీనమహారాజు,

ఆకారముజూచియేని గుర్తించలేకుంటివా? ఆ మీసము లేవియేమి? మీసములు లేవు. నవీనునకు నవీన వేషము. నవీన నాగరికతయని "పులినిజూచినక్క వాత బెట్టుకొన్నట్లు" భగవత్సృష్టియైనమీసముల నాగరికమానవుడుక్షురకర్మ చేయించుకొనియుండెను. ఆరోగ్యనిమిత్తము, పౌరుషసూచకమైనమీసమును నవీనుడు పారద్రోలినాడు. బాలునకు పురుషత్వ మెప్పుడంకురించునో అప్పుడు మీసముల బొందుచున్నాడు. కర్మకు తగినవాడని మీసములు చెప్పకయే చాటుచుండును. అట్టి మీసముల మానాభిమానములగోల్పోయిన జ్ఞానితొలగించవలెను.గొప్పకర్మకాండనుశిరముపై ధరించిన రాజాధిరాజైన నవీనుని మీసములెవ్వి? బాలునకు మీసములుండవు. ఎల్లకాలము యీ ప్రపంచకములో బాలునివలె తిరుగాడెదనని జ్ఞానిమీసముల తొలగించుచున్నాడు. కాని మూఢుడగు నవీనుడు బాలుడా! ముప్పదైదువత్సరములు నిండావచ్చియున్నవోయన రూపము ఒప్పుచుండెను. రాజునకు యుండవలసి ముఖకళావిశేష మెంతమాత్రము లేదు. వేషధారిగనున్నాడు.

సౌదా—ఏమి యాగడము! ఇతడెట్లు రాజుకాగలడు. రాజు కళావిశేషము ఆవంతయేని కాన్పించుటలేదు.

ద్వితీయ—కనుకనె యింతదూరము తల్లితండ్రులబాసి రాజాధిరాజగు నవీనుని మగనిగ నొలక హీనజాతి కులస్థ

నెవ్వనినో వెంటాడి యిటులవస్తివి. అట్టివాని యాకారము నకు పొందిక పొందరా!

సౌదా—అగునగును. స్వజాతిజీవమును జంపుకొన్న వాడు హీనుడే? అయిన కానిండు నాతో మీకేట్టిపని. నే నెవ్వతనో తెలసునా.

ప్రథమ—తెలియకేమి? కుటిలాత్ముడగు కృష్ణసింహుని కూతురవు హీనజాతివానిని వరించిన వనితవు.

అని జెప్పుచు సంచినుండి మరొకపటమును బయటకు దీసి సౌదామినికి జూపించెను. సౌదామిని శరీరమున సంచరించుచున్న ప్రాణవాయువంతయు రివ్వున నేత్రద్వయముల కడకు వచ్చి యాగెను. కనులార ఒక్కపరియె జూడగలిగెను. లోనున్న జలమంతయు ఒక్కుమ్మడిగ పైకుబికెను. శరీరమును జలచ్ఛాయగా మార్చెను. 'ఓ సౌదామిని మానవజాతియందు యింకను బ్రతికియేయుంటివా? వారి నేత్రములయెదుట నీ రూపము నింకను చాచబెట్టుకొంటివా? ఇంకెక్కడి సౌదామిని! నశించినది నశించినది. ఓ నూత్నపురుషులారా! మీ. రాజుతో సౌదామిని శవమును జూచితిమని జెప్పలేర. సౌదామిని యందలి వాయువును వాయుదేవు డపహరించె ననలేర? లోప్రవహించుచున్న జలమును సముద్రదేవుడు మ్రింగె ననలేర. రక్తమందు ప్రవహించెడి ప్రాణమును అగ్నిదేవుడు ముద్దిడెననలేర. తరువాయి అస్థిపంజరమును భూదేవి తన

యంకమునందు దాచుకొనె ననలేర! మీహృదయము లింత కాఠిన్యములా! ఒక దిక్కులేని అబలను కాపాడి పుణ్యమును సంపాదించుకొనలేర! అట్టి నోమును యీదిక్కు మాలిన స్త్రీ నోచుకొనలేద! ఓ సౌదామిని! సంఘకలహముల కల్గించి మోహపిశాచమును పెంచుచున్న నీశరీరమును దగ్ధపఱచుకొనుము అని గంభీరవాక్కులతో నూత్నపురుషులు నివ్వెఱపోవు కాంతార మంతయు ఖంగుమని ప్రతిధ్వనించ సింగమువోలెయు నున్న శక్తి విజృంభించ యఱచి వసనమందున్న గుప్తఖడ్గమును బయటకు దీసి కుత్తుక తెగనఱుకుకొన సాహసించి ఆకలిగొన్న సింగమువోలె కూర్చుండెను. సిరోజములు విడివడెను. నేత్రముల నుండి అగ్నికణములు రాలుచుండెను. అబలగదాయని యెంచి సమీపమున నిలువబడ్డ యోధు వరేణ్యులని పిలువబడు వారు వెనుకకు మఱలిరి. కొంతవడికి ఆయోధులలో నొక్కండు సాహసించి ఆమె హస్తమును బట్టుకొనెను. మహోన్మాదీయుడు మాత్రము భీతిలితనువధించ ఖడ్గము నెత్తెనని ఝుడసి కొంత నవ్వితగ్గెను. మహాగ్నిజ్వాలలు ఝంఝూమారుతముగ గురియుచున్న మనస్సు కొద్దిశాంతిల్లి యిట్లు లోలోనవితర్కించుకొనెను, 'ఆత్మహత్యయా? ఏటిపందకార్యము. ప్రకృతిచే పెంచబడినదానను హత్యజేసికొనుట క్రూరుల ఖండించవలసిన ఖడ్గము తన యజమానుని కుత్తుకను నిర్దయతో కత్రించ సాహసింప నిలబడిపోయెను. వలదు, వలదు. ఆత్మహత్య,

చేసినప్రతిజ్ఞను పాలించెదను. నాధర్మమును నెఱవేర్చెదను. నాబుద్ధిబల ముపయోగించి యీపురుషుల బలగర్వముల నణ చెదను. నాయం దనంతమైన శక్తిగలదు. అద్దానిని తాఫును గుర్తించి విజృంభింపజేసిన జగమువడకును. భగవదిచ్ఛ శక్తి స్వరూపము. ఆశక్తి బాహ్యస్వరూపము ప్రకృతి. జగము నంతయు కదలించుచున్నది అంతఃశక్తి. ఆశక్తి యనేక రూపనామముల వ్యవహరించుచున్నది. ఈశ్వరుడు తన ఇచ్ఛాశక్తియైన ప్రకృతియందు రమించుచున్నాడు. అందు ప్రపంచకమునగల జీవరాశియెల్ల జనించుచున్నది. ప్రకృతి చాటున ఈశ్వరుడు దేదీప్యమానముగ వెలుగొందుచున్నా డు. అతని యిచ్ఛయే ప్రాణశక్తి. ఆప్రాణశక్తియే మన యందు క్రీడించుచున్నది. ఆమహాశక్తి స్వరూపము లనేక ములు. అనేకవిధముల ప్రతిబింబించుచున్నది. యోగీశ్వరు లందు ఇచ్ఛాశక్తిగా నడచుచున్నది. సత్కర్మవీరులందు సత్యముగను. భగవద్భక్తులందు ప్రేమరూపముగను, కవీ శ్వరులందునాటుకొని సృష్టికిప్రతిసృష్టి జేయగలశక్తి యిచ్చి నది ఆశక్తియే! పూర్వకాలమున సత్కవి వాక్కొనిన వాక్కు భగవద్వాక్కుగా కార్యరూపమును దాల్చుచుం డెను. ఇదియంతయు స్వచ్ఛమైనశక్తి. కాలప్రవాహము కదలుకొలది ఆదివ్యమైన శక్తియందు ప్రకృతి ఎక్కువగా మిళితమగుటచే కర్మవీరులందలి సత్యము రోషములేక ప్రతా

పముగా అనగా రజోగుణముగా మారినది. భగవద్భక్త లందు మోహముగా మారియుండును. కాలప్రవాహమువడికి సత్యము తాలుకొనజాలదాయె. ఉన్నకొలది కలుషితము జెందుచుండెను. ఈకలుషితము వలన మానవుడు తన అంతఃశక్తిని గుర్తించలేకున్నాడు. ఎవడేని గుర్తించుచో అలెగ్జాండరు, నెపోలియనులవలె తమోగుణ ప్రధానులై, కీర్తికాములై ప్రకృతికాహారు లగుచున్నారు. నిర్మలమైన అంతఃశక్తిని ఎవ్వాడు గుర్తించి అనగా తన నిజధర్మమును గ్రహించునో, ఎవ్వాడు అద్దానిని స్వార్థత్యాగముతో సత్క్రియలందే జొన్పుచున్నాడో వానికి ప్రకృతి జోహారు లొసగును. అనగా వానికి కాగలకార్యమీ జగమున యుండబోదు. వానిని మానవులందరనుసరింతురు. ఇంతకు ముఖ్య విషయ మేమనగా శక్తిమించినకార్యమీ జగమున లేదు, లేదు, ముమ్మాటికి లేదు. ఇద్దఱు పురుషులు వారితో జయించుట నైతవ్యము. కాలమును బుజ్జగించి మానవుడు నడువవలయు. లేకున్నచో ఆమెకోపమునకు లోనుగావలసివచ్చును. కనుక నేనిపుడు నాబుద్ధిబలము నుపయోగించ ఏతీరునేని వీరిని నామాయోపాయములచేలొంగ దీసెదను. అని యీమనేక విధముల సౌదామిని తనపరిస్థితిని తర్కించుకొనుచుండెను. మూర్ఛిల్లినట్లు కొంతకాలము పడిపోయెను. చుట్టును నిలబడిన పురుషులిద్దఱు విభ్రమము జెందిరి. ఆమెస్వరూపమును

జూచి పెదవికదలించగూడదని యూర్జితపఱచుకొనిరి. ప్రతి మలవలె అలాగె నిలబడి సౌదామినిని మిక్కుటముగా పరికించుచుండిరి కొంతవడి సౌదామిని సుషుప్తినుండి మేల్కాంచినట్లు లెగచెను. దీనస్వరమున గద్గదకంఠమున వారల నీ తీరును హెచ్చరించెను.

"ఓసుజనవరేణ్యులారా! నేనెక్కువ మీతో మాట్లాడజాలను. నాదుఃఖరాశి నాయందు ప్రవహించు జలమునంతయు పూర్తిగా పీల్చివేసినది. జిహ్వపై మాట్లాడుటకేనితడి స్ఫురించుటలేదు. నాయందు క్షుధ తీవ్రస్వరూపమును దాల్చియున్నది. నేత్రములు అంధకారమున మునింగినట్లు చీకట్లు క్రమ్ముచున్నవి. ఎండవేడిమికి హృదయావేదన హెచ్చినది. నాయందు కరుణించి ఓమహమ్మదీయ కులోద్భవా! నాక్షుధను దీర్చుటకైవడి కొంతదవ్వరిగి ఫలములదెచ్చి నాయీ ప్రాణమును గాచుము. ఓక్షాత్రకుల సంజాతుడా? నాదప్పిని దీర్చుటకై, శ్రమయనుకొనక ఎంతదవ్వైని యరిగి నీయందుగల పాత్రముతో నీరమునుగొని తేగలందులకు వేడుకొనుచున్నాను మీరెంతమాత్రమే యాలసించుచో ననుమీరు జీవముతో గైకొని వెళ్లుటకు బదులు ప్రేతస్వరూపమున తీసికవెళ్ళవలసి వచ్చును. నాయాజ్ఞ రాజాజ్ఞనుకూడ బోలియుండ వచ్చును. ఎందుకనగా, నాయీశరీరమును మోహించిన రాజుశరీరమును నిలుపవలె గదా? ఇక మాట్లాడజాలను త్వరితమె ఏమి కదులరు లెందు బ్రతుకనిండు.

మహమ్మ్మ—"ఓహో! ఇదిమాకు వద్దియా? నీరమెచ టయీా వేసంగికాలములో ఫలజాతిగనిన వృక్షజాతి ఎచట కాంతారమున?"

క్షత్రియు—"సహచరుడా? ఆరీతిననవలదు. పాపము బయలునెఱుగని కన్యలాగున కనిపించుచున్నది. క్షుధ దప్పులచే పూర్ణముగా బాధపడుచున్నట్లు గోచరించుచున్నది. మనలనమ్మించి వెళ్ళవలెననినను యీాబంధతో ఎటకు పోగలదు. ఎంతదవ్వు పరువిడగలదు. అశ్వముల నధిరోహించి పారిడునన్నచో, పాపమీాయబల అంతటినేర్పును గలిగియున్నట్లు అంతసాహసమును పొందియున్నట్లు కనిపించుటలేదు. ఇది వేసవిగానున్నది. ఎండమావులు నీరమిచట దొరకునట్లు లేదు. నాయశ్వము నధిరోహించి నేనెటకెవెళ్ళి పానీయమును తెత్తును. అదెకాన్పించుచున్నది. ఇటకు మూడుపర్లాంగులుండనోపును. త్వరగ నీవచటకేగి ఫలముల గొనిరమ్ము తరువాయి విషయమును నిశ్చయపఱుప నగును."

క్షత్రియకుల సంజాతుడు, రక్తము కరుణారసముచే నింపబడినది. యితనివాక్యములకు మహమ్మదీయు డెట్టకేలకు శిరమునూపెను. క్షత్రియుని ఔదార్యమునకు సౌదామినికృతజ్ఞత దెలిపెను. క్షత్రియకులోత్తముడుఅశ్వారోహణజేసెనుక్షత్రియుడు నిరపరాధి, కరుణావంతుడు, ధైర్యశాలి, సద్గుణుడు. మహమ్మదీయుడు లోలోనదాగియున్న దుర్బుద్ధిని లెగవుచుం

డెను. ఏమని బోధించుచుండెను. సహచరుడు ఏయామడ దూరమో పోవలసియున్నాడు. చూడగా యీకన్నియ బహు సుందరవతిగ యున్నది. నాకింకను వివాహముకాకయున్నది. నిఘా కట్టుకొనవచ్చును. అల్లాకరుణాసముద్రుడు. దయగలవాడు కనుక నే నాకీకన్యను జూపించి యున్నాడు. సహచరుని కొద్దిమేర ఏగనిచ్చి యీసుభగను వివాహవిషయమై ప్రబోధించెదను. హిందూనిక్కను నాకడను కనుపింపజేయుచో మహమ్మదీయు బలాత్కారమును నేను ప్రదర్శించెదను. తిరిగి నవీనునిరాజ్యమున అడుగుబెట్టను. పర దేశముల కేగెదను. పర దేశములెవ్వి! ఇట్టిసాహసకృత్యములనాహ్వానించు దేశములెన్ని గలవు? పోయెదనటకు? సౌఖ్యములతో సహవాసమాచరించెదను. అని వితర్కించుకొనుచు మహమ్మదీయకులస్థుడు కాలి నడకనయుండెను. మూడుఫర్లాంగుల దవ్వరిగి యుండును. సౌదామిని నాలుగుదిక్కుల బరికించెను. మానవులు కన్పించుటలేదు. దయామయయగు శక్తి తనకు మంచిసమయమును జేకూర్చెనని హ్లాదమును చిఱునవ్వున వెలిబుచ్చెను. మహమ్మదీయుని అశ్వమును వృక్షబంధవిముక్తరాలిగా జేసి ఆరోహించెను. సమయము జేకూరినపుడు శౌర్యమును జూపవలెనని ఆమె అంతరాత్మ బోధించుచుండెను. మానవ నేత్రములకు కన్పించకుండ తన చెలియలు నివశించు అచ్చరుల వీధిని అశ్వమును నడిపించుచుండెను. పాఠకా స్త్రీయెటుల స్వారి జేయగలదనియచ్చెరు వందబోకుము. అంతఃశక్తిని మానవుడెన్నడు గుర్తించునో యానాడె మానవుడు త్రిజగంబుల జయించినట్లు వ్యాపించియున్న జయదేవి వారిని వెంబడించు చుండును.

గగనవీధులందు మ్రోయుచున్న మ్రోతలకు పశుపక్ష్యాదు లన్నియు గగనము వంకకె జూచుచుండెను. ఇంతవఱకు దుర్వృ త్తిచే ఆకాశమున సౌధముల నిర్మించుచున్న మానవుడు భూమిమీదకు దిగెను. తన మనోప్రియత లేదు. అశ్వము లేదు అక్కజపడి వెనుకకు నొక్కపఱువున వచ్చెను. నలుదిక్కులు పరికించెను. ఎక్కడి అశ్వము. గగనవీధులందు విహరించు చుండెను. వెంటాడుదమన్న వాహనము లేదు. దురదృష్టుడా! ఒకరికి కీడును యెంచెదవా? మానవుడు ఒకరిని సాధించుచుం టిని మనోతృప్తి జెందును.

ఏమానవు డీతీరున భ్రమజెందుచున్నాడో ఆమాన వుడు తనకు తాకీడుజెందుచున్నాడు. లోనున్న ఆత్మను జంపు కొనుచున్నాడు. పరులకు శూలముగా ప్రవర్తించును. అది గాంచకున్నాడు. కాంచకే మహమ్మదీయ యువకుడు మోస పోయినాడు. ఆశనిరాశ. గృహాభిముఖుడగుటకు అశ్వము లేదు, కాలినడకను వెళ్లుదమన్న చాలదవ్వగలదు, కంటకా రణ్యము. రాజువిధించిన ఆజ్ఞ పూర్తికామి. యీరీతి మోస పోతిమని రాజునకు వార్తయిచ్చుచో ఆనవీనుని ఆగ్రహము వీరిపైకి మఱలును. పాపమా మహమ్మదీయుడు తాజేసిన తప్పిదమునకు లోలోన విచారము, పశ్చాత్తాపము జెందు చుండెను.

# అయిదవ ప్రకరణము



సంధ్యారుణ కాంతులచే జగజ్జనని మేలిముసుంగు అలంకరించబడి యుండెను. ఆయలంకారమును తిలకించిన పికములు సంతసమును దెలుపుచుండెను. మనోజ్ఞమైన గీతములు ప్రతిధ్వనించుచుండెను. ప్రపంచకమున పాపజాతియగు మానవులపై ప్రకాశించుటచే మైలడితినని కాబోలు సూర్యభగవాను డాసాయంసమయమున స్నాన మాచరించుచుండెను. ఈరహస్యమును జూడ శిలలపై కెత్తిన జీమూతములపై స్నానమాచరింపబడిన పానీయము బడుచుండెను. రవి యీపాపమును స్పృశించుటచే గాబోలు తన నిజకాంతిని గోల్పోయి వృద్ధరూపమును బొందియుండెను. ఈపాపమునంతయు పోనటుల స్నాన మాచరించి, విశ్రాంతి గైకొని మరుదినమున బాలునివలె జగన్నాటకమును నిక్కినిక్కి జూచుచు బయలుదేరును. మహాభారమైన పాపభారమును సూర్యభగవానుడు కరుణించి; శ్రమపడి ఆకర్షించి యుండునో; ఆక్షణమే జీవరాశి హృదయము లన్నియు తేలికను బూనెను. నూత్నవికాసమును జెందెను. అమితోల్లాసముల తేలి యాడుచుండెను. మృగపక్షులన్నియు దుముకుచు తమ ఉల్లాసమును వెలిబుచ్చుచుండెను. మారుతము చల్లగా వీచుచుండెను. సూర్యుడు స్నానమాడిన జలమును వాయువు కదలికచే

పారద్రోలుచుండెను. ఆహా! ప్రకృతి నీసేవయేమి? తల్లివి గనుకనే మానవజాతి నీయందెట్టి బుద్ధినిబూనినను నీయందు రవంతె కాపట్యములేక నీసంతానమునందు చరించుచున్నావు. నీ అల్లారుముద్దుల పుత్రికను కౌతుకముతో ముద్దిడుకొను చున్నావు. ప్రేమ నిజస్వరూపము నీయందు గలదు. పయోరుహ హస్త బింబముయొక్క చర్యల దిలకించుచు, మిళిందబృంద గీతముల నాలకించుచు, శాంతి, గంభీర్యముల వెలిబుచ్చుచున్న ప్రకృతియొక్క రహస్యాలోచనల గమనించుచు, పర్వత పంక్తివరుసన మన సౌదామిని నడచుచుండెను. ప్రకృతి తనకాంతునితో రమింటచుకై అలంకరించుకొనుచుండుట సౌదామిని ఎడందను నాలుగుకెలంకులకు బనుపుచుండెను. విశ్వమును ప్రేమచే కౌగిలించుకొనుచుండెను. ఆరాజ్యము నకు రాణి ప్రకృతియే! అటకు వికృతిరానేరదు. పూర్వకాల మున కవిసార్వభౌములు అట్టి మంజులమైన స్థలములనే దేవ లోకములుగా పోల్చియుండిరి. అచట శాంతవృక్షము గంభీర ముగ పెరుగుచుండును. ఆవృక్షమును ఆశ్రయించి యోగీశ్వ రులేమి; ఋషీశ్వరులేమి—విశ్వలీలల గమనించుచు, విశ్వ వలల నల్లుచు, అందు ప్రేమమూర్తియగు దయామయుని బంధించి; వానితో కాలమును బుచ్చుచుందురు. వారి కన్ని విధముల ప్రకృతి సహాయభూతురాలగుచుండును. మానవుని హృదయిని యెన్నడు హానికరమైన ఆలోచనలుండునో

వాటిచే ఆకర్షించబడి జంతువులు హానిస్వభావమును దాల్చును. ఎవ్వరి హృదయము ప్రేమచే పవిత్రవంతములై యుండునో, వారి ప్రేమచే ఎట్టిక్రూరస్వభావియే ఆకర్షించబడి-తనస్వరూపమైన ప్రేమనుబొంది ఆనందించుచున్నాడు. అట్టి ప్రేమస్వరూపులు ఋషికూటము. వారి ఆశ్రమములచుట్టు క్రూరజంతువులనబడునవి. తిరుగాడియు వారి నేమాత్రము హానిజేయవు. వారి కన్నివిధముల సహాయభూతులగుచుండును. వారి కరుణచే యీజంతువులు మానవజన్మను చెత్తుచున్నవి. ఈమానవజాతి ఆతీరునేవచ్చి యుండనోపును. ద్వేషము లేని చోటు స్వర్గలోకముగాక మర్త్యలోకమగునా? అట్టి పావనమైన స్థలములందు మన సౌదామిని—నిర్భీతిగ—మహానందముతో సంచరించుచున్నది. ఆహా! ఆపర్వతరాజముల గంభీరత యేమి? మానవుడాప్రకృతినిజూచి ప్రతిదివసము పాఠము నేర్చుకొనును. మారుతము పర్వతరాజముయొక్క తపము చెఱచవలెనని శక్తివంతముగ వీచినను, నిరదకదంబములు పలుకరించవలెనని పర్వతములకై వడి మనోహరముగ నాట్యమాడినను; ఆగంభీరతను; ఆశాంతమును; ఆవకాశమును—తపమును పర్వతరాజములు గోల్పోవలేదు. అట్టి పర్వతముల వరుసను నేత్రానందముగ సౌదామిని పరికించుచున్నది. నేత్రముల దృష్టితోసహా హృదయము పరువిడుచున్నది. వాటి శాంతిగాతులను విడిచి ఒక్క అడుగేని సౌదామిని కదల

నిశ్చయింపలేదు. పర్వత క్రింది భాగమున ఒకజాతిపై యీ నాతి ఉపవేష్టించి యిదివరలో ప్రకృతికడ నేర్చిన పాఠముల జ్ఞప్తికి దెచ్చుకొనుచుండెను. ఉల్లాసములం దుయ్యాల లూగుచుండెను. పాఠము పూర్తి కావచ్చుసరికి ప్రథమ ఉపాధ్యాయుడు సెలవు పుచ్చుకొనగ ద్వితీయోపాధ్యాయు డగు చంద్రమ అంబరవీథికి వచ్చియుండెను. చంద్రమకడ సౌదామిని కెక్కువచనువు. ఎక్కువ ప్రేమ ప్రేమాధిక్యతచే మైమఱచి కనుమూసెను. విశ్వదేవి తన ముద్దులకొమరుడు డస్సియున్నాడని ధావళ్యకాంతిచే మిట్టిపడుచున్న మేలి ముసుంగుచే చంద్రమను కప్పిపుచ్చెను. ఎండువల్ల నటుల కావలసివచ్చెను. తనభర్త చక్కగా నిర్మించుచున్న విశ్వమును కొంటరిపిల్లలగు సూర్యచంద్రాదులు వారి శీతల వేడిమిచే దుందుడుకుగా భగ్నముచేయుచున్నారు. వీరికి దండించగా వలెనని ఈశ్వరుడు తన భార్యయగు ప్రకృతికి జెప్పియుండెను. అందుచే గాబోలు భర్తయొక్క కోపము చల్లారు దనుక పిల్లల తన మేలిముసుంగు చాటున దాయవలెనని దట్టముగా నేయబడిన ముసుంగుచే దాచెను. ఇవ్వేళకింకేమి పాఠము! భార్య భర్త బిడ్డలకు మనోకలహములు గలిగినట్లు తోచుచున్నవి. అని లోలోన సౌదామిని చింతిల్లి దీర్ఘముగ ఆజాతిపైననే నిద్రించెను. తిరిగి కొంటెసూర్యుడు రానుండును. అప్పటికె ఆ నిర్జరారణ్యంబున దినమునకు ఇరువది

యామడ స్వారిజేసి డస్సి నిద్రించియున్న సౌదామిని మేల్కొనసాగెను. పాపమా రేయియెల్లయు ఆహారపానీయ ముల నెఱుంగదు. ఎన్నడు స్వారిజేయని కన్య యిరువది యామడల నొక్కసరిగ స్వారిజేసి యుండెను. ఆనూత్న భూములేరివో! తనచుట్టు లేడిపిల్లల కుప్పిగంతుల వైచు చుండెను. వాటి యాటలు ఆహ్లాదమును గొల్పుచుండెను. సమీపముననె సరయూనది ప్రవహించుచున్నది. ముఖ ప్రక్షాళన మాచరించెను. ఆతల్లియం దిపుడేమికలవు! ఏమి కలవా! భగవదంశ సంభూతురాలు సృష్టిని వెల్లడించు చున్న వీణగలదు. నాశనమును వెల్లడించుచున్న గుప్త ఖడ్గము గలదు. బ్రహ్మ సృష్టికర్త. అతనిభార్య సరస్వతి. ఆమె హస్తము నలంకరించుచున్నది వీణ శివుడు నాశనకర్త. అందుచే ఖడ్గమతని ఆయుధము. ఆతని భార్య పార్వతి. ఆమె కనేకస్వరూపములు. ఆమె భీకరస్వరూపమున ఖడ్గమున చేధరించును. ఇట్టిసృష్టి నాశనహేతువులగు వస్తువుల తనకడ నుంచుకొని సౌదామిని తిరుగాడుచున్నది. వీణను హస్తమున దాల్చినది మనోహరముగా గీతముల బాడదొడగెను. తా నెక్కివచ్చిన అశ్వము సంతోషాతిశయమును దెలుపుచుం డెను. ఆ ప్రేమగీతలందు మహాశక్తి యిమిడియున్నది. ఆశక్తి వాయువుద్వార వెడలి కొంతదవ్వున నివశించుచున్న కొండ జాతివారి హృదయముల జొరబడెను. నివ్వెరపోయిరి. ఆ

యనాగరికులు వీరిని మంగోలియనులనియే వ్యవహరించ దగును. ఆచార వ్యవహారములందు మూఢులు. వారిని సంస్కరించు మహావ్యక్తి యింతదనుకెవ్వరు ముందంజవేయ లేదు. శ్రీకృష్ణ మురళీవినాదమును విని గోపికలేరీతిని తమ యాహ్లాదమును దెలుపుచు కృష్ణుడుండిన స్థలమునకేరీతి పరు విడివచ్చిరో! అదేతీరున ఆయా ప్రాంతముల నివశించుచున్న మంగోలియను జాతివారు మనసౌదామిని తంత్రీనినాదమును వీనులవిందుగా విని, తమ అక్కజమును దెలుపుచు, సౌదా మినికడకు, స్త్రీపురుష, కుర్రలు పరువిడివచ్చిరి. ఈనూత్న వ్యక్తిని మహాశ్చర్యముగ తిలకించిరి. ఇట్టి వ్యక్తిస్వరూప ముల తామెన్నడు కాంచియెఱుంగమనియు, అట్టి గీతముల విని యెఱుంగమనియు, వారిలోవారలే జెప్పుకొనుచుండిరి. సౌదామిని వారి వేషభాషలజూచెను. వారి నిరాడంబరము, నిష్కాపట్యము—ప్రేమల గ్రహించెను. వారిని సంస్క రించు సంస్కర్తలేడని లోలోన విచారపడెను. విద్యుత్ శక్తిని బోలినశక్తి ఆమె ప్రతినరములందు ప్రవహించెను. హృదయము ఉప్పొంగెను. తనశక్తిని తాగుర్తించెను. నాతల్లి యగు శక్తి నా కుపదేశించిన పవిత్రవాక్యములు సత్యము. ఏమని 'బీదలందె భగవానుని ప్రకాశము హెచ్చుగానుండు నని' వీరిని నమ్మిన కార్యమును విఘ్నముగ సఫలతజెంద గలదు. నాతల్లి నాకిచ్చిన ఆజ్ఞను వీరిద్వార నెఱవేర్చగలను.

వీరిని సంస్కరించ గలను. కృత్రిమ ప్రపంచకమున జీవించు మానవుల సంస్కరించుట మానవుని వశముగాదు. వారికి పూర్తి జ్ఞానములేదు. పూర్తి అజ్ఞానములేదు. అట్టివారికి వాదనయే మూలము. వారలు ధ్వంసము కావలసిన దే. భగవానునకు ప్రేమస్వరూపులు వీరు. వీరిని సంస్కరించె దను అని సౌదామిని హృదయవీధిని పెద్దయక్కరముల చెక్కి యుండెను.

సౌదామిని—తల్లులార ! మీ దేజాతి.

నూత్నవ్యక్తులు—మమ్ముల మంగోలి యను జాతి యందురు.

సౌదా—అందు రేగాని మీకు తెలియదు.

నూత్న—పొత్తములందు వ్రాసినగదా తెలియునది.

సౌదా—జాతియనగ నేమొ తెలియ ఇచ్ఛ మీకుగలదా?

నూత్న—లేకేమి ! మాకంతపుణ్యము బుట్టునా ! వారలు మమ్మాదరింతురా ?

సౌదా—సరి నేటినుండి నాకు మీరు తల్లిదండ్రు లుగా నుందురుగాక. నాకు తెలిసినకొద్ది విద్యనుమీకు గఱ పెదను. నేర్చుకొందురా ?

నూత్న—అమ్మ మమ్ముద్ధరించవచ్చిన దేవకన్నియ లాగున్నావు. శరీరమునకు బువ్వ ఆహారము. ఆత్మకు విద్య ఆహారము. బువ్వ బెట్టెదమన్న కాలితో తన్నుకుందురా ?

సరేకాని తల్లినీముఖం చూస్తే ఎన్నాళ్ళనుంచియో భోంచే యని వాళ్ళలాగుంటివా ? ఏమిటా విశేషము. ఎందుకిటు వచ్చావు. ముఖంచూస్తే ముద్దుల మూటగట్టుతుంది. అంటు కుంటె మాసెట్టుకున్నవు. ఏమిటీగుఱ్ఱము, ఏమిటారావడము ఒడిలో నది యేమిమూట. చూస్తేమటుకు సత్యంగ రాజ కుమార్తెలాగున్నావు. ఈవనప్రదేశములకు రావడమేమిటి. నీ వెంట పదిమందిదాసీ లుండవలసిందె ? క్రూరజంతువులుండే దేశానికి ఏగుండెతో వచ్చావు. నీపనియేమిటో కాస్త జెప్పుము.

అనుచు వారందు బహువిచిత్రమును దెలుపుచున్న ముఖవికాసములతో సౌదామినిచుట్టు మూగి గూర్చుండిరి. సౌదామిని యీతీరున గాంభీర్యముతో జెప్ప మొదలిడెను. "ఓనాసోదర, సోదరీ, మాతా పితృలారా! నాఉద్యోగము నిరుద్యోగ్యము.అందెమహోద్యోగము గలదు. అందుద్యమము యిమిడియున్నది. నామనస్సుకు చేద్దామనిలేదు. కాని భగవతీ ప్రేరణచేచేయకతప్పుచున్నదిగాదు. నాకొకనివాసస్థలములేదు విశ్వమంతయు నేనె. ఆకారము ప్రేమతో విశ్వమును వలను నేయుచుందును. ప్రేమ యాకారము నెప్పుడుబొందితినో- అప్పుడె నానుంచి భీతి సెలవుబుచ్చుకొన్నది. ఆపవిత్రమైన క్రూరమృగమునతో చెలిమిజేయును. అజ్ఞానుల నుద్ధరించ ముందంజవేయును. ఈయంధకారము మెఱపువోలె మెఱయు

దును. కనుక సౌదామినిని మానవజాతియందు కాలముకట్టు వడెను. అందుచే విశ్రాంతిగా విశ్వవలను అల్లుకొనగలందు లకు యౌవన ప్రదేశంబుల జేరితిని. సైతానులని వెఱ్ఱి మానవులు భీతిల్లుదురు. ఆత్మను కృశింపజేయు సైతానులు తామని గుర్తిల్లరు. మీరు నేటినుండి నను మీలో నొకరినే జూచుకొండు భగవానుని కుటుంబములో మన మందరము సమానులము అర్థానిని గుర్తించువాడు దేవుడు. గుర్తించని వాడు రాక్షసి.

నూత్నవ్యక్తులు—అమ్మా నీవు చెప్పేదేమిటో అంత మాకు తెలియదుగానికొద్దిగా బువ్వభుజించుము. మా మేక లన్నియు చక్కగా పాలిస్తాయి. ఆపితికినపాల కడుపార గ్రోలు దువుగాని మాకుటీరములకై బోవుదము నీకేమిభయ మక్క ఱలేదు. నేటినుండి తెలివిగలదానవు. చదువుకొన్నదానవు గనుక నీవు ఏలాగుజెప్పితె ఆలాగుచేస్తాము. అమ్మో మోస పుచ్చె వ్యవహారము మాదిగాదు. కొండజాతిమాది. నమ్మి తిరా ప్రాణలిస్తాము. అదంత తరువాత మీకే తెలుస్తాది. రామ్మా. రా! నీకెందుకు. ఏమిచేయమంటె అది చేత్తామని భగవన్ ఈశ్వర దేవాలయము యిక్కడున్నాది. అక్కడ ప్రమాణాలుచేస్తాము. ఏతల్లిపెంచిందో! యౌవనభూములకు వచ్చావు. మాతల్లిలాగు చూచుకుంటాము. పట్టణాల్లో తిరుగు తారె ఆక్రుంరుల, నీచులవంటి బుద్ధులుగావు మావి.

అని హృదయారవిందముగా వాక్రుచ్చిరి. సౌదామిని కిట్టి నిష్కాపట్యజాతి దొరకినందుల కెంతయో సంతసిల్లినది. వారివెంటనె అశ్వారోహిణియై బయలుదేరినది.

---

## ఆరవ ప్రకరణము

అప్పుడె సూర్యభగవానుని యందు ఎలప్రాయము నూత్నముగ ప్రాదుర్భూత మగుచుండెను. అతని ఎలప్రాయ మందున్న గర్వోన్నతిచే నితరుల పీడించునను తలంపుచే వృద్ధులు, బాలులు, గృహములందు రవి గుండతనమునుండి తప్పించుకొనుచుండిరి. సౌదామిని వెళ్ళినవెంటనే మేకపాలను ఫలములను తృప్తికరముగా గ్రోలి విశ్రాంతి గైకొన అట్టె శయనించెను. అంశుమాలిని నిష్కృతికై వెడలుచున్నాడని పికములు మానవులకు మాధుర్యముగ దెలుపుచున్నవి. ఈ ప్రదర్శనమును గాంచుకై వడి సౌదామిని బయలుప్రదేశము లకు వచ్చియుండెను. ఆమె సంతసమునకు మేరలేదు. ఆచటి ప్రకృతి విచిత్రము ప్రపంచకమున కింకను ప్రాకటముకాలేదు. ఇట్టి దృశ్యమును గాంచుభాగ్యము సౌదామిని మాత్రమె మానవజాతిలోకెల్ల నోచుకొనియుండెను. సౌదామినియున్న యునికికి చుట్టున పర్వతరాజములు గంభీరముగ శిరముల త్తి ప్రపంచక నాట్యమును తిలకించుచుండెను. ఆపర్వతరాజములు

పచ్చని వసనముల ధరించియుండెను. ఏమి సృష్టివైచిత్ర్యము భగవానుని విశ్వరచనయందు అతని కలమందలి సిరా ఈ పర్వతరాజములను సృజించునపుడు ఎక్కుడుగా ఉపయోగించ బడి యుండెను. పర్వతరాజముల పైకెక్కి దృష్టినిగురించి విశ్వములు తిలకించు మానవుని భాగ్యమేమి! అట్టికాలమందు భగవానుని రచన కుపయోగించు తెల్లనికాగితములు ఆదృష్టికి గోచర మగుచుండును. ఆకాగితముల పైననే ప్రేమ చైతన్యము, కాంతి అను వీటితో విశ్వమును చక్కగా దిద్ది యుండెను. భగవానుని హస్తమందుగల తెల్లని కాగితముల తిలకించుటకై జ్ఞాని పర్వతశిఖరముల కేగవలసి యుండును. తరువాయి ఈశ్వరుని తేజోవంతము చక్కగా తేటపడగలదు. ఈ పర్వతరాజములు నీలపర్వతములు వాటి వెంటనే సరయూ నది గంభీరముగ ప్రవహించుచున్నది. సరయూతీరములందు గొల్లవారు తమ మందల కాచుకొనుచుందురు. వారు శక్తి పూజాధురంధరులు ఈశ్వరుని భావమంది విశ్వము సృజించ బడి యుండెను. ఆ విశ్వమందు నివశించుచున్న మానవుని భావమందు విగ్రహములు సృజించబడుచున్నవి. భగవానుని సచ్చిదానందమును బొందినవాడు దైవసమానుడు. శక్తి కర్థమేమి? సూర్యునందు వెలుగొందు చంద్రు నక్షత్రము లందు ప్రభాసిత మానమగునద్ది నదులందలి జలమును ప్రవహింప జేయునది మన అవయవములకు చలనము గలుగ జేయునద్ది ఏదియో! అదియె శక్తి మహాశక్తి. ఆమె భీకర

స్వరూపమున దుష్టుల దండించును. కాళికదేవి ప్రేమ స్వరూపమున ఆదరించును రాధ. ఆ శక్తియే విజృంభించి మానవజాతి నుద్ధరించ రాముడు కృష్ణులందు దేదీప్యమానముగ వెలుగంది వారిని దైవ సమానులుగ జేసినైచినది. ఆమె భీకర స్వరూపియు కాటకములందు యుద్ధములందు, జాడ్యములందు, భూకంపములందు, వఱద లందు, భీకరముగ విజృంభించును. ధర్మము క్షీణించు సమయమున మానవుని ఆవహించి ధర్మమార్గమును ప్రపంచకమునకు జూపించుచున్నది. ఆమె లీల మహాద్భుతము ఆమె ప్రేమస్వరూపము వృద్ధికారకము ఆమె భీకరస్వరూపము నాశనకారకము. ఆమె ఈశ్వరుని సేవకురాలు. ఆతల్లి కరుణామయి. ఆతల్లియే చైతన్యునకు కృష్ణస్వరూపమున రామకృష్ణునకు తల్లిస్వరూపమున ఏసునకు తండ్రిస్వరూపమున గానిపించి వారిని క్రియాశీలాపులుగ నొనరించినది. అట్టి మహాశక్తిని మానవులు విగ్రహస్వరూపమున బూజించుచున్నారు. ఆ మహాశక్తి ముందు అహంకారమను దేహిని నాశనము నొనర్చుటకు మారు ఆ తల్లియొక్క మూగసంతానమున కరుణాహీనులై బలియొనర్చుచున్నారు. వీరి దుష్టకృత్యముల ఓర్పుతో తిలకించుచున్నయది. తల్లీ ఏది ప్రేమమహిమ. అన్నదమ్ములను మాతాపితృలను తమకై సతతము పాటుపడు మృగపక్షిజాతుల కఠినమగు ఖడ్గముల చేబూని వెంటా

డుటా ఎట్టి ప్రవక్తలు భూఖండమున అవతరించినను ఈ మహా క్రూరము వదలలేదు. ఇట్టి మహాదారుణమైన మహా హింస మానవజాతి అంతటను ఆవరించియున్నది. అడవిజాతి యందు యీమూర్ఖ పిశాచము అధికముగా ఆవహించి యున్నది. ఇట్టి దేవీనిలయము నీలపర్వాములమధ్య చెన్నారు చున్నది. ఆమె ముంగట ప్రతిదివసము ఆ మంగోలియను జాతివారు భగతత్యాగ సంతానమును నిర్దయతో నరకు చుందురు. వీటిపేరు మ్రొక్కుబడులట ఆహా! మానవజాతి! నీపిచ్చుభ్రాంతి భగవంతుని దృష్టియందందఱు సమానులు గాఁఅనియు నిన్నే యధికముగా ప్రేమించుననియు దలచి యుంటివా? ఆ దేవీనిలయమందు దేవి మహాశక్తి భీకర స్వరూపమును దాల్చియున్నది. ఏమిటా భీకరము. హృదయ మును భేదించు భీకరము. ఆ మహాతల్లికి నాలుగుహస్తములు గలవు. ఒక్కహస్తమున మానవుల పుఱ్ఱెల ధరించియున్నది. వాటిద్వార రక్తప్రవాహము పాఱుచున్నట్లు గన్పించు చున్నది, మఱొక హస్తమున ఖడ్గమును ధరించియున్నది. మఱొక హస్తమును పసుపుకుంకుమను యింకొక హస్తమున పుష్పమాలలను ధరించియున్నది. ఆమె కంఠమందు మానవుల ప్రేవుల మాలలగా ధరించియున్నది. ఆమె వసనము రక్తమును చాటుచుండెను. ఆమె నేత్రములేమి, ఏ మానవుని హృదయమును బదిలబరచుకొని ఆమె ముఖమును తిలకించును. భీకరముగ నేత్రములు ఎర్రనై ప్రకాశించు

చుండెను. పాదముల కేమి ధరించియుండెను. ఘల్లుఘల్లని మ్రోయు గజ్జెలధరియించి యున్నది. పాదములక్రింది ఏమి గద్దు? పురుషుడు. దీనవదనముతో ఆమెకై కరుణారసమును చిలుకుమని గాబోలు చూచుచున్నాడు. ఆమె హస్తముల చాచుకొనియున్నది. పూర్వకాలపు ఋషిసత్తములు మూఢ జాతికే విగ్రహముల తమ బుద్ధిబలిమిచే సృష్టించిరి. ఆమూఢా భిప్రాయమే మానవజాతియందు వేళ్ళతోసహా బాదుకొని యున్నది. విశ్వమందొక్క శక్తియే అనేకరూపముల క్రీడించు చున్నదిగదా? అది ఈశ్వరప్రేరితము, సృష్టియందు మహా గూఢము గలదు. అద్దానిని విప్పి బోధించుటకు మూర్ఖజాతికి, వలనుపడదు. అట్టి మహోత్కృష్టమైన ఆలోచన సంజ్ఞద్వారా పున మనపెద్దలు బోధపఱచిరి. జ్ఞానము వృద్ధియైరా సత్య మెంతవఱకు గలదో విగ్రహములందు మానవునకు బోధపడ గలదు.

ఒకనాటి మ్రుచ్చుప్రొద్దున సౌదామిని నిద్రించుచుం డగ, దీనమగు అఱపు ఆమెవీనులకు వినవచ్చెను. స్వప్న మందు విననాయెను. ఏమది, ఆమెయందు మేల్కాంచు చున్న ఆత్మస్వేచ్ఛకై అఱచుచున్నది. ఈభూములందు ప్రేమకు సైదోడుగా—ద్వేషభావము గలదు. ఉద్ధరించసమ కట్టుము. అను అర్థమువచ్చునటుల ఆపెఆత్మ మేకస్వరూప మును దాల్చి యీామె హృదయము నీరగునట్లు అఱచి

యుండెను. ఈఅఱపును దీనుల కఠోరముగ విన్నది. మేల్కాంచినది. నిద్రపట్టదాయెను. చేయవలసిన గత్యంతర మేమని ఆలోచించ మొదలెట్టినది. "తల్లీ! మహాతల్లీ— నీనుంచి జనించిన సంతానమును, నీవభుజించెదవా? నీసంతాన మంతయు నీశరీరమందొక అంగముకాదా? ఆసంతాపమునకు బాధసంభవించుచో నీకు సంభవిల్లినటులకాదా? తల్లీ ఇట్టి భూములకు నన్నేల గొనితెచ్చితివి? గొనితెచ్చితివి పోనాకిట్టి స్వప్నమేల రానై యుండెను. ఈస్వప్నమున కర్థమేమి— ఓహో నాఅంతరాత్మ బోధ. బుద్ధదేవునకు రేయిగడా దీనానాదము వినవచ్చెను. జ్ఞానులకు ఓంకార నాదము, కర్మవీరులకు దీనుల దీనానాదము, సరియ. నాకర్తవ్యమేమి? ఈచోటునుబాసి నేనెటకె వెళ్ళవలయునా? వెళ్ళుటా! ఎటకు! ఛీ, ఛీ. ఈశరీరమును ఆభగవద్దీన సంతతికై అర్పించవలయు గాక ఆమహాతల్లి కైంకర్యమునకై వదలుదుగాక! ఈ అడవి జాతుల మూర్ఖత్వమును పోనాడ జేద్దునుగాక! వారు నా మాటల ఆలకించుచో; భగవత్ప్రసాదము. లేకున్నచో ఆ దీనులపై కెత్తుఖడ్గమునను యీనాశిరమును తుత్తునియలుగా జేయ నర్పింతును. నాహృదయమం దేర్పడ్డ గాయ మప్పటికి గాని మాననేరదు. ఈనాసంకల్పము నెరవేరుదనుక యీనా నేత్రములకు నిద్రయను మాటలేదు. ఆహారపానీయముల దీయును. ఇదియే నాశపథము. నాతల్లి పాదయాన. జై భగ వానికి." అనుచు సౌదామిని శయ్యపై కూర్చుండి యుం

డెను. ఇక తాను జేయవలసిన కార్యక్రమమును ఆలోచించు చుండెను. మన సౌదామిని కార్యకలాపము, కర్మవిలాపము, అందరివలెగాదు. కొందఱు ఆత్మద్రోహులు, దేశసేవకుల మనువేశ, బహిర్గతముగ దీర్ఘోపన్యాసముల ఝంఝామారుత ముగ నిత్తురు. దేశమాతకై ప్రాణము లర్పింపుడందురు. పత్రికల నడుపుచుందురు. అట్టివారు దేశసేవకులకు మారు దేశద్రోహు లనదగును. ఎందుకని, వారు సంపూర్ణముగ మానసిక శక్తిని లోబఱుచుకొని యెఱుంగరు. దేశసేవ యందురు; స్వాతంత్ర్య దేవతయందురు, దేశమాత యం దురు, చాటున జూదము, వ్యభిచారము, మొదలైన దుర్నడ తలచే మోసపోవుచుందురు. వారియందున్న ఆత్మశక్తిని వారు గుర్తించరు. సోమరిపోతు లగుదురు. మేము కృషీ వలుల తరపున పనిజేయుచున్నా మందురు. వీరి వేషభాషలు జాతిజీవమును గోల్పోయియుండును. పొలములందు క్షేత్ర కర్మను జేయ సిగ్గిలుదురు. కృత్రిమ వ్యాపారమును జేయు చుందురు. మాతకరుణకు దూరస్థులగుచుందురు. అహింసా బోధత్వమునకు మారు హింసనే జూపెదరు. దేశమాత యనుపేర ప్రజలముందు గీతములు రచించి వాపోవుదురు. ఆత్మ ఆదేశించు ధర్మమును వినరు. నేటిదేశమాతలు— అహింసలు, కొంతకాలమునకు భీకరవిగ్రహములై అహిం సకు బదులు, హింసాత్మకముగా వేనకువేల జీవుల బలిగొ నును. నాయకుడు—ఎవ్వడువాడు. ఎవ్వారి నడుపుచున్నా

డో వారి పాపభారమును మోయు శక్తిపరుడు. ఆత్మ చెప్పు పలుకుల ఆలకించువాడు, ఇతరులకవి వినిపించువాడు, ఆతని ఆత్మశక్తిచే యితరుల ఆకర్షించువాడు, సత్యముగా నతడే నాయకుడు. ఇక్కాలమున అట్టివారు కోటికొకండెయున్నె. మన సౌదామిని పై జాతిలో జేరునదికాదు. ఆత్మశక్తిని ఆరాధించుతల్లి ఆమె. ఆమె మనోబలము విశ్వమును వూగు లాడించగలదు. విశ్వమందు బాధపడుచున్న దీనజీవులబాధ ఆమె హృదయాంతరాళమున అనుభవించుచున్నది. మూఢ నమ్మకముల భారద్రోల సమకట్టినది. ఇట్టి ఆలోచనలు నిమగ్నయై యుండగా తెల్లవారజొచ్చెను, కోడికూతలు వినవాయెను. స్త్రీపురుషులు తమ కాలకృత్యముల ఉత్సా హముతో నెఱవేర్చుచుండిరి. వారియందుగల ఉత్సాహము నుబట్టి సౌదామిని వారికేదియో విందుగలదని గ్రహించినది. అట్టి విందులకు సకలజనులు గుమిగూడుదురు. సౌదామిని కిదియే మంచిఅదను. ఆమె సంకల్పము నెరవేరుసమయము సమీపించి యుండెను. గృహముల పురజనులు చక్కగా అలంకరించుకొనుచుండిరి. దేవి ఆలయము మహావైభవ ముగ అలంకరింపబడి యుండెను.

అది బ్రహ్మవేళ. సకలజనులు శౌచికము నొందుచుం డిరి. బాలులెల్లరు క్రొత్తని దుస్తులధరించి పప్పు – బెల్లముల భుజింపుచు ఆటలాడుకొనుచుండిరి. విషయమంతయు బాగు

గనేయున్నది. ఈవిషయము ప్రాదుర్భూతమగుటకు కారణ మేమైయుండును. కారణమేదియో! ఆబాలగోపాలము మశూచికా వ్యాధిచే పీడింపబడుచుండిరి. మడియుచుండిరి. ఏగృహమందు విందమన్నను రోదనములే. ప్రతియింట వేపజెండాలె. ఎవరియందేని ముఖవికాసము మురిపమును గొల్పుటలేదు. జగజ్జననియొక్క ఎఱ్ఱనినేత్రము వీరిపై వ్రాలినది. ఆమహాతల్లి తన భర్తయగు ఈశ్వరుని క్షుధను తీర్చుచున్నది. శివప్రేరితమై భీకరముగ జనసమూహమున తాండవమాడు చున్నది. ఈశ్వరుడు శ్మశానమునందు తన లీలను పూర్తి గావించుచున్నాడు. ఒకరి గృహమందీజాడ్యమన నవసరములేదు. ప్రతియింట ఆమె తాండవించుచున్నది. ఆమెకీ యాగ్రహము గల్గుటకుం గల గాయకము నెవ్వరు గ్రహింపజాలకుండిరి. ఆమె యాగ్రహము ఆమెసంతానమును బలియొనర్చిన శాంతింపగలుగునని పిచ్చజనులు భ్రాంతిలుచుండిరి. వీరియింటగల జాడ్యమునకు గలనెపమును దీనారవంబును సల్పుజంతువులపై నిడుచుండిరి. ఇంకేటివివేకము. ఈకారణముచే ఆమెక్రోధము మరింత హెచ్చసాగినది. ఆమె ఆంతర్యమును యీమూఢజనులు గ్రహింపలేకుండిరి అందుకే సౌదామిని స్వప్నమందు మొరపెట్టుకొన్నది. త్రిజగంబులు కంపించురీతి దీనారవంబును సలిపినది. ఇంకానాదము సౌదామిని హృదయాంత

రాశిమున ప్రమోవ్రుచునేయున్నది. వీధులనిండుగ జనులుమూగి యుండిరి. శరీరమును చక్కగనే దిద్దుకొనియుండిరి. క్రూరస్వ భావమెల్ల వారిముఖరాశియందు వ్రేలాడుచుండెను. చంక లందు భగవద్దీనసంతతిని నిడుకొని యుండిరి. తప్పెట్లు తాళ ములు మ్రోయుచుండెను. కొందరు భీకరజనులుచేత కొర డాలధరించియుండిరి. ఇంకను హెచ్చుగభీతాహమును బుట్టిం చునటుల కొందఱు మొండిఖడ్గములు ధరించియుండిరి. ఇంక కొందఱు ఖడ్గములచేబూని పాదములకు గజ్జియలధరించి భైర వుబోలెనృత్యమును జేయుచుండిరి. వారి హృదయములందలి క్రూరత్వమంతయు ఒక్కుమ్మడిగి వారిమధ్యన నృత్యముజేయు చుండెను. సాంబ్రాణి ధూపమందు కొందరు మునుంగుచుండిం ఆశిచ్ఛకు లోనై వాక్కునకు దాసులై వాగుచుండిరి. వారి పదములు వ్రాలుచుండిరి. అమ్మ అమ్మ నీకోర్కె నీడేర్తుమం టుండిరి కొందరు నరపిశాచరులు. అహా! ఎట్టికఠినదృశ్యము దీనదయాళను బిరుదము భగవానుడా నీవింకను ధరించి యుండుటేల? అబ్బా ఆమూగసంతతి దీనారవంబుల నెవండు విననోపును. ఆస్థలంబుల నెవండు ఉండగలడు. ఎట్టికఠిన హృదయమే ఆదీనజాతిని జూచిన కరుగక మానదు. దేవీ నిలయముకై యీజనదిమూహా మంతయు కదలుచున్నది. వీరి కేకలు పర్వతములందు ప్రతిధ్వనించుచున్నది. సౌదా మిని అంతరాత్మను, యీమూఢజను లెఱుంగరు. ఆమె నీవిం

దున కాహ్వానించి యుండిరి. ఆమె యీవిషయమంతయు గ్రాహ్యము జేసికొని యుండెను. జనులెల్లఱకు చుట్టుప్రక్కల యీ దేవీనిలయమె ప్రముక్కబడులకు నిలయము. యీతరుణమున విచ్చేసిన జనము అయిదువేలకు తక్కువెంతమాత్రము ఉండదు. జనమంతయు దేవీనిలయము కడకు జేరియుండిరి. శ్వాసములవోలె రొద జేయుచుండిరి. ఒక్కొక్కరి పౌరుష, రోషాతిశయముల దేవిముంగట, మూగజాతిపై జూప, మొండి కత్తుల దూయుచుండిరి. పదునగు కత్తులచే వధించిన వాటి ప్రాణము లనాయాసముగ పోవునని వారియూహ. అవిబాధచే వారికి వినోదముగా కదలజాలవు. వారికి తృప్తి జేకూరదు. అందుచే మొండిఖడ్గముల నుపయోగింపనుండిరి. సాంబ్రాణిధూపముమిన్నున కెగయుచుండెను. ధూపముతోసహా వారివెర్రి కేకలు మిన్నున ప్రతిధ్వనించుచుండెను. ఇప్పటికాలమున సూర్యుడు అంబరమధ్యమున త్రీవముగ ప్రకాశించుచుండెను. అతని నేమాత్ర మీమూఢజనులు లెక్కజేయకుండిరి. వారి దేవతవారిముందు తాండవమాడుచున్నట్లు భ్రాంతిల్లుచుండిరి. కిరాతకుడొక్కడింతలోనె, మద్యమును పూర్తిగా గ్రోలియుంటచే, తన మొండిఖడ్గముచే గొర్రెను బలవంతమున నఱికియుండెను. ఈసమయమున సౌదామిని ఆలయము సమీపము కడకు విచ్చేసియుండెను. మూర్ఖుడాగొర్రె ప్రాణము నపహరించుట కనులార గాంచినది. శరీరము కంపించినది. జివ్వున జన

సమూహమున దుమికినది. ఆమె ఆవేశపూరితురాలాయెను. సాంబ్రాణిధూపమున తన శిరమునునిండ ముంచెను. శిరోజ ములు వ్రేలాడుచుండెను. అంతఃశక్తి భీకరముగ, గంభీరముగ ముఖమున తాండవించుచుండెను. నేత్రములు ఎఱ్ఱనాయెను. లోనున్న గుప్తఖడ్గమును వెలుపలకు దీసెను. ఇదియంతయు జూచిన ఆజనుల హృదయములు తల్లడిల్లుచుండెను. సంతసిల్లు చుండెను. వారి యఱపులు మిక్కుటమాయెను. ఆమె ఆవేశ మును గాంచిరి. వడకుట స్పృసించిరి. ఆతల్లి జెప్పబోవు సత్య ముల విన కుతూహల పడుచుండిరి. ఏమని జెప్పనున్నది. 'ఓ. ఓ. మూఢాత్ములార! నేనెవరో మీరింకను గుర్తిలలేద. సామాన్య మానవస్వరూపిణిగాను. నాదీనసంతానమును అప హరించుచున్నారు, నాఱొమ్మును గ్రుద్దుచున్నారు. అందు వల్లనే మీప్రాణముల భీకరముగ నపహరించు చుంటిని. మీయందుగలమురికిని పారద్రోలలేక నన్ను కారణముగోని నాసత్సంతానమును భీకరముగహత్యలగావించుచుంటిరా! మీ యాగడమిక చాగనేరదు, మిమ్ముల మీజాతిని నిర్దయతో నాశన మొనరించెను. నేను శక్తినే; అంతఃశక్తిని-నానిలయ ముమీహృదయాంతరాళములు-నన్ను ప్రేమచే కొల్వుడి. నా సంతానమును ప్రేమించుడి-మిమ్ము ప్రేమించెదను. విజృంభిం చెదను. మీకార్యముల నెఱవేర్చెదను. నన్ను నమ్ముడి. ఈ సందోహమెల్ల భగ్గునమండుగాక యనిన మండును, అంతటి

సంభూతి నాయందుగలదు. నాపలుకులలఆలకించువారిని సంభా షించెదను. సంక్షోభమువలదు. వలదు. ప్రేమను మాధుర్య ముగా గ్రోలుడి. ఓ ఓ. నాశరీరము భగ్గున మండుచున్నది. తాపము హెచ్చుచున్నది. మీశరీరములనిండుగపాపము నిం కడ జేసికయున్నది. నరకమునకు మిమ్ము గొనిపోవనున్నది పశ్చాత్తాపమును బొందుచుంటిరా? నూత్న హృదయము నిర్మించుకొనుడి. నూత్నజన్మల బొందుడు. వాటివలె మీదో పరి బాధజెందుడు. అప్పుడు, సత్యముగా భగవంతుని కరుణ రసము మీపై వెల్లివిరియగలదు. ఏమందురు. మీ దేవతను. ఉద్ధరించి వచ్చితిని. తరుణమును వీడకుడి. మీపాప నివారణా ర్థమై మీయీక్షణభంగురమైన తనువుల యీ నాఖడ్గమున కిందు. స్వర్గలోకముల జూరకొనుడి. వృద్ధులు, బాలులు, స్త్రీలు ఝడియుచుంటిరా? అగునగును. మీకింకను కర్మపరి పాకము కాలేదు. అవిగో పర్వతములవోలె పెరుగుచున్నది. నామాటలవిని భీతినందకుడి. ఇది ముమ్మాటికి సత్యములు. ఓ యువకులారా! నూత్నయుగసృష్టికర్తలారా! మీరక్తనాళ ములందు వెచ్చనిరక్తము ప్రవహించుటలేద. విశ్వమయుని శృంగారవనములో మీరు పుష్పములవోలె ప్రకాశించ నోపరా! విశ్వమయుని లీలలందు పాల్గొని అతని మెప్పిదముల బొంద యిచ్చగింపరా! నాహక్కుల త్రోసివేయువారిని పీడిం తును. సత్యము. సత్యము. "జనసమూహ మంతయు గడగడ

వణకిపోయినది. వారిమనస్సులు తాపుల్లద్దెప్పెను. ఒకరి ముఖ ముల నొకరు జూచుకొనుచుండిరి. వృద్ధులు బాలులు ఆపె ముఖమునుజూడ వాక్యములవిన భీతిలి ప్రక్కకు దిగియుండిరి. ఎవరిముఖములజూచిన ఏమని వ్రాక్రుచ్చునో యని భీతిలు చుండిరి. అ జనసమూహములో ఒకవీరుడు. లెగచెను. అతని నామము వీరుడె' తల్లీ మాయందు నీకింత ఆగ్రహము వలదు. ఇదివఱ కెవ్వియో తప్పిదములజేసి యుంటిమి. క్షమియిం పుము. మేము ధర్మశాస్త్రముల చదువలేద జననీ నీవె మా ధర్మశాస్త్రము. నీదువాక్కులె సత్యములు. ఇవిగో శరీర ములు. నీయిచ్చవచ్చు రీతిని జేయుము. ఏనాడు నీవీ పర్వత ప్రాంతముల గ్రుమ్మరుట గాంచియుంటిమో? ఆనాడె మా తల్లివి మా యిష్టదైవమని తలంచితిమి. అని గంభీరముగ పలుకుచు సౌదామినికడకు వచ్చినిలచెను 'ఓహో! నాప్రియ మైన పుత్రుడవు సత్యముగ నీవె. నీతనువు నేటితో సంచ రించు శక్తి లేకున్నను నీఆత్మ నిరాటంకముగ ప్రతిమానవుని హృదయాంత రాళములందు సంచరింపగలదు. రమ్ము రమ్ము' అనుచు సౌదామిని పలికెను. ఈవాక్యములు వీరుని హృద యమును మఱింత ఉత్సాహపూరితముగ జేసినై చెను. ఆలయ గర్భగోళమున కావీరుని గొంపోయెను. జనుల హృదయములు తల్లడిల్లుచుండెను. ఇదియేమి వింత. ఇట్టిదెన్నడు గాంచమే యని విచారపడువారు పశ్చాత్తాప పడువారు సంతసపడువారు

గర్భగోళమును వీరునితో సౌదామిని ప్రవేశించెను. ద్వార ముల బిగించెను. జీవమును గోల్పోయిన మొదటిసారి హత్య గావింపబడిన గొర్రెగలదు. గర్భగోళమునుండి వెలుపలకు అడుగుభాగమున గోడక్రిందగ నొకరంధ్రముగలదు. ఆరంధ్ర ముకడ మృతకళేబరమున సౌదామిని తన ఖడ్గముచే ప్రతి ధ్వనిల్లునట్లుగా నరకెను. రక్తము విరివిగ గోడరంధ్రము గుండా బయలుకు ప్రవహింపజొచ్చెను. వీరుని, ధీరుని, మాత్రమే దేవి విగ్రహము చాటున దాచియుంచెను. ఆ ఖడ్గ ధ్వనిని బయటనున్న ప్రజలు హృదయములు వ్రయ్యలగు నట్లుగా వినిరి. నేత్రము లూడిపడునట్లు రక్తమును గాంచిరి. చేయునదికేమి వృద్ధులు వాపోయిరి. బాలులు భయపడిరి. యువకులు ముందుకురికిరి. 'ఓతల్లీ! వీరుడు మా సోదరుడు ధర్మదేవతకు బలిగొనబడినాడు. మేమతని ధర్మమును అనుస రించెదము. ఇదిగో వచ్చుచున్నాము. ధర్మదేవతకు మమ్మును బలియిచ్చి మమ్ముల పాపవిముక్తుల జేయుము' అని గంభీర ముగ పలికిరి. ఎంతమం దిట్టి తేగమును మీానిరి. ఎంతమం దియా? మూడువందల జనము నిర్భీతితో ముందురికిరి. ఒకనితరువాత నొకడు ఆలయ గర్భగోళముల కేగుచున్నాడు. మాతవడిలో దాగొనుచున్నాడు. అతని పాపభారమును పశ్చాత్తాపముగా బాయుచున్నారు! ఆహా! ఏమి వీరు ధైర్య సాహసములు. క్రూరమునకేనిని, సత్యమునకేని

మీరలే తగుదురు. మీయందనంతమైన శక్తి గలదు. అద్దానిని సరిగ నడుపు సువ్యక్తి కన్పించలేదు. నేటికి మీనోము పండినది. మీజాతి ఉద్ధరించబడ నున్నది. ఆలయము వెలుపల అలజడి మొదలిడెను. ఇట్టి దృశ్యము నెన్నడు కని యెఱుగరు. ఇంతమంది వీరుల రక్తమును దేవి గ్రోలినదని దృఢనమ్మకస్థులైరి. ఏమిచేయను వారికేమియు తోపకున్నది. ద్వారములు తెరువబడెను ఇంకేమి జరుగనున్నదోయని బయటనున్న ప్రజలు భీతిల్లజొచ్చిరి. స్త్రీలు, బాలులు వెఱగంది దూరముగా నడచిరి. ఖంగున ఆకాశవాణివలె మ్రోగుచున్నది. సౌదామినివాక్కు గంభీరవాక్కులుకురియుచున్నది. ఆమెను మహాశక్తి ఆవహించియున్నది. తదేకదృష్టితో జనసమూహమెల్ల ఆమె ఆస్యమువంకనె జూచుచుండిరి. కొందరి నేత్రకొనలనుండి దుఃఖప్రవాహము ప్రవహించుచున్నది. గర్భగోళమునకు ప్రవేశించినవారెల్లరి ఒకరికొకరు బంధుస్వరూపులే. లోలోన దుఃఖించుచుండిరిగాని బిగ్గఱగ నొక్కరేని వాపోవ సాహసింపలేదు. వాపోవుచు ఆమెక్రోధాగ్నిలో మగ్గిపోవలసి వచ్చునేమో! ఇట్టి చిక్కులచే వారిహృదయములు దహించుచుండెను. "ఓ పిరికిపందలారా! స్వార్థపరులారా! మీరక్తసంబంధము నేటితో తెంచబడినది. దేవి మీ బంధురక్తమును చవిజూచినది. పొందు గృహముల

కే తెంచుడు వేగమె, లేకున్నచో ఆతల్లి మిమ్ములను ఆహార ముగా గొనవచ్చును. సత్యము.'' అని సౌదామిని పలుకును. కొందరు పారిపోజొచ్చిరి. మన రక్తబంధువులె మఱియుగ మనము మఱుకు బ్రతికి సంతోషాతిశయముల జెందున దేమి టని అట్టెనిలబడిరి. తిరిగి సౌదామిని లోనకు ప్రవేశించెను. దేవి కాళిచాటునకు నడచెను. విశాలమైన గర్భగోళము. వెనుక ప్రక్క మూకవందలుమంది దిగ్భ్రమ జెందియుండిరి. దేవికి నాలుగు శిరములుగలవు. ఆరీతి వారి అంతరేంద్రియ మునకు గన్పించు చుండెను. వెనుకప్రక్క గంభీరమైన ఆస్య ముగలదు. ఆమె కనులనుండి వర్షధారగా అశ్రుధార ప్రవ హించుచుండెను. ఆమె కౌగిట అన్యాయముగా హత్య గావింపబడిన దీనసంతతి-మూగజాతియుండెను. క్రూరుల కర వాలముల కని మృతిబొందెను, తల్లి కౌగిట నిలబడి యుండెను. వాటివంక తదేకదృష్టితో తల్లి కరుణారసము వెల్లివిరియ జూచుచుండెను. అస్పష్టమైన వాక్కుల బలుకు చుండెను. విశ్వమాతా! నీప్రపంచకములో మమ్ము పోషించువారు లేరు. మా రక్తమాంసాలచే కృషిసల్పించుకొని తిరిగి మా రక్తమాంసాదుల భుజించువారే? మమ్మిక జన్మము లెత్తిం చకు. క్రూరమానవుల దాడికి తాళము జాలము. ఒకరిని మేము హింసించి యుండలేదు. నిరపరాధులము. అట్టిమమ్ము కఠినకరవాలముచే నరకుచుండిరి. ఎట్టి హింసలు బెట్టివను

యింతవఱకు సహించితిమి. తిరిగి వారికే ఉపకారమును జేయ సమకట్టుచుంటిమిగాని అపకారమనుమాట మనమునందైన తలపము. అమ్మా! స్వతంత్రురాలవు గనుక సీతో జెప్పకొనడమైనది. నీవైనను వారలగద్దించతలుపవే. తల్లీ యని విశ్వమాతను కౌగిలించుకొనుచుండెను.

యీతీరున దీనసంతతి వాపోవుచుండెను. చూచువారి హృదయములు సరయు భాగీరథినదులు కలయురీతి విశ్వమాత కంటిధారలో కలయుచుండెను. ఆమె హృదయమునందు వీరి హృదయములువిలీనమగుచుండెను. శరీరములుమఱచిరి. బుద్ధిని గోల్పోయిరి. ఆత్మను కరుణాసాగరమందు ముంచుచుండిరి. అది పవిత్రస్నానము. పశ్చాత్తాపస్నానము. వారి తప్పుల విశ్వమాత కరుణించి యుండును. ఈతరుణమున సౌదామిని అచట కేతెంచియుండెను. ఈదృశ్యమును కనులార గాంచినది దేవిసందేశము, అస్పష్టవాక్యముల నర్థగంభీరమును గ్రాహ్యము జేసికొనగలిగెను. 'ఓనాసోదరులారా! వీరులారా! లేలెండు మీతప్పిదముల జగజ్జనని భరింతునునుచున్నది. సైరించినది. నివ్వెఱపోవలదు. నేజెప్పుమాటల ఆజనని జెప్పు పవిత్రవాక్యములుగా గ్రహించుడి. ఈమె యందెంత భీకరముగలదో అంత కరుణారసము గలదు, దుర్మార్గుల దునుమాడ ఆమె యందు తాండవించుచున్న భీకర ముపయోగకారి కాగలదు, కరుణారసము శిష్టుల ఆదరించ ఉపయోగకారి కాగలదు.

ఆతల్లి, మిమ్ము నోరులేని జీవముల బలియిమ్మని కోరుటలేదు మీబాహ్య నేత్రములకు గాన్పించ యింకొక దేహము మీయందుగలదు. దాని నామము అహంకారము. భ్రమ, మోహము. తెర, అజ్ఞానిని తొలగించుడు. ఆశరీరమును ఆమెకు విందుగా దగ్ధమొనర్చుడు. కరుణయనక కాల్చుడు. అప్పుడు మీకాతల్లి ప్రత్యక్షదేవత కాగలదు. ఏరీతిని దలచిన ఆరీతి మీకామె కాన్పించగలదు. ఆమె మూలనామము ఆత్మ అందరయందు నిలచియున్నది. తెరను తొలగించుడు: మీకు ముఖాముఖిగ నిలువబడగలదు. చనువుగా పలుకరించగలదు, ఆనందమనెడి ఉయ్యాలందు మిమ్మూగించగలదు జోలపాటల పాడగలదు, మనోహరముగ ఆలకించగలరు. అద్భుతదృశ్యముల జూపగలదు. నేత్రానందముగ జూడగలరు. ప్రతిమానవుడు ఆమె కరుణపొందనిది ఆబంగారపు టుయ్యాలందు కూర్చుండ నోపరు. మనమీ మూఢత్వమందు క్రుంగియున్నందులకు వాపోవుచున్నది మన హృదయాంతరాళముల. పినయిచ్చగిం మచోశాంతిమయులై ఆసీనులుగండు. అట్టితల్లి స్వభావ మును యీక్రూరమానవులు యీరీతిసి సృష్టించి ఘోరకార్య ముల నొనరించుచున్నారు. విశ్వమాతయొక్క భావముల గ్రహములుగా సృష్టిసలిపిరి. ఎంతకాలమొ ఆతల్లిమనమూఢ త్వమును ఓపికనోపిజూడగల్గినది; చూడజాలక బుద్ధదేవుని ఆవ తరింపచినది. తన దివ్యసందేశమును బంపినది. ఆసందేశముతరం

గముగా ప్రవహించినది. కాలమం దంతరించినది. తిరిగి యింకొక తరంగము సృష్టికాగలదు. మూర్తికి పూరా వులు తోడుపడరు. కష్టముచే సత్యమును స్థాపించగలదు. నేజెప్పు మంత్రోచ్చారణను అహర్నిశదీక్షతో సలుపుడు." అని మంత్రోపదేశమును సౌదామిని జేసెను. అప్పటినుం చియు ఆవీరులు సౌదామినికి అంతరంగికులై మెలంగుచుండిరి. వారిహృదయములు పవిత్రతను జెందినవి. ఆవిశ్వమాత సందేశాకారములు వారియింద్రియములందు విలీన మంది యుండెను యువకులు వీరు. విశ్వవనములు పుష్పములువీరు. సృష్టికర్తలు. వీరినుంచి సందేశము వీరిబంధువు లందుకొనిరి. నూత్నయుగము నూత్నజాతి అంకురించినది సౌదామినిచే ఆ పర్వతరాజములమధ్య దేవి ఆశ్రమము కట్టబడినది. దివ్య సందేశములు నలుప్రక్కల వ్యాపించుచుండెను. సౌదామిని చక్కని పుష్పవనంబుల నాటినది. మంగోలియను జాతి అడవి జాతి విద్యాశూన్యులు. విశ్వలీల ఏరీతిని జరుగుచున్నదో వా రెఱుంగరు. వారి అంతర్నేత్రములు మూయబడియుండెను. వీరిని సంస్కరింప సౌదామిని తలపెట్టెను. వీరియందు విద్యను నేర్చుకొను యిచ్ఛ జనింప ప్రేరేపించెను. స్వాతంత్ర్య మన ఏమియో బోధించుచుండెను. ఆమెచే ప్రతిదివసము యీమెచే నిర్మింపబడిన ఆశ్రమమునందు పాఠశాల తెరువబడుచుండెను. రమ్యమైన హిందీభాషను వారలకు నేర్పెను. జాతి నుద్ధరించు

కొను వీరుల సృష్టించుచుండెను. ఆరోగ్యవిధుల విధించు చుండెను. ఈమె సందేశమును భగవత్సందేశముగా గైకొను చుండిరి. మాంసాహారమును పూర్తిగా మఱచిరి. ఫల కంద క్షీరముల మాత్రమె సాత్వికాహారముగా గ్రోలు చుండిరి. ఆహారము మారనది జాయందు లీనమైన ఆత్మ మారనేర దని గ్రహించిరి. వారియాలోచనలు ఉత్కృష్ట ఆలోచన లాయెను. వ్యాయామమును అభివృద్ధి జేసికొనుచుండిరి. యిక్కాలమున అనేక వైద్యములు ప్రతిజీవి వైద్యుడు నిరుప యోగములు దేవీప్రసాదములు గలవు. అవి మూలికలు ఎవరిహస్తమందు దాగియున్నవి. అడవిజాతి యనబడు వారి యందు హస్తమును కోతపాలు జేయవలసిన అవసరములేదు. కట్లు కట్టవలసిన పనిలేదు. ఏడ్పించు పున్నెము బొందబని లేదు. దేవీప్రసాదములు గలవు. వాటి ఆకర్షణ గలిగినజాలు. క్షణకాలమున ఎట్టి అభిఘాతములె మాయమందగలవు. అట్టి దివ్యమైన ఔషధరాజములు గలవు. రక్తములోనికి విషము నెక్కించు సాహసికు లప్పటికాలమున లేరు. మానవుడు భోగ లాలసుడగు కొలది కృత్రిమ వస్తువులు సృష్టింపబడుచుండును. వాటియందు మానవుడు మరణించుచున్నాడు. పూర్వీకవస్తువు నసహ్యించు కొనుచున్నాడు. మన సౌదామిని అట్టి వైద్య మును ఆ ఋషికూటమనబడు అడవిజాతికడనుంచి నేర్చుకొన సమకట్టినది. గొప్పవైద్యవేత్తలకడ కరుదెంచు చుండును.

ఆమూలాగ్రముగ వారి వైద్యమును నేర్చుకొనుచుండెను. ఆ జాతిని నూతనజాతిగా నొనరించినది. నూత్న ఆదేశముల నొసంగినది. నూత్నజీవమును పూరించినది. పూర్వజీవమును పారద్రోల గలిగెను. ఈమెను 'తల్లీ' యని మాధుర్యముగ—ప్రేమ పూర్వకముగ ప్రతివాడు పిలచుచుండెను. ఆహా! ఆపదమందు గల మాధుర్య మేమి? ప్రాణాయామము నభ్యసింప మొదలెట్టెను. భూగృహము నేర్పఱచెను. ఇది అంతయు చక్కగ కొద్ది కాలముననె సౌదామినిచే సంస్కరింపబడెను. ఆమెహృదయము మాత్రము మాఱకున్నది. ప్రతిదివసము అరుణోదయంబును జూచు సరికి సౌదామిని హృదయము మంచుకరుగురీతి కరుగుచుండెను. లో, హృదయాంతరాళమునందు, మానవుడు జొరరాని గృహయందు సౌదామిని ఒకని విగ్రహమును పెంచుచుండెను. ఆవిగ్రహము, యీామె ప్రేమచే జీవమును పొందినది. ఈమె ప్రేమ విగ్రహమునకు పాలుకాజొచ్చెను. చైతన్యము జెంది బాల్యము ననుభవించెను. యౌవ్వనము నొందెను. ఆపె హృదయసీమయందు గంతులిడజొచ్చెను. ఆధ్వనులు ఆమె వీనులందు మాఱుమ్రోవ జొచ్చెను. ఆమె నిద్రనువిడచి చాలదినంబు లాయెను. ఆహారమునేని సరిగ గ్రహించుట లేదు. ఈమెయందుగల రక్తమాంసాదులలో నున్నవాడు కాఠిన్యముగా ప్రత్యహము భుజించుచుండెను. శల్యావసిష్ట

సౌదామిని, ఆమె మనసు ఆమెనుండి వీడిపోయినది. హృదయ నివాశిచే నడుపబడుచుండెను. ఇట్టి మనోవ్యాధిచే కృసించుచున్నను ధర్మదేవతను ఆరాధించుచునే యున్నది. ప్రతిదివసము విద్యను, శ్రద్ధతో నేర్పుచునే యుండెను. ఈపె జిక్కిపోవుట కొండజాతి జూచినది. కారణమరయ ఆత్రపడిరి. తల్లీయని సంబోధించి ఆపె క్షేమమూరసిరి. వారి శక్తి ధారబోతు మనిరి. ఒకరి శక్తిపై నాధారపడు వ్యాధియా? కాదు. ఏ యాలోచనతో సౌదామిని యీ వనప్రదేశంబులకు రాగల్గెను. చందు., చందు, అని రేయి స్వప్నములందు జపించుచున్నది. ఇది మోహముకాదు. పవిత్రమైన ప్రేమ. గంగా ప్రవాహము. అడ్డుపెట్టువార లెవ్వరేని లేరు. ఆ ప్రేమకై క్షణభంగురమగు తనువును దగ్ధమొనర్చుటకేని సంసిద్ధురాలు. ప్రేమకై ఐశ్వర్యమును వలదన్నది. చిన్నతనమునుంచి అల్లారుముద్దుగా బెంచినమాత పిత్రుల బాసినది. ప్రేమకై స్త్రీసహజ గుణమగు సిగ్గు—భీతిని బాసినది. హృదయ సీమయందు ప్రేమవృక్షము పెరుగుచున్నది. నీళ్ళు బోయుచున్నది. అట్టికాలమును బలవంతముగా నెట్టుచున్నది. ధర్మమును ముద్దిడుచున్నది. సౌదామిని నీద దీనావస్థ.

---

## ఏడవ ప్రకరణము

---

బ్రహ్మతేజస్సు మహాతేజస్సు. ఆమహాతేజస్సుయొక్క ప్రతిబింబములు విద్యుత్కాంతులు. వాటినె హిందూజాతి

గ్రహములని వ్యవహరింతురు. అవి ఎల్లకాలము కదలుచుండ నేకవిధముల ఏవిధమున ఆవిద్యుద్దీపములు కదలిక జెందునో ఆకాలమందు జనించు మానవుడు అట్టి జీవితాకారమును బొందు. కొన్ని జీవులు పూర్వసంస్కారమునకు తగిన జీవితాకారమును పొందుట యకాయకరుణారాశియగు మాత కరుణకు పాత్రులగుదురు. ఒకొకని యందాతల్లి ఆవహించును. ఆ తల్లి మహాతేజస్స్వరూపిణి. ఆమె యిచ్ఛానుసారముగ మానవుని జీవితాకారముల నిర్మించుచుండును. అందు క్రీడించుచుండును. ఆతల్లి కరుణాపాత్రులె మహాపురుషు లనబడుదురు. లేకున్నచో కైవల్యమందతగిన మానవులుకూడ జననమరణములంద నవసరముండి తీరదు. ఆమె కరుణారాశిగనుక మానవజాతి నుద్ధరించ ఒకొకమానవునందు అమితముగా క్రీడించును. అవియే కాలప్రవాహికలు. ఆమె క్రీడనములె ధర్మశాస్త్రములు. ధర్మశాస్త్రములు కాలగుణ్యముగ ఆతల్లిచే మానవునావహించి రచింపజేయించుచుండును. పవిత్రమైన హృదయఫలకమందు ధర్మలు విశ్వమాతచే చిత్రించబడి యుండును. ఆభాషను దెలసిన మానవు డవ్వాటిని చదువగలడు. గ్రహించగలడు. వినిపించగలడు. పాటుపడగలడు. ఆ పవిత్రధర్మములె జాతులసృష్టించుచుండును. ఆఫలకముపై రచించబడిన ధర్మముల నొకొకపరిచదువరి గ్రుడ్డితనముచే, అహంకారముచే చదువుటలో పొరపడవచ్చును. వారు

ప్రవక్తలు. అవి అధర్మములు అట్టి గ్రుడ్డితనముచే పఠించ బడిన ధర్మములు మతమును కుంటిదానిగా జేయుచున్నది. సత్యమును దూరముగా జేయుచున్న మానవజాతిని మృగ జాతిగా నొనర్చుచున్నది. అట్టి మతము లిప్పటికిని గలవు. పొత్తములపై రచింపబడినవి ధర్మము లెన్నటికిని గానేరవు. హృదయపరిశుద్ధతచే ధర్మములు గ్రాహ్యములగును. పొత్త ములందలి ధర్మములు గాలప్రవాహికచే మురికిగా నొనర్చ బడుచుండును. ఇట్టియనేక కారణములచే మానవుని జీవితము అనేక అవస్థల బొందుచుండును. నిలకడ ఉండనేరదు. నిలకడ లేమిచేతనే చరిత్రకారులు చరిత్రల, కవికావ్యముల రచింప గలుగుచున్నారు. అట్టి రచనలో కప్కోట అను స్థలమును ఏరుకొందము. ఆ కప్కోటయొక్క రచన ఏరీతిని గలదో కొద్దిగ తిలకింతము. కప్కోట వాగేశ్వరమున ఇరువదిమైళ్ళ సాధారణముగనున్నది. ఇచటి విద్య చక్కగ ప్రబలియున్నది. భాషలకు మూలమై భాషామతల్లియై వెలసిన సంస్కృత భాషను వుద్ధరించు పూరుషులు గలరు. సంస్కృతవిద్యాలయ మొందుగలదు. వీరిభాష హింది. గొఱ్ఱెబొచ్చు పరిశ్రమ వీరిది.

ఇచటి గోవులు పొట్టిగా క్షీరమును హెచ్చుగానిచ్చు చుండును. పైప్రదేశమంతయు మంగోలియ జాతివారిది. అవలటిబెటు దేశస్థులది. కప్కోట ప్రాంతమున రామగంగా నది ప్రవహించుచుండును. కప్కోటయందు చక్కగా కళాపో

షణమొనర్చ బడుచుండును. యువకులవలె యువతులును కళాపోషణ, సాహిత్యము మొదలైనవాటికి శ్రమపడుచుందురు. ఈపట్టణము బహుశృంగార వంతమైనది. కళాపోషణ కాలయ మగుటచే యిచ్చట వేశ్యలు నివశించుచు వచ్చిరి. వీరిని పోషించు ధార్మికు లనబడువారలు గలరు. ఆపట్టణమందు ఒక వేశ్యకన్యగలదు. ఆమె నామము చమేలీదేవి. వయస్సు పదునెనిమిది వత్సరములు మాత్రము. ఆబిడ పూర్వీకులవృత్తి వ్యభిచారము. చమేలిదేవి సాహిత్య కళల చక్కగా నొక పండితవర్యునికడ నభ్యసించి యుండెను. ఈపెహృదయము ప్రేమధారచే పూతపూయబడి యుండెను. విషమునింకను గ్రహించలేదు. ఈకన్య బాల్యమునుండియు సుశీల, నిరాడంబరజీవి. ఈమె వచనములు పవిత్రవంతములైన ఖద్దరువుస్తులు కృత్రిమాలంకారముచే శరీరసహజ సౌందర్యమునుగోల్పోవ యిచ్ఛగించదు. ఆమె ముఖవికాసమును ప్రకృతీమతల్లియే చిత్రించియుండెను. ఆపె అరచేయి ముకుళించినచో పూమొగ్గవోలె కాంతిల్లును. ఆవ్రేలు పూరేకులవలె మృదుత్వమును చాటుచుండును. పుష్పవనమందలి పుష్పమువోలె ఆమె ముఖము వికాసవంతమై యలరుచుండును. ఆమె గండభాగములపై సాంధ్య అరుణద్యుతులు నిలయము జేసికొని యుండెనోయన భ్రమింపజేయును. అధరపల్లవము ప్రాతఃకాలపుసూర్యునిచే ముద్దిడుకొనబడగా అంతటి రక్తిమను జెంది

యుండెనా యనిపించును. అదృగాస్వయానము హంసనుండి యరువుకొనెనా యనిపించును. ఇట్టి నవలావన్యనిస్తుల తేజస్వి పూరేకులబోలిన మృదువైన వ్రేళ్ళచే ఎల్లకాలంబుల నేదేవి ఒక పాత్రమును ధరించియెయుండును. సాయంసమయముల చక్కని గీతముల గాన మొనర్చుచుండును. ఈపె కులము వేశ్యకులమైనను హృదయము వేశ్యదికాకుండెను. ఎల్లకాలముల సత్కర్మలందె తవిలియుండెను. ఇట్టి కన్య వ్యభిచార పిశాచమునకు దూరస్థురాలై పదునెనిమిదవ సంవత్సరము వఱకు వివాహమాడకుండెను. వివాహమాడ నిచ్ఛగించుట లేదు. వివాహమందలి నయ్యర్థమునకు దూరస్థురాలైనది. వివాహమున కర్థము ప్రేమముడి. ఇప్పటి కర్కశకాలము వివాహమునకు మోహముడిగా మారిపోయెను. అట్టి మోహ పిశాచమునకు భయమందినది. మోహము వ్యక్తిత్వము, దుఃఖదాయకము, ద్వేషకారికము, ప్రేమ ఏకత్వము. ఆనంద దాయిని, విశ్వవలనే యుత్పత్తిగలది. మోహమూవలను విడదీయునది. మోహమున కాకారము పార్థివశరీరము. ప్రేమకాకారము పరిశుద్ధాత్మ. ఇట్టి తారతమ్యముల చమేలీదేవి గ్రహించినది. ఆనగరమధ్యన ఆమెకొక ఉద్యానవనము. అందొకభవనముగలదు. ఎల్లకాలమును సాహిత్య, సంగీత, కళాపోషణలందె కాలమును ప్రొద్దుపుచ్చుచుండెడిది. ఒక నాటి సాయంసమయమున ఉద్యానవనమునందొక వృక్ష

ఛాయను ఆసీనురాలై వీణను హస్తమందు ధరించి యీ క్రిందిశ్లోకమును మనోహరముగా వాయింప జొచ్చెను.

శ్లో॥ వ్యతిషజతిపదార్థానాన్తరః కోపిహేతుః
నఖలుబహిరుపాధీన్ ప్రీతయః సంశ్రయన్తే ”

ఈశ్లోకము ఆమె కతిప్రీతిపంతమైనది. ఈశ్లోకమున కర్థమేమి. ప్రేమ బాహ్యములై ఉపాధులయొక్క సహాయమునపేక్షించదు. ఏఆంతరిక శక్తివస్తువుల సంఘటనల వశముజేయునో, ఇట్టి శ్లోకము హృదయారవిందముగా పఠించుచున్నది. ఆమె జీవితమును ప్రేమనౌక నధిరోహించ యిచ్ఛగించుచుండెగాని మోహనౌకనెక్కి మునుంగ నిచ్ఛగించుచుండలేదు. అట్టిప్రేమస్వరూపునకై ఆమె హృదయము తహతహ పడుచుండెను. అంతిమ కులస్థుడైనను, కురూపియైనను, విద్యావంతుడు ప్రేమస్వరూపునే కోరియున్నది, అంతదనుక వివాహమాడ యిచ్ఛగించదు. ఆరీతి దొరకకున్నచో ఆజీవితమును ఎండుమ్రానివోలె చిగుర్చనివ్వకుండ దృఢనిశ్చయురాలై యుండెను. ఆమె విద్యాశాలను వదలి సంవత్సరముమాత్ర మాయెను. అప్పటినుంచి ఆమె బంధువులు వివాహము జేసికొను బలవంతపెట్టుచుండిరి. ఆడపిల్లలీవయస్సు వచ్చువఱకు వివాహములేకుండ నుండగూడదను పిచ్చియభిప్రాయముల ఆకన్యకు ప్రత్యహము బోధించుచుండిరి. అనేకవరుల మాట్లాడిరి. ధనవంతుల మాట్లాడిరి.

విద్యావంతుల సౌకుమారుల మాట్లాడిరి. వారిపటముల యీకన్యకర్పించిరి. చమేలీదేవి వాటినన్నిటిని వరుసనేజూచి యుండెను. వారిముఖములందు మోహపిశాచములు విందు యొనర్చుకొనుచుండెనని భావించెను. వారల వివాహమూడ నొల్లదాయెను. ఈరీతిని కాలమును బలవంతముగా నెట్టు చుండెను. రెండవవిషయమున మనస్సునను రానిచ్చుట లేదు. గీతమును వృక్షచ్ఛాయనుపాడుచు అందలి గంభీరార్థ మున హృదయారపిందముగా గ్రోలుచుండెను. ఈపెద్ద ళ్కులు మాఱెను. వాక్కు బంధించబడెను. జీవితనౌక ఇం కొకదిక్కునకు మరల్పబడచున్నట్లు హృదయమునకుతట్టెను. జీవితమున కదొకమార్పు. వాకిటనొకవ్యక్తి నిలువబడియుం డెను. బోడితల కాషాయవసనములు, హస్తములందొక చిప్ప. ఆవ్యక్తియొక్క నేత్రద్వయము గులాబిపూవులవలె రక్తియను దెల్పుచు ప్రేమ సువాసనను వెదజల్లుచుండెను. ఆ సువాసననే చమేలీదేవి గ్రహించెను. హృదయమునకు బారెను. మార్పు గలిగించెను. జీవములేని హృదయము నకు జీవము బోసెను. చైతన్యహీనురాలైన ఆకారమునకు చైతన్యము నిచ్చెను. అటనుండి కదిల్చెను. ఎన్నడు కన్పిం చని ఆమందస్మితము ఆమె పాదములపై నాట్యమాడెను. మందాక్షవికల దరస్మిత చంద్రికలు గన్పించు చుండెను. ఈరవుంద్వారములందు నించి మెల్లగా సిగ్గిలియు సిగ్గిలక

ఆనూత్నవ్యక్తి నైపుకే వచ్చుచుండెను. నూత్నవ్యక్తి యీమె ముఖమునైనను, అతని కఠిన విరాగము, జూడ నిచ్చుట లేదు. సహజ స్వభావమైన సిగ్గుచే చమేలీదేవి ప్రప్రథమమున నూత్నవ్యక్తిని పలుకరించ నొల్లదాయె. ప్రేమప్రవాహమున యీమెకులాడుచున్నది. ప్రేమతరంగముల మునింగి సిగ్గును గోల్పోయినది.

'ఆర్యా తమరెవ్వరో నేదెలియనగునా'

'తల్లీ భిక్షుకు వచ్చువాడెవ్వడై యుండునని తలంచెదరు'

చమేలీదేవి—మీారు భిక్షుకులుగాదు. సర్వత్రతృప్తి కరులని తమ ముఖారవిందము చెప్పకయే జెప్పుచున్నది. భౌతికవిషయమానస లోలురుమాత్రమె భిక్షుకులు. తమరెంత మాత్రము భిక్షుకులుగారు. ధార్మికులు ప్రేమస్వభావులు కరుణా వంతులు—

భిక్షుకుడు—అమ్మ ఎంతకాలము నుండియో ఎన్నో ప్రదేశములో ద్రిమ్మరిల్లితిని. నీవంటితల్లి కానంబడని అక్క జము.

చమేలీదేవి—ఆర్యా తమకు మించినవారల తల్లులని ధర్మమగుగాని మావంటికన్నియల ఆరీతి పిలుచుట మీాకు ధర్మముగాదు. చూడగా మీారు విద్యావంతులుగా కన్పించు చున్నారు. వయస్సునందేమి బుద్ధికౌశలమందేమి అధికులుగా కన్పించుచున్నారు. అట్టితరి నన్ను తల్లీయని సంబోధించుట

భావ్యముగాదని జెప్పసాహసించినందులకు మన్నించ వేడు చున్నాను.

భిక్షుకుడు—ఇదియేమివింత. మా నేత్రముల హెచ్చు తగ్గులు గాన్పింపవు. అందఱు సమానులె. స్త్రీజాతియంతయు మాకు మాతృసమానులు. మాధర్మముల మేము గుర్తించియే మాట్లాడసాహసించినందులకు క్షమింప వేడుకొందును. భిక్షనిడుచో వేగమె వెళ్లగలవాడను.

చమేలీ—అందఱు సమానులైనచో వ్యష్టిసమష్ట్యుపాధులేల ? అందరొక్కటేయైనచో క్రియాకలాపము కర్మకలాప మొక్కరీతిగ ఏల నడువకున్నది. తమవలె జగమెల్ల మానము బూనుచో మానవజాతి అంకురము నింకవలసియుండెడిది.

భిక్షు—తల్లీ! చూడజూడగ గొప్ప విద్యావంతురాలుగా నుంటివి. తత్వశాస్త్రము తెలసియుండగ వచ్చును. కాని ఆ తత్వశాస్త్రము నిరుపయోగము. ఎందువల్ల ననగా ఆ తత్వశాస్త్రము తర్కము నాధారముగా జేసికొని యుండును. సత్య మెన్నడు తర్కముపై నాధారపడదు. తర్కముచే సత్యమును తర్కించుచో చిలుకుచో సత్యము ఆవిరి రూపమున ఎగసిపోవును. తర్కముపై నాధారపడు తత్వశాస్త్రము ఆంగ్లేయులదే గాని మన హిందూదేశమున పనికిరాదు. తల్లీ! నీవు సెలవిచ్చినట్టులే చూతము.

అంద ఱొక్క దినముననే జనించిరా? గొప్పతనము ఆత్మయందు గాని శరీరమం దుండనేరదు. మానము— మానమని తల్లి హెచ్చరించి యుంటివి. బాహ్యమున మానధారులే ఆంతర్యమందు వారినిబోలు క్రియాకలాపులు కర్మయోగులు గలరా? లోన అంతఃశక్తి గలదని వాకొ్కని యుండలేద మన పెద్దలగు ఋషిసత్తములు ఆ అంతఃశక్తిని మేల్కొల్పుచుందురు. ఆశక్తిని స్వాధీనము జేసికొందురు. అశక్తిని ప్రపంచ కల్యాణమునకై అంపుచుందురు. వారు జేయగల కార్యమును ఎంతటి మహాకర్మవీరులేని చేయజాల రని దృఢముగా జెప్పగలను. ఆ శక్తిని కొందరు మాతయని సంబోధింతురు. ఆపె కరుణకై ఎదురు జూచుచుందురు. ఆ మహాతల్లి కొందరపుత్రుల జగమున పైకెగరు వేయు చుం డును. వారు కీర్తివంతు లగుదురు. కొందరిని ప్రేమాధిక్య ముచే ముద్దిడును. వారు కళావంతులగుదురు. కొందరిని ఱొమ్మున ధరించి స్తన్యము నిచ్చును. వారు శక్తివంతు లగుదురు. కొందరా తల్లియందె క్రీడించుచుందురు. వారు వారు బ్రహ్మజ్ఞానులు. ఈరీతిని ఆతల్లి కరుణారసముచే ప్రపంచకము కదలుచున్నది. కర్మ, కర్మ నాచరించవలెనని మాబుద్ధదేవుని ఆజ్ఞ. హిందూదేవు డనబడు కృష్ణదేవుని ఉత్తమఆజ్ఞ. ఆ కర్మయనగ నేమిటో గ్రహించి మానవుడు కర్మ నాచరించవలెను. కర్మవలన తన ఆత్మను తానుద్ధరించు కొనును. అంతియేగాని ప్రపంచకము నుద్ధరించ బ్రహ్మకేని

తరముకాదు. మాహృదయసీమయందు అనంతమైన కర్మ జరుగుచునే యుండును.

చమేలీ— ఆర్యా! తమరు సెలవిచ్చిన దంతయు సత్యమైన అయియుండవచ్చును. మీకీ ఆకారము కృత్రిమమా? ప్రకృతి సహజమా? ఆబోడితల యేమి. ఆ కాషాయవస్త్రము లేమి. దేహీ యనుచు ప్రతియింటను భిక్షమెత్తుటేమి?

భిక్షు—మాబుద్ధదేవుని ఆజ్ఞ. బాహ్యకర్మ కలాపము నాచరించుచో మోహమునందు మునింగి స్వధర్మమును గోల్పోవుదుమని యీరీతిని చరించ బుద్ధభగవాను డాజ్ఞయిడి యుండును.

చమేలీదేవి—బుద్ధభగవానుడు గతించి చాలకాలమైనది. ఆ మహాపురుషుని సద్భావములన్నియు మకిల జేయబడినవి. బౌద్ధమతమునకు మూలము కర్మయనిగదా శాస్త్రములు జెప్పుచున్నయవి భిక్షమెత్తుకొంట కర్మమా? కర్మము యొక్క అర్థమును గోల్పోయినారనవచ్చును. సత్యమును ఆనందమును చైతన్యమును పోషించునది పరికించిచూడగా కర్మయగును. నామాట ఆలకించుడి. పురుషులగు మీయందింత చనువుగా మాట్లాడుచున్నందులకు క్షమించుడి. ప్రపంచమందసత్యము ప్రబలియుండగా అట్టి యసత్యమును భిక్షమెత్తువాడు దునుమాడగలడా? కృషీవలునియందున్న సత్యా

నంద చైతన్యములు మరొకనికడ గలవా? భగవతీ ఆ దేశమును కృషీవలుడు గ్రహించు చున్నాడు. జగము నంతను మేపుచున్నాడు. భూదేవియొక్క చనుబాలను పితికి మానవాజాతికి పోయుచున్నాడు సత్యమునకై శరీరధారణ జేయుచున్నాడు. కృషీవలుడు ఋషీ వలుడు. ఉద్యోగి కుద్యోగి సన్యాసివిన్యాసి. కృషీవలుడు పవిత్రవంతమైన ఆలోచనలచే హృదయ మందు సత్యదేవిని పూజించు చున్నాడు. ఇతరజాతిని మేపుచున్నాడు. ఆహా ఎంతటికర్మ. భగవద్దీనజాతిని హృదయారవిందముగా పోషించుచున్నాడు. ఎల్లకాలము కర్మమునే ఆచరించుచున్నాడు. సోమరితనమును వెడలగొట్టుచున్నాడు. సన్యాసిమతమే భారతదేశము నింత వరకు కొనితేగలిగియుండెను. మనస్సు నెవ్వడంతరింపజేసి పవి త్రహృదయాజ్ఞగ ఫలితమునువీడి కర్మనాచరించు నెవ్వండో వాడెముమ్మాటికిసన్యాసి. ఆర్యా తమరు కోపముజెందవలదు నేనుస్త్రీస్వరూపినైనను అంతరాత్మయం దెంతగలదోఅంతయు వెలిబుచ్చు సాహసికురాలను. అహంకారమును నశింపజేయు నెవండో వాడె సన్యాసి. శ్రమయనుకొనక బౌద్ధమహాముని మరణపర్యంతరము కర్మనాచరించియుండలేదు. అతని నేత్ర ములఎదుట ఎన్నడేని అహింసజరిగియుండెనా? ఆరీతిని నిజ మైన బౌద్ధభిక్షు ఆచరించవలెను. అతని ఆత్మను విశ్వాత్మగా నొనరించవలెను. సోమరితనమునువీడి ఎల్లకాలముకృషీవలు

డై చైతన్యము గొని తేవలెను. అందునేతానాందము పొంద వలెను. కొంతకాలమున కేమతమేని సత్యమునకు దూరస్థు రాలై, చైతన్యమును గోల్పోయి పిశాచరూపిణియైన ఉపకా రమునకు బదు లపకారమునే చేయుచుండును. చైతన్యమును కృషిని గోల్పోవువాడెన్నడు మానవుడని పిలువబడనొల్లడు. అందువల్లనే కృష్ణభగవానుడు సన్యాసికేని కర్మనువుధించెను చైతన్యమందె ప్రేమగలదు. ప్రేమయందు సత్యానందములు ముమ్మాటికిని గలవు.

భిక్షు—అమ్మా! తమరు సెలవిచ్చిన సందేశమును హృదయపూర్వకముగా అందుకొనుచున్నాను. నేటినుండియు కర్మ నాచరింతును. భిక్షునిడి త్వరితముగా నన్నంపుడి.

చమేలీ—అదియేమి వెంట వెంటనే అమ్మాయని నన్ను వ్యవహరింతురు. అర్థములేని వాక్యముల నాడనేల! సర్వమానవజాతికి అమ్మయనబడువస్తువు వేరగలదు. ఆమహా తల్లి స్త్రీలకు-పురుషులకు-బాలులకు-వృద్ధులకు 'పవిత్రవంత మగు మాత యగును' అమ్మాయని నన్ను వ్యవహరించ జనదు. నేటినుండి తమరుకర్మకలాపమున దిగుదునని యనుట నాకెంతయో సంతోషజనకముగా నున్నది. కర్మకలాపులకు బాహ్యవేషములతో పనిలేదు. వారిది నిరాడంబర జీవితము. ఆలోచనలుమహోత్కృష్టతమములు. బౌద్ధభిక్షులందు చైత న్యము లేకుంటచే ఒకరి నాకర్షించుకొన జాలకులడిరి. కళా

విహీనమైనది. హిందూమత సన్యాసుల జూడుడి, వారి ముఖా రవిందము, సత్యానంద-చైతన్యముచే పొలుకారుచుండును. కాని మీయందొకవిధమైన, ఎవరియందు కన్పించని చైతన్యము కన్పించుచున్నది. అందుల కబ్బుర మందుచుంటిని. నేటినుండి కర్మనాచరింతు మంటిరిగదా? కర్మనాచరించుటకు మీకొకసహచారిణి అవసరముండునని నావంటికన్య తలంచుచున్నందులకు మన్నింప వేడుచున్నాను.

భిక్షు హృదయము తల్లడిల్లెను. ముఖారవిందమందు కన్పించు చైతన్యము కళావిహీనతను జెందెను.

భిక్షు—ఏమి కఠినవచనము, యిదిగో నేను వెళ్లుచున్న వాడను.

అని ద్వారమునుంచి పాదమును కదిలించును. చమేలీదేవి ప్రేమ ప్రవాహముచే నతని అడ్డగించును.

చమేలీ—మీహృదయము యింతటి కఠినహృదయమని యింతకు తెలుపనైతిని. గృహస్థాశ్రమము చెడ్డయనితలంతురా? బ్రహ్మచర్యాశ్రమమునదప్ప ముక్తి దొరకనేరదా? ఇదియేమి బౌద్ధమత మూఢనమ్మకము, బౌద్ధసన్యాసులు ముక్తిజెందునది. ప్రపంచమంతా జన్మనందునది. గృహస్థులు, స్త్రీల విషయమేమి? ఈశ్వరుడు కరుణా రాశియందురే? తన పుత్రులపై యింతటి కఠినవిధాన మవలంబించునా? ప్రపంచమంతయు సన్యాసమును బూనుచో చైతన్యహీనమైన వల్ల

కాటివోలె నుండును. భీకరస్వరూపమును జెందును. ప్రేమ నశించును. ఆనందము కన్పించదు. మీ యిచ్ఛవచ్చినరీతినే నడచుకొందురుగాక? ఒక్కమాట నాలకించుడు ఆ వేషము నేని మార్చజాలరా? నేనింత చనువుబూని జెప్పుచున్నందులకు క్షమింపుడు. అప్రయత్నముగా, అకస్మాత్తుగా ప్రేమ విద్యుత్కాంతి ఆర్యుల హృదయమందు జొరినది. స్వతంత్రను బూనినది. ఈశ్వరుడు తన ఆనందమునకై కర్మనాచరించుచున్నాడు. ఆచరించియు ఆచరించనివాడగుచున్నాడు. యిచ్ఛలేకయు ఇచ్ఛనుగలిగి సృష్టిస్థితిలయకారకు డగుచున్నాడు. ఆలాగుననే మానవుడు ఈశ్వరానందమునకై కర్మనాచరించవలయు. కర్మయందు ఈశ్వరుని ఆనందముగలదు. ఇచ్ఛలేకయుయిచ్ఛనుగలిగి ఎవ్వాడు ఈశ్వరునివలె కర్మనాచరించుచున్నాడో వాడు భగవత్సమానుడగుచున్నాడు. మీరు కర్మనాచరితునని నందులకు నాసంతసము నిదివఱకె తెలిపియుంటిని కర్మనాచరించునధికారము గలదని ఆకారము చాటవలెను. తమరు మీసము లేమిచాటుచున్నది. శరీరమునందు శక్తియినుమడించ యౌవ్వనరాజ్యమునొంది కర్మనాచరించునంతటిశక్తివంతుడని మీసములు చాటును. అందుచే మీరు మీసముల బెంచవలెను. యింకొకముఖ్య విషయము, మీసముల క్షత్రియకులోత్తములు గౌరవించుట వినియేయుందురు. క్షత్రియకులము కర్మనాచరించుటను ముఖ్యధర్మముగా గ్రహించినది.

అందుచే మీసముల బొందియుండిరి. క్షత్రియులు మీసముల నేగతి ఆదరించియుండిరో అదేరీతి ఋషికులము గడ్డమును సన్మానించియున్నవారు. ఇప్పటికర్దాసిని వీడకున్నారు. ఋషులు రాజులకు, చక్రవర్తులకు, గృహస్థులకు, సన్యాసులకు గురులు వారు జెప్పురీతి ప్రపంచకము నడువవలసి యుండును. శక్తి వారియధీనము. భవిష్యత్తు వారు దెలసియుందురు. శాస్త్రముల సృష్టింతురు. ఆలోచనాపరులు. వారిశాస్త్రాధారముననే ప్రపంచకము నడువకున్నది. అట్టిమహాపురుషులు గడ్డములనేల ధరించిరి. ఆఋషిసత్తములు గృహస్థులు అట్టి మహాపురుషులు గృహస్థులేల గావలసివచ్చె. గడ్డమునకర్థమేమి? దురభిప్రాయమును బొందనివాడెల్ల బ్రహ్మచారి. సదాచారి బ్రహ్మచారి. ధర్మవేత్త బ్రహ్మచారి. వివాహము లేకుంటచే బ్రహ్మచారి కానేరడు. వారు గృహస్థులైనను బ్రహ్మచర్యమును గాపాడుకొనిరి. బ్రహ్మచర్యావలంబులకు కొన్నిధర్మములు గలవు. అందుగడ్డముచు బెంచుట అత్యుత్తమధర్మము. శరీరమందిమిడియున్న చైతన్యమంతయు రోమకూపములద్వార పైకెగసిపోవుచుండును. అప్పుడుమానవుడు కామప్రేరితుడగుచున్నాడు. అటుల గాకుండుటకై ఋషిసత్తములు గడ్డముల బెంచి బ్రహ్మచర్యావలంబకులైరి. జీవము గడ్డముంటచే ఊర్ధ్వగతిని బొందును. మెదడును పోషించును. అమితమైన శక్తితో గూడిన ఉత్కృష్టాలోచనల గల్గించును. కనుక

సదాచారునకు గడ్డముండుట శ్రేయస్కరమని తలంచు చున్నాను. స్త్రీనై మీకింతకు జెప్పినందులకు క్షమింపుడు. నాయందెట్టి ఆగ్రహమును బూనకుందురుగాక.

భిక్షు—నాజీవితమందెన్నడు నేర్వని గొప్పపాఠము నేడు నీకడ నేర్చుకొనియుంటిని. నేటినుంచి మీసము గడ్డముల మన సంతతిలో సదాచారులు ధరించినరీతి ధరించెదను. ఇక సెలవా ?

చమేలీ—తమవంటి అధ్యాత్మికవీరులకు, వేశ్యాకుల జుల గృహములలో నివశించువారు సెలవొసంగ నర్హులా !

భిక్షు—అర్హులేకు! తల్లీ, బుద్ధిమూలముగాని కులము మూలమగునా ?

చమేలీ—తల్లియని సంబోధించుటేమి ?

భిక్షు—అమ్మా, మాత, జననీ యని ముమ్మారు మనసార సంబోధింతును. చూడంజూడ నీముఖారవిందము క్షత్రియ కన్యను బోలియున్నవి. కాని వేశ్యాసహవాస దోషముచేతనో, ఎందువల్లనో తమవంటి కన్యలకిట్టి గుణము లబ్బుట హాశ్చర్య జనకము.

చమేలీ—అయ్యా! నాహృదయమును త్రవ్వకుడి ఉష్ణరక్తము విరివిగా నన్ను ముంచివేయగలదు.

భిక్షు—తల్లీ! ఏమటులనెదవు. ఆ, ఆ, హాహోమె దేల!

చమేలీ—అయ్యా! మీకనేక నమస్కారములు విధి

నన్నేల సృష్టించెనో తెలియకున్నది. నాజీవితమువంటి దుర్భాగ్యజీవితము ముల్లోకములందు లేదనియే తలంచెదను.

భిక్షు—తల్లీ! ప్రతిజీవి జీవితమటులనే పరిణమించు చుండును. కష్టములెల్ల ఒక్కరీతిగా నుండనేరవు, కష్టసుఖముల భగవానుడు హస్తమందు లిఖించియే భూలోకమున కనుపుచున్నాడు.

చమేలీ—అయ్యా! భగవానుడంతటి కృపారస పాత్రుడా? ఎవరిజీవిత పరిణామమును వారి హస్తములందు రేఖారూపేన లిఖించి యుండునా?

భిక్షు—భిక్షుసత్యముగ—

చమేలీ—అయ్యా! ఆలాగునేని నిదర్శనములేని దే నెట్టి విషయము నే సత్యమని నమ్మజాలను.

భిక్షు—ఆలాగునేని, హస్తమునిటు జూపుడీ.

అని హస్తమును చక్కగా పరికించును. దిగ్భ్రమ నొందును.

చమేలీ—అదియేమి.

భిక్షు—తల్లీ ఏమని జెప్పవలెను. చెప్పకొద్ది మాటల యాలకించుము. ఇట్టిహస్తము నేనింతకు చూడలేదు. నీది వేశ్యకులమని నేనెన్నటికి నమ్మజాలను. నీవొక క్షత్రియ కన్యవై యుందువు. తల్లీ తల్లీ యిదియేమి, నీకు వివాహ మైనదా?

చమేలీదేవి హృదయసరస్సును ఆభిక్షు వాక్యములు తుపానై కదలింపజొచ్చెను. ఆతుపానులో చమేలీదేవి మరపు జెందెను. కెవ్వని కేకవైచెను. వెనుకటి జీవితమంతయు నేత్రములెదుట తాండవ మాడజొచ్చెను. స్పృహదప్పెను. శ్వాస క్షీణించెను. వాక్కుబంధించెను. బౌద్ధభిక్షు విస్మయమందెను ముప్పెద్దియోమూడు నేమొచని భీతిల్లెను. ఆశ్రమాభిముఖుడై వెడలెను.

కొంత తడవకు చమేలీదేవి మేల్కాంచెను. శిరమునే వాల్చియే యుండెను.

చమేలీ—"అయ్యా! మీరు దేవతలా? లేకున్న జీవితావస్థల చక్కగ దెలుపగలవారు భువినిగలరె. యోగిపుంగము కాలము నధీనముజేసికొని భూతవర్తమాన భవిష్యత్తుల జెప్పగల సిద్ధపురుషుల పెద్దలు జెప్పుదురు. శాస్త్రములుచాటుచున్నవి. నాయవస్థనుగాంచి కనికరించి గగనమార్గమునుండి యీనరలోకమున కేతెంచితిరా? సామాన్య మానవులుగ నెంచి యేమేమియో బోధజేయ సమకట్టినందులకు నాపైగినిసి మాట్లాడ నిచ్చగించరా" అనిజెప్పి శిరమును పైకెత్తిజూచెను భిక్షు అచ్చోటెగలడని తలంచి చమేలీదేవి మాట్లాడియుండెను. కాని బౌద్ధభిక్షు వెడలియుండెను. బౌద్ధభిక్షుచట లేమికి చమేలీదేవి మరింత దుఃఖించెను. జరిగిన విషమావస్థనుఆసిద్ధపురుషుడు వచించియుండెను. 'భవిష్యత్తును జెప్పుననియు,

అం దేమియెజీవితమునకుఆసగలదేమొ విన కుతూహలమైయుం డెను. కాని సిద్ధపురుషుడు వచ్చినదారినె వెడలియుండెనని దలచి యుండెను. తన భవిష్యత్తు కంటకమయముగా నుంటచే ఆసిద్ధపురుషుడు వాటినెల్లజెప్పి తన మనస్సును నొప్పించ నెంచమి వెడలియుండెనని చమేలిదేమి తలంచెను హృదయసీమయందు కారుమబ్బులుగమ్మి ఝంఝామారుతముగ వర్ణింపసాగి యుండెను. ఆమె నేత్రములు కనిపించుటలేదు. మనోవీధి యంతయు ధూమముచే గప్పబడియుండెను. దారి గన్పించుట లేదు. ఆమె శిరోజములన్నియు ముడివీడియుండెను. ఊమ్మ్స్పందన మందుచుండెను. ఇంతకుముందు తానధివసించియున్న వృక్షఛాయకడకు తడబడు పదములతో వెడలియుండెను. పుష్ప వృక్షముకడనున్న తన వీణను అందుకొనెను. సర్వజనులకు పగలుగా గన్పించు దినము ఆచమేలీదేవికి రేయిగానుండెను. మెల్లన సోపానములనుంచి గృహములోనకుజొచ్చెను. ఆరేయి యెల్ల నిద్రలేదు. ఆ భిక్షుదృశ్యమే నేత్రములముందు గని పించుచుండెను, 'వివాహ' మను కఠినవాక్యా కర్ణములందు మాఱుమ్రోగు చుండెను. దైవవిధిని తప్పించ మానవుని వశముకాదుగదా యని హృదయ దౌర్బల్యమును వీడెను. కానున్న భవిష్యత్తును ధైర్యముతో ఎదిర్చ గుతూహలయై యుండజొచ్చెను.

ప్రాతఃకాలమునందలి ఉషఃకాంతయుంను ఆసలీను నట్లుగా చమేలీదేవికి వివరము తెలియనివెట్టి అసలుదయించ

మొదలెట్టెను. నిన్నటిదినమున జూచిన బౌద్ధభిక్షున మరల జూడ గుతూహలపడుచుండెను. ఏవిధముననేని అతని దర్శించ వలెననియే పట్టుదల బూనెను. ఏలంత పట్టుదల! ఏలనా! ఎన్నడో ఆ భిక్షునొసలందు దాగియున్న పురాతనకాంతిని జూచినట్లు హృదికి గట్టిగ తట్టుచుండెను. అప్రయత్నముగా అతనిపైకి చమేలీదేవి పవిత్రమైన ప్రేమననుపుచుండెను. ఆ బౌద్ధభిక్షు నివశించు స్థలమెద్దియో! అతడు తిరిగి నేడును భిక్షకై వచ్చునా? వచ్చుచో భిక్షకు గుప్పెడు ధాన్యము నిడుదునా? గుప్పెడు ధాన్యము నిడుచో నా హృదయమం దభిఘాత మేర్పడునే? ఆవ్యక్తియందు నా బాహ్యానేత్రము లకు కనిపించని వస్తువెద్దియో నిలుకడజేసికొనియున్నది. ఆ వస్తువు నన్ను పీడించుచున్నది. అతనివైపుకె లాగుచున్నది. అబ్బ. ఈప్రేమ యెట్టిది పవిత్రప్రేమసుమా? నాజీవితకాల మందు నాకు నేడెన్నడు బొందని నొకవిధమైన సంతోషము నారక్తనాళములందుప్రవహించుచున్నది.ఎంతటిపాపిని.నిన్నటి దివసమున ఎంతయో కాలము నాగృహద్వారముకడ నిలచె. నాగృహమా? ఎంతటి పిచ్చదానను. ఈ గృహద్వారమున నిలచె. ప్రసంగించె. ఎందుకై? భిక్షకై? కాదు. కాదు భిక్షకైనచో భిక్షనుపొందకే నేనస్పృహలో నుండగా వెడల సాహసించునా? బాహ్యమున కాన్పించని వస్తువెద్ది నన్ను పీడించుచుండెనో సోదరభావమున ఆ ఆ. సోదరభావమున ఏమి నాకు సోదరులెవ్వరు. ఏమి నాపిచ్చయూహాలు. భిక్ష

నిడకుంటె నేమిటది? భిక్షుకుడైనచో యీ గృహముకడ భిక్ష నడుగుట వృథాప్రయాసయని నేడు రాకుండు నేమొ? ఏమి భిక్ష? నాహృదయసీమయందు పండెడు బంగారుపంటకు బంగారుధాన్యములకు ఆహా! ఈశ్వరా! ఏమి నీ విచిత్రము. ఏడి యా భిక్షుకుడు నేడు వచ్చుచో భిక్షనడుగుచో ఏమి యివ్వగలదానను. ఇవ్వగలదానను. ఆ సత్పురుషునికి సిద్ధ పురుషునకు సోదరసమానునకు ఏమి సోదరసమానున కని అప్రయత్నముగ వచ్చుచున్నది. లోనెవ్వరో యుండి యీ రీతిని పలికించుచుండిరా! ఎవరైనను కానిండు. సోదరుడా? అని పిలుచుకొను భాగ్యము గోల్పోతి చిన్నతనమునే. నాకీ జగ మున సోదరులు లేరు. నేను సోదరినిగాను. కాదు కాని ఆ భిక్షు కుడు నేడు వచ్చుచో ఏమియిత్తును. ఇత్తునీకంఠహారమును. కంఠహారమును గైకొనునా? గైకొనకేటులెమ్ము. అని చమేలీ దేవి అనేకవిధములు తలంచుచుండెను. ఆహాభిక్షు భిక్షు కన్పించవా! స్థలమహాత్మ్యమని పెద్దలు వాక్రుందురా! నిన్నటిదినమున గృహద్వారమున నుండ ఆమహానుభావుడు కనిపించెను. నేడు ఆదిక్కునకే పోయి జూచెదను. నాభాగ్య మును నాఅదృష్టమును పరీక్షజేసి చూతునుగాక యని చమేలీదేవి ఆశతో ద్వారముకడ కేగెను. నలుదిక్కుల పరికింపసాగెను. మానవుని యూహలరీతి కార్యములు సాను కూలములగుచో విశ్వనాటక మిదివరలోనె పూర్తియైయుండె

డిది. పవిత్రప్రేమకై మానవుడెన్నియో కష్టముల కోర్చును గదా ? అర్ధఘంట—కాదు—ఘంట—కాలము చమేలీదేవి ఆతీరున నిలబడి అత్యాశతో చూడదొడగెను. భిక్షుకులు మెండు. భిక్షులేదు. నిరాశజెందెను. భోజనవేళ మించెను. క్షుధను తీర్చుకొందమని గృహములోనకు వెడలనుండెను. ఇంతలో ఆపెవెనుక ఏదియో అలజడి, ఏమది! అద్దికొంటి పిల్లల వెక్కిరింతలు. ఎవరిని, భిక్షును. ఎందువలన, అతని మానమును, వేషమును జూచి వెక్కిరించుచుండిరి. పరిహాసము జేయుచుండిరి. ఇంత యవ్వనుడయ్యు ఏదియె పరిశ్రమ జేసికొనలేక ఎవరిసంపాదనల తిందమని తిరుగుచుంటివని యావ్వనమూర్ఖులు యనసాగిరి. పవిత్రవంతమైన సన్యాసితనమున కీగోల! ఈ అలజడి చమేలీదేవి కర్ణములందుబడెను. విద్యుత్కాంతివోలె రక్తనాళములందొక నూత్నవికాసము పారడజొచ్చెను. వెనుకకు తిరిగిచూడ భిక్షు. చమేలీదేవి సంతసమొనగూడెను. పలుకరించ బిడియమందెను. నూత్నపురుషుని చనువుగా కన్యయొకర్తె పిలువగూడదని భావించెను. కాని అప్రయత్నముగా తన్నాదిక్కున కీడ్చుచున్న ఒకదివ్యమైన శక్తి పలుకరించు మనుచుండెను. పవిత్రప్రేమ, పలుకరించ తప్పులేదని దృఢముగా నమ్మెను. 'ఓసిద్ధపురుషులారా !' యిటురండనెను. శిరమునువంచి నడచుచున్న బౌద్ధభిక్షు చమేలీదిక్కు జూచెను. చుట్టు

ప్రక్కలనున్న కాకిమూక లనుమాన మందుచుండిరి. సత్య మున కెవ్వ రేమిఁతలచిన నేమి? సత్యవంతుఁడు — ధీరుఁడు ప్రపంచము సంతయు నొకమర్కటముగా రీతిగా నెంచును. నేడాదిక్కు భిక్షుపోదలచలేదు గాని ఆతల్లి పిలచుటచే పోక తప్పినదిగాదు.

చమేలీ—అయ్యా? భిక్షుగోనువారు నిన్నటిదినమున భిక్షను గొననందులకు గల కారణం బెద్ది?

భిక్షు—సోదరీ! మొదటిపరి భిక్షయని వేడితిని ప్రసం గవశమున నాభిక్షను మఱచియుంటివి. మావంటి విరాగులు భిక్ష నొక్కసరె యడుగుదుముగాని అనేకపర్యాయము లడుగ నిరాకరింతుఁడు.

చమేలీ—నాతప్పును క్షమించుడి. నిన్నటితప్పును మీకరుణచే నేను ఒప్పుగామారునుగాక. నేనిడుభిక్షను గైకొందురా?

భిక్షు—పిడికెడు భిక్ష నిడుటందరకు విశదమేగదా? సోదరీ.

అంతట చమేలీ కంఠహారమునుదీసి పిడికెడుతో నివ్వ బోవును.

భిక్షు—తల్లీ! ఏమి మీసాహసము. రమణులకడకు రాగూడదందురు యిందులకే! తల్లీ-నమస్కారము నే వెళ్ళు చున్నాను.

చమేలీ—అయ్యా! క్షమించుడి, ఆగుడు. కరుణించి నావాక్కు లాలకించ వేడుదును. ఒక్కమాట నడిగెదను. నాభిక్షను గైకొనకుందురా? నాకేని ఒకభిక్ష యీదీనురాలి కిత్తురా?

భిక్షు—పరులకు సహాయము జేయుటగదా మాముఖ్య ధర్మము.

చమేలీ—అయినచో ఒక్కపరి దర్శనమివ్వగలరా!

భిక్షు—విధికృత్యము తీరున్నచో ఆలాగె నగుగాక.

చమేలీ—అయ్యా ముఖ్యవిషయమును మఱచితిని. తమరు నివశించు స్థానమెద్ది?

భిక్షు—రాంగంగానదితీరమునం దొకకుటీరమున అని భిక్షు పలుకుచు నదీతీరమునకై వెడలెను.

---

## ఎనిమిదవ ప్రకరణము.

---

కప్కోటప్రాంతముననే రాంగంగానది ప్రవహించు చుండును. దానిప్రక్కనే శృంగారవంతమైన వనమొందు గలదు. ఏమిరమణీయత. బౌద్ధభిక్షునకు గలకార్యములెవ్వి? హృదయారవిందముగా ప్రకృతిరమణీయతను భోగించుటయె. బౌద్ధభిక్షు గ్రామమందు భిక్షనుగైకొనివచ్చి, మదమాత్సర్య

ముల పురిగొల్పు పులుపు, కారము, నూనె మొదలైన వస్తువుల విడనాడి, సాత్వికాహారమును భుజించుచుండును. తియ్యని పదార్థమును ఎక్కువగా విరాగుల ప్రేమించవలసిన బాధ్యులగుదురు. గోధుమరొట్టె, ఆవుపాలు, ఫలముల మాత్రము మనభిక్షు భుజించుచుండును. అవ్వియు ముమ్మారు కుక్షినిండ భుజించనోచుకొనలేదు. దినమునకొకే పర్యాయము. ఆహా ఏమి బుద్ధమహాదేవుడు నిధించిన నిధులు. ఏమికాఠిన్యము. అనవసరముగా తరుణీమణుల చెంతకుపోజనదు. గ్రామమధ్యంబున నివసించజనదు. శృంగారము బౌద్ధమతస్థులకు పనికిరాదని జెప్పుచు అన్నివిషయములు కలసివచ్చును. శృంగారము లేనిచోట ప్రేమగాని, చైతన్యముగాని, ఆనందముగాని, నివశించవని జెప్పనొప్పును. సౌందర్యమే మానవునియందునకు నడువప్రేరేపించుచుండును. శృంగారమునకె మానవులుజీవితముల దగ్ధముజేసికొనిరి. శృంగారము నాధారముచేసికొని యెన్నో చరిత్రలు ఆధారపడియున్నవి. మానవుని గ్రాహ్యశక్తి యందుమాత్రమే తప్పుఒప్పులు గలవుగాని వస్తువునందెంత మాత్రము తప్పుఒప్పులు లేవని తత్వశాస్త్రజ్ఞులు ఐక్యకంఠముతో నుడివియుండిరి. భగవత్ప్రేరితులు మినహా మానవుడు సౌందర్యమును, ప్రేమనువీడి బయట నివసించలేడు. సర్వసాధారణముగ అవి ముప్పునే చేకూర్చును. అందుకై ఋషిసత్తములు తమ యౌవ్వనకాలమున శృంగారప్రేమ

లందలి రుచిజూచి తరువాయి మనస్సును భగవద్విషయము నందు అవలీలగా లయింపజేయగలిగిరి. ఇట్టిఆధారములమీ దనే నాలుగాశ్రమము లేర్పడెను. ముక్తికి సాహససౌందర్య ము చేదోడువాదోడుగా కదలుచుండును. ప్రేమలేనిమతము ప్రపంచకమున యింతవఱకును లేదు. కబీరు రచనల నొక్క పరి తలచుచో మానవుని బుద్ధివికాసము నందగలదు. బౌద్ధ మతముయొక్క మూలసూత్రము ప్రేమ. సహజసౌందర్య మెచ్చోటగలదో అచ్చోట ప్రేమ మహిమ హెచ్చుగానుండ గలదు. బౌద్ధమతము సత్యమునకు—నిర్భీతిగ, జాతిమతముల విడనాడి విశ్వమును తన ఆత్మతో గాగలించుకొను స్వభావ ముగలది. బౌద్ధమత వృక్షము క్షీణించగా అందలి చైతన్య ము నశింపజొచ్చెను. మతము ఆకర్షజనకముగా నుంటకు బదులు, యిప్పుడిప్పుడు—భీకరముగా నుండ జొచ్చుచున్నది. అట్టి మతమును మన బౌద్ధభిక్షు అవలంబించియుండెను. మొదటగలిగిన, యావ్వనఊష్ణముచే—ఉత్సాహముచే ఎంత కాఠిన్య స్వరూపియైనను, బౌద్ధమతావలంబి యైనాడు. కాని యిప్పుడిప్పుడు జూడగా, అతని ముఖమునందు నిరుత్సాహము జనించెనా యనునట్లు తోపనగుచుండెను. మన బౌద్ధభిక్షు ప్రకృతిసౌందర్యమును హెచ్చుగా ప్రేమించువాడు. మొదట బౌద్ధమతమున నిర్ణయింపబడిన ధర్మముల చొప్పునే నడువ సాగియుండెను; కాని యిప్పుడిప్పుడు తన ఆత్మ ఏరీతి అనుజ్ఞ

యిచ్చునో ఆరీతిచేయ సాహసించియున్నాడు. మతము పేర మూర్ఖముగా నడువనొల్లడు. మన బౌద్ధభిక్షుని పూర్వ నామమును మన మేహూత్ర మెఱుంగము. ఇప్పుడు 'అశోక రాం' అని ప్రజలు వ్యవహరించుచుందురు. ఇతడు తన కుటీరమును ప్రకృతిద్వారా పొందియుండెను. ఆహా! ఏమని జెప్పవలయు! చిన్నకుటీరము. కుటీరముపై కప్పంతయుపచ్చని ఆకుచే కప్పబడియుండెను. స్త్రీధరించు, వస్త్రముపై, పుష్ప జాతు లేరీతియుండునో! అదేరీతి అశోకరాముని కుటీరముపై పుష్పజాతులు అనేక విధముల వికసించి మనోహరముగ నుం డెను. కుటీరముచుట్టును చక్కని పుష్పలతలు అల్లబడియుం డెను. అనతిదూరముననె ఫలవృక్షములు మెండుగాగలవు. అశోకరాముని వెంట ఎల్లకాలంబున వనమృగంబులు సహజ ప్రేమతో వెంటాడుచుండును. అందొక లేడిపిల్లను అశోక రాము అల్లారుముద్దుగ పెంచుచుండెను. తానుభుజించు ఆహా రమును ప్రప్రథమమున ఆలేడిపిల్లకు పెట్టియే మరి భుజించు చుండును. ఆలేడిపిల్లతో ఆటలాడుకొనుచుండును. ప్రొద్దునం తయు ఆలేడిపిల్లతోనె ప్రొద్దుబుచ్చుకొను చుండును. కాని అశోకరాముని గోక్షీరమునకై ఒకగోవును సంపాదించి యు న్నాడు. ఏమహానుభావుడా పున్నెమును గట్టుకొనియుండెనో? చమేలీదేవి యిచ్చినసందేశమును చాలవఱకు అశోకరాము ప్రేమించి యున్నాడు. అందువల్లనే కాబోలు మునపటిదిన ము

నుంచి మీసములనుగడ్డమును పెంచ మొదలెట్టెను. ఇదివరలో తేజశూన్యమైన ముఖమునకు నేడొకనూత్న తేజస్సుఆవిర్భవించెను. ఇతని కార్యక్రమ మెద్దియో ఆలోచింతము? రేయియెల్లయు సోమరితనముగా మోహజనకమైన నిద్రను హెచ్చుగాపొంద నిచ్చగింపడు. ఒకరాత్రి యెల్లను ఏడుఘంటలు మాత్రమె నిద్రించుచుండును. తొమ్మిదిఘంట్లకు పరుండి నాలుగుఘంట్లకు మేల్కాంచుచుండును. ప్రాతఃకాలకృత్యముల చక్కగా నెరవేర్చును. రాంగంగానదిలోపరిశుభ్రముగా స్నానమొనర్చెను. ఐదుఘంటలు మొదలు ఆరుఘంటలవఱకు ధ్యానతత్పరుడై మనస్సునుభగవత్స్వరూపమునందు లయింపజేయును. గోక్షీరమునుపితికి లేడిని గ్రోలజేయును. అందరకు మానవజాతికి సర్వమునకు సేవకుడైన కర్మయోగికి సేవకుడేల? అందుచే అశోకరాం తనగోవునుతానె ఆవనమందు మేపుచుండును. మేపబోవుముందు గ్రామపర్యటనము సల్పి వచ్చుచుండును. ఒంటిఘంటకు కాబోలు ఆహారమును భుజించును. శరీరము ముక్తికివాహనముగదా? అట్టి శరీరమునకు సాయంకాలములందు తగినంతవ్యాయామము నిచ్చుచుండును. సాయంసమయములందు రాంగంగానది తీరమునవిహరించు లేడిసమేతముగా వెళ్ళుచుండును. తనఆత్మను వీచుమారుతమునందు ప్రవహించు నదియందు. ప్రకాశించు సూర్యునందు లయింపజేయును. గానము నాలకించుచుండును. ఒకనాటి సాయంసమ

ప్రేమను జూపెనా? ఇదిగో లేడిపైకై దుముకనేల! ఇంతకాల మునుంచి పెంచబడిన యీనాశరీరమును తృప్తికరముగా భక్షించుము. అని తన లేడిపిల్లకు-క్రూరమృగమగు చిఱుత పులికి మధ్యనిలచియుండెను. కంఠమును పులియెదుట నుంచెను మానవుని సంకల్పము విధినెఱవేరనిచ్చునా? లేదు. లేదు. ఆవలి పొదచాటున క్రూరమృగముల నతిశయించు నరక్రూరుడింకొక క్రూరుడుగలడు. ప్రేమజనకమగు యీనాటకమును తన క్రూరత్వముచే రద్దుజేసిగాడు. ఆహా భగవానుడా! ఇట్టి సంతతిని ఏతీరున పొందియుంటివి. క్రూరుని హస్తమునందొక విల్లంబుకలదు. నిర్దాక్షిణ్యము నంతయుఆచిఱుతపులి పైనొక్కపరి జూపించియుండెను. ఆహా! క్షుధతో పీడింపబడుచున్నది ఎన్నిదివసములనుంచి ఆహారము లేమి కృశించుచుండెనో? తన యెదుటకు భగవాను డాహారము బంపెనని సంతసిల్లుచుండెడు చిఱుతపులి, తన చావును తాగుర్తించకుండెను. భగవానుని మాయ. ఈక్రూరుడు ప్రేమస్వరూపుడగు అశోకరాముని నేత్రద్వయమునకు తగులలేదు. నేత్రద్వయమునకు నాటుచో అతని క్రూరత్వమును తన ప్రేమసాగరముచే వెళ్ళదరిమియే యుండును. ఏదిలేదు. చిఱుతపులి కంఠమునందా యంకుశము నాటుకొని పోయెను. చివ్వున రుధిరము కారుచుండెను. ఆహా మృగమా? నిన్ను నిర్దాక్షిణ్యముగా మరణింప జేయనుండెనా? చేయనుండెనో? నిన్ను రక్షించ, చికిత్సించి ఒక్కవైద్యు

డేనిలేడ. ఆహా! మానవుని ఒక్కనికి వేసకువేలు వైద్యులు
వెంటుంటయేమి; ఆ. ఆ. జీవమునకు; దిక్కులేని జీవము
నకు, లేకుంటయేమి? పోని—ఓదార్చ తల్లిదండ్రులు—అన్న
దమ్ములు—అక్కచెల్లెండ్రులేరా? ఆహా నిర్దాక్షిణ్యుడా? ఒం
టరిగా, ఆవచనమందు, ఆచిఱుతపులి మరణించవలసిన దేనిర
పరాధ ఓహో! చిఱుతపులికితోడు యీవ్యక్తి యెవరు? భిక్షు
బౌద్ధభిక్షు అశోకరాము. ఆత్మ ఆదృశ్యమందు విలీనమందెను
తనువుతల్లడిల్లెను, స్పృహదప్పెను. ఆచిఱుతపులిపై పడియుం
డెను. రెండుహస్తములతో ఆదిక్కులేని వనమృగ రక్తకంఠ
మును కౌగిలించి యుండెను. మోహాముగ్ధులకు స్త్రీకంఠము
యీధర్మపురుషునకు కర్మవీరునకు రుధిరము కారుచున్న క్రూర
మృగకంఠము కౌగిలింత కుపయోగపడుట అతనిపాదములకడ
లేడి బొబ్బలెట్టుచు పడియుండెను. చిఱుతపులినుండి స్రవించు
రుధిరము అశోకరాముని కంఠమున స్రవించుచున్నట్టుండెను.
నేత్రములు మూతపడియుండెను. ఆహా. ఎట్టిదృశ్యము. కరు
ణాజనితమగు దృశ్యము. అశోకరాము కఠినపరీక్షకు గుఱియై
నాడు. గెలుపొందినాడు. ప్రకృతికన్యలు ధన్యవాదములొసం
గుచున్నవి. అశోకరాము డేమాయెను. ఈమహాపురుషుని
ఆత్మ ఆచిఱుతపులి ఆత్మతో దేవలోకమున క్రీడించుచున్నది.
ధరాతలంబున్నెకంటికి కానరాని సత్యాగ్రహులిట్టివారలెందఱు
గలరోగదా! కర్మవీరులకు కర్మవీరులు కానరారట కాంతారము

లందుదాగి యుందురు. వారికర్మ మహాకర్మ. కొద్దికర్మ ఆచరించినను కీర్తిపూరుషుడు, తన గ్రహబలిమిచే మానవజాతికి కీర్తివంతుడుగా కన్పించును. ఎంతటిరాజయోగులు, జ్ఞానయోగులు, భక్తియోగులు, కర్మయోగులు, మానవజాతికి కానరాకయే వెర్రివారివలె గ్రుమ్మరుచున్నారు. ఆమహాత్ములు ఆత్మసామ్రాజ్యమున కధిపతులు. వారివాక్యములు భగవద్వాక్యములు. అట్టి మహాపురుషులఆత్మ బలిమిచేతనే జగము కదలగల్గుచున్నది. కఠినహృదయుడగు కిరాతకుడేమి చేయుచుండెను? ఈదృశ్యమును కనులారగాంచినాడు. అశోకరాముః మహాయోగిపుంగవుడని మనస్సున నిశ్చయించి యీ మహాపురుషుని సమీపమునకేని రాజుంకియుండెను. ఈదృశ్యమునుగాంచిన చండకరుడు తనసహచరుడగు చందురునకు జెప్పి జూపించ గాబోలు గ్రుంకుచుండెను. మారుతము మెల్లన మెల్లన వీచుచు . భయంకరరూపమును ధరించుచుండెను. గంగానది యీదృశ్యమును తిలకించలేక ఘోషపెట్టుచుండెను. ఆకాశము బొబ్బలెట్టుచుండెను. తన భర్తను వినినవార్తను కనులార గాంచుదమని గాబోలు సౌదామిని అంబరవీధిని మెరయుచుండెను. ఒక్కపరిగ యీదృశ్యమును గాంచలేక క్షణక్షణమునకు ఆకాశవీధిని మెఱయుచు లోనకు జనుచుండెను. రాంగంగానది యందు యీసమయమున ఒక ఓడ చండమారుతవేగమున వచ్చుచుండెను. అందొక కన్య

ఓడయందున్నట్లు కన్పించుచుండెను. ఆకన్య సౌందర్యాతిశయంబు లేమని జెప్పవలయును. ఇంకను చంద్రుడు రానె లేదు. చంద్రుడు రాకున్నను అట్టిలోటును పోనాడి రాకా సుధాంశుని మిన్నగా ప్రకాశించుచుండెను. ఆమె నేత్రములు గొప్ప ఆసనుబూనియున్నట్లుల సూచించుచుండెను. ఆ ఓడను నడుపువారు కేళీ విలాసముగనుండిరి. పల్లెటూరి పాటల పాడుకొనుచుండిరి. మన అశోకరాముని కుటీరమువంకకె ఆ ఓడవచ్చుచుండెను. సమీపించుకొలది ఆకన్యయొక్క సంతోషాతిశయముల జెప్పనలవికాదు. ఆమెప్రక్క నెవ్వరెవ్వరో ఆసీనులై యుండిరి. వారెల్లరు ఏమేమియో ప్రసంగించుచుండిరి. కొందరు పురుషులు ఓడవారి పాటల వీనులవిందుగా వినుచుండిరి.

"శివునిశిరమందు చేరియున్నగంగ
మమ్ముద్ధరించంగ మహినివస్త్రీవా
సుళ్ళు-మొసళ్ళ-నూటీని-దప్పింపు
మాతల్లికరుణించి-మమురక్షింపు
ఏటేట మాబ్రతుకు-నీటిలోనిద్రించు
చల్ల చల్లనిగాలి-సాగుచుండంగ
ఆడెడి ఆటలకు-పాడెడిపాటలకు
తంతినాదించుహృద-యాంతరాళాన

జ్ఞానభాండారమని–ఖ్యాతిగాంచినీవు
కాలప్రవాహికై–గాసిలనేల
వలదలవానల–వాలుగరానీకు
జోలపాటలవిని–స్రుక్కుచుండంగ''

పాటలతో వారిర క్తనాళములందు ప్రవహించు చైత న్యము ఉబుకెత్తుచుండెను. ముప్పదిగజముల దూరమునకై వచ్చిరి. ఓడయందున్న కన్యయొక్క హృదయము కారు మబ్బులచే క్రమ్మబడియెను. ఎవ్వరాకన్యయో పారకాజెప్ప గలవా! చమేలీదేవి! ప్రేమనాగరమునబడి తన్మయత్వము జెంది కాలమను ఓడయందు సంచరించుచున్నది. అశోక రాముని ఆకారమే ఆమెకనుదోయి యెదుటకాన్పించుచుం డగా లజ్జావిశేషంబుల వీడి యీతీరున వచ్చుచున్నది. ఆ నాటినుండి యీామెకునిద్రలేదు. ఆహారములేదు. ప్రేమకై లోలోన చింతిల్లుచున్నది. ఆప్రేమకింకను ఆకారమేర్పడ లేదు. ఏదియో ప్రేమ శరీరముక్షీణింప చొడగెను. చమేలీ దేవి నివశించుగృహము నందలివారెల్ల కారణము లరయు చుండిరి. డాక్టరులకు జూపించుచుండిరి. నాకు సరియైన వాయుభక్షణలేదు. గంగానది వాయుభక్షణజేసినగాని నా వ్యాధి కుదురనేరదని చమేలీదేవి వచించియుండెను. ఆమె వాక్యములు దైవవాక్యములు. సత్వరమాచరణీయములు. ఆక్షణమే ఓడప్రయాణ ఆసన్నులైరి. ఓడపైని పాదమిడి

నదే మొదలు చమేలీదేవి వ్యాధి దూరము కాసాగెను. మనోవ్యాధిని మాపసే సమర్థ్యులయుగనా ? ఓడకదలుకొలది చమేలీదేవి ముఖారవిందమున నూత్నతేజము నుంచ మొదలెట్టెను. నదీమధ్యమునకు ఓడ వచ్చియుండెను. రాకా సుధాంశుని షోడశకళల చమేలీదేవి నతిశయించుచుండెను. ఆమెవెంట వచ్చినవారెల్ల చమేలీదేవియొక్క వ్యాధి ఎంత త్వరలో కుదిరెనని అక్కజపడుచు నదీవాయువును గూర్చి వేనోళ్ళ పొగడియుండిరి. అశోకరాముని దృశ్యము ఇరువదిగజముల దూరమున చమేలీదేవి కంటయెదుటబడెను. ఆహా ! ఏమని జెప్పవలెను. వెనుకటివ్యాధి రాజుకొచ్చెను. ఆకాశమునందు కారుమబ్బులల్లుకొనియున్నట్లు ఆమె ఆస్యమున అల్లుకొని యుండెను. అశోకరాముని కుత్తుకయందలి రుధిరము చమేలీ దేవికి కన్పించెను. చిఱుతపులి భీతిగొల్పెను. లేడిపిల్ల జాలి గొల్పెను. చమేలీదేవి యికపైని చెప్పనేర్పజాలకపోయెను. 'ఓకళాసులార ! ఇకను ఒక్కక్షణమేని కదల్పవలెను. ఇచటి గాలి అనారోగ్యకరముగా నున్నది. గృహాభిముఖులుగండి' అని చమేలీదేవి ఆదేశించియుండెను. బ్రహ్మవాక్కుగా ఆ కళాసులు చుక్కానిని త్రిప్పిరి. యమునాతీరగ వ్యాధి, వ్యాధి రూపముగనె పరిణమించి యుండెను. అశోకరాము స్పృహ దప్పి అరఘంటకాలమై యుండును. కిరాతకుడా గంగానది యున్న ఓడను జూచియుండెను. వాని భీతి మరింత హెచ్చె

ను. అశోకరామునిని స్పృహను ఆకిరాతకుడు మరణముగా వ్యాఖ్యాన మొనర్చుకొని యుండెను. ఈ వ్యాఖ్యానము నకు—కర్త. అశోకరాముని జంపిన దితడేయని భావింతురు కళాసులని కిరాతకుడు భీతిజెంది యుండెను. ఎటులైన పారిపోద మనియే తలంచుచుండెను. వాని అదృష్టవశమున యింతలో నదియందు నడచుచున్న ఓడ మఱొకనైపునకు దిరుగుట తిలకించినాడు. సంతోషమతిశయిల్లెను; కాని యీదృశ్యము హృదయము నావేదన పరచుచుండెను. మేల్కాంచుచో, యీమహాముని ఏమని శపించునో, కోపించునో, గద్దించునో, పవిత్రుల గద్దింపులే ప్రభను జూపుచుండును. ఈమహాముని గతించెనో చూతమని కిరాతకుడు మెల్లన చిఱుతపులికడకు వచ్చి నిలబడియుండెను. పాదములు తడబడుచుండెను. హృదయము తటతటలాడుచుండెను. కరుణాకరమగు సముద్రంబున విలీనమందిన అశోకునిఆత్మ అప్పుడప్పుడె చలింపసాగెను. దేహము కదలసాగెను. నేత్రముల విప్పసాగెను. కిరాతకుడు వెనుకకు పాదముల వేయుట జూడసాగెను. "ఓ—ఓ—ఎవరు—నీవు—"

కిరాతకుడు—"అయ్యా - మాది - యీ గ్రామమే." అని కంపింపసాగెను.

అశోకరాం—గ్రామముకాదు. ఎవరునీవు?

కిరా—నేను, క్రూరముగా చరించు కిరాతకుడ.

అశోక—ఓ-ఓం కిరాతకుడవా! కాదు-కాదు-దేవ సమానుడవు. మమ్ము కడ తేర్చవచ్చిన దైవసమానుడవు.

కిరా—క్రూర కార్యము లాచరించు నేను దైవసమానునగుదునా?

అశోకరాం—ఓమానవుడా! నీవు నాకు దైవసమానుడవుగానే కన్పించుచున్నావు. చేసిన క్రూరతనీయందావేశించిన కిరాతకత్వము నీయాత్మ చేయునది కాదు. అద్దియే దైవసమానమని పలుకుచుంటిని. మరియు నీసహాయముచే నన్ను ధర్మదేవత కడకు గొంపోవగల్గితివి. నన్ను పరీక్షించవచ్చిన దేవుడవు.

కిరా—అయ్యా మీరుజెప్పమాట లేమొ తెలసుట లేదు.

అశోక—అగును మానవులభాష దేవతలకెల్ల తెలియగలదు. కాని యీచిఱుతపులిని ఎందులకై చంపియుంటివో తెలుపగలవా!

కిరా—అయ్యా! మాగ్రామము నేలెడివారొక రాజులు. ఇలాంటి జంతువుల తెమ్మంటాడు మాదొర. బహుమతులిస్తాడు.

అశోక—మానవుడా! బహుమతులా! మీదొర నెన్నియో జంతువులావేశించి యున్నవి. వాటినిజంపుకొనలేక నిన్నీరీతిని బనిపియుండెనా! మానవుల వధించిన మరింతబహుమానమును మీదొరయివ్వజాలడా!

కిరాతు — తెలియదు బాబు.

అశోక — తెలిసియు తెలయదందువేమి? చనిపోయిన జంతువుల మీదొరకడకు గోంపోయిన లాభమేమిగలదు? బ్రతికి మానవులగొంపోవరాదా? ఇదిగో నీవెంట నేవత్తును. నన్ను బంధించిన నీ ఋచ్ఛవచ్చిన రీతిగా దీసికపొమ్ము.

కిరాతు — అయ్యా తెలిసొ తెలియకొ చంపాను. క్షమించండి.

అశోక — తెలియక చంపియుంటివా?

కిరాతు — అయ్యా మాకింతవఱకు మీవలె బోధించినవారులేరు. చంపమనేవారు. తెమ్మనేవారేగాని తెలిసినోరుగదా అరె యీలాచంపటంతప్పు అని ఒక్కరైనమమ్ము గద్దించి చెప్పారాబాబు తెలియకచుగుచు చంపితె తప్పేమి బాబయ్యా!

అశోక — ఓ విచిత్రమానవుడా! నిన్నెకందు వధించుచో తప్పెద్దిగా తలంతువు.

కిరాతు — నన్ను ఏలచంపుతాడు. అందరికి పనిపాటలు చేస్తారు ననుజంపితే ఎవరు! నా పెండ్లాము బిడ్డలు ఏడ్వరా?

అశోక — ఎల్ల జీవులకంతియే. ఇప్పుడీ చిఱుతపులిని జంపితివిగదా! ఈపులి దానిబిడ్డల-తలిదండ్రులనెందర పోషింప బాధ్యరాలో వారిగతియేమి. ఇంతకు కారకుడవీవగదా! ఈ పులిసంతానము కూనలు భోరున ఏడ్చుగదా! వాటి ఉసురంతయు నీవు-నిన్నంపిన మీదొర పంచుకొన సమర్థులు.

కిరాత---అయ్యా-దన్నములు మీరుజెప్పిన బోధనా హృదయమందు కలతనొందజేయుచున్నది. కాని, బాబయ్యా, మాకప్కోటరాజును మీరెఱుగరా? మాపెద్దరాజు ముసిలోడులయిపోయాడు. ఇదివర కెన్నిక్రూరకార్యములు చేసినాడు. కాపులకు అప్పులుబెట్టి, దొంగనోట్ల సృష్టించి వారి కొంపదీసినాడు. మారాజు, బాబపై అంతస్థునుంచి క్రిందకు దిగనైనదిగడు. అతని యిచ్ఛయే రాజ్యమేలినదట. ఇప్పుడు నిండ ఆయనకు డెబ్బదిసంవత్సరములు వచ్చాయి. ఇప్పుడిప్పుడు పంగనామాలు పెట్టుతాడు బాబ. ఇదివర్లో—కాదు, మొన్నటివఱకు ప్రతిదినము, మాంసమునే మారణము జేసెవాడు. బాబవారికి పాపములేదు? ఇప్పుడన్ని మాని వేస్తినంటాడు. రాజ్యవ్యవహారములతో దనకిక పనిలేదంటాడు. ఎప్పుడు పదిమంది పెద్దల దగ్గర కూర్చుండబెట్టుకొని, ఏమేమొ వేదాంతముల జెప్పుతాడు? యోగాలట! ఏమియోగాలో బాబయా? ఊరుబయట పెద్దతోటల వేసాడు. అనేకచెట్ల నాటినాడు. అక్కడట ప్రాణాన్ని బిగబట్టుతాడు. బలాత్కారముగ దేమున్నిచూస్తాడట. ఒక్కొకసారి బాబుచెప్పుతాడు. నేను యీజన్మలో రాజునై పుట్టినాను. పూర్వజన్మనయోగిని. అందువలన రాజునై యీజన్మలోపుట్టాను. ఇప్పుడింక యోగమెక్కువచేస్తె రాజాధిరాజునై పుట్టుతానంటాడండి మావంటి సేవకులు ఆయన దర్బారుకు వెళ్లుచుంటె, అన్నివదిలినానంటాడు. కొడుకంటె హృదయాన్ని కొరుక్కుతింటాడు. అయ్యో ఆయన వేదాంతమేమొ; బండలవేదాంతము. లోపలేంటో ఆలోచిస్తాడు. ఆచూపుల్లొనె ద్వేషమంత కనుపరుస్తాడు.

కిరాతు—తెలియదు బాబు.

అశోక—తెలిసియు తెలయదందు వేమి? చనిపోయి జంతువుల మీదొరకడకు గోంపోయిన లాభ మేమిగలదు బ్రతికి మానవులగొంపోవరాదా? ఇదిగో నీవెంట నేవత్తును నన్ను బంధించిన నీయిచ్చవచ్చిన రీతిగా దీసికపొమ్ము.

కిరాతు—అయ్యా తెలిసొ తెలియకొ చంపాను. క్షమించండి.

అశోక—తెలియకి చంపియుంటివా?

కిరాతు—అయ్యా మాకింతవఱకు మీవలె బోధించినవారులేరు. చంపమనెవారు. తెమ్మనెవారెగాని తెలిసి నోరుగదా అరె యీలాచంపటంతప్పు అని ఒక్కరైనమమ్ము గద్దించి చెప్పారాబాబు తెలియకనుగుచు చంపితె తప్పేమి బాబయ్యాం!

అశోక—ఓ విచిత్రమానవుడా! నిన్నొకండు వధించుచో తప్పొద్దిగా తలంతువు.

కిరాతు—నన్ను ఏలచంపుతాడు. అందరికి పనిపాటలు చేస్తారు నను జంపితే ఎవరు! నా పెండ్లాము బిడ్డలు ఏడ్వరా?

అశోక—ఎల్ల జీవులకంతియే. ఇప్పుడీ చిఱుతపులిని జంపితివిగదా! ఈపులి దానిబిడ్డల-తలిదండ్రులనెందర పోషింప బాధ్యురాలో వారిగతియేమి. ఇంతకు కారకుడవీవగదా! ఈ పులిసంతానము కూనలు భోరున ఏడ్చుగదా! వాటి ఉసురంతయు నీవు-నిన్నంపిన మీదొర పంచుకొన సమర్థులు.

కిరాత——అయ్యా-దన్నములు మీరుజెప్పిన బోధనా హృదయమందు కలతనొందజేయుచున్నది. కాని, బాబయ్యా, మాకప్కోటరాజును మీరెఱుగరా? మాపెద్దరాజు ముసిలోడులయిపోయాడు. ఇదివర కెన్నిక్రూరకార్యములు చేసినాడు. కాపులకు అప్పులుబెట్టి, దొంగనోట్లు సృష్టించి వారి కొంపదీసినాడు. మారాజు, బాబపై అంతస్థునుంచి క్రిందకు దిగనైనదిగడు. అతని యిచ్ఛయే రాజ్యమేలినదట. ఇప్పుడు నిండ ఆయనకు డెబ్బదిసంవత్సరములు వచ్చాయి. ఇప్పుడిప్పుడు పంగనామాలు పెట్టుతాడు బాబ. ఇదివర్లో—కాదు, మొన్నటివఱకు ప్రతిదినము, మాంసమునే మారణము జేసెవాడు. బాబవారికి పాపములేదు? ఇప్పుడన్ని మానివేస్తినంటాడు. రాజ్యవ్యవహారములతో దనకిక పనిలేదంటాడు. ఎప్పుడు పదిమంది పెద్దల దగ్గర కూర్చుండబెట్టుకొని, ఏమేమొ వేదాంతముల జెప్పుతాడు? యోగాలట! ఏమియోగాలొబాబయ్యా? ఊరుబయట పెద్దతోటల వేసాడు. అనేకచెట్లు నాటినాడు. అక్కడట ప్రాణాన్ని బిగబట్టుతాడు. బలాత్కారముగ దేమున్నిచూస్తాడట. ఒక్కొకసారి బాబుచెప్పుతాడు. నేను యీ జన్మలో రాజునై పుట్టినాను. పూర్వజన్మనయోగిని. అందువలన రాజునై యీజన్మలోపుట్టాను. ఇప్పుడింక యోగమెక్కువచేస్తేరాజాధిరాజునై పుట్టుతానంటాడండి మావంటి సేవకులు ఆయన దర్బారుకు వెళ్లుచుంటె, అన్నివదిలినానంటాడు. కొడుకంటె హృదయాన్ని కొరుక్కుతింటాడు. అయ్యా ఆయన వేదాంతమేమొ; బండలవేదాంతము. లోపలేంటొ ఆలోచిస్తాడు. ఆచూపుల్లొనె ద్వేషమంత కనుపరుస్తాడు.

అయ్యా క్రొత్తధర్మాలు తెస్తాడు. పోత్తగాలు చదువుతాడు. ఆయన అభిప్రాయములకు సరిపోయినపోత్తముల సెబాసంటాడు. బిచ్చగాండ్లకు బిచ్చము పెట్టకూడదనే ధర్మము, ఎందుకనియని మాబోంటివాండ్లంటె సిద్ధాంతము తెస్తాడు. మేము సంపాదించి వాండ్లకేల బెట్టవలె. వాండ్లు పాపులు ఆలాజన్మించినారు. అనుభవించవలెనంటాడు. అయ్యా మాదిగమాలల వీధిల్లో నడువనీయడు. దేము వెంట వాండ్ల రానీయడు, వాండ్ల భక్తిరసముగ పాడనివ్వడు. దేముడు వాండ్లకేలంటాడు. పూర్వము నూతంద్రులు మాదిగవాండ్ల కంటెతో చూచినాడు కాడు. నేడు వీండ్లకింత హెచ్చేమేలనంటాడు. అయ్యా మేము హీనజాతులమట. వేదాంతములో సమముగా జూడాలెనంటాడు. మాలవాండ్ల ద్వేషంగ చూస్తాడు. వాండ్లురాకుంటె ఒక్కనాడు కాలముగడువదు. వేదాంతమంత మనసులో నుందంటాడు. మనసుకుదిరితె మరణము లేదట. అయ్యా ఎప్పుడు జోస్యాలె. ఏమి చిత్రంబాబయా! ఎంతకాలము బ్రతుకుతానో చూడమంటాడి దేమిటి? తనకంటె మంచి మానవుడ కనపడితె కండ్లతో నిప్పులగురిపించు?

అశో—నేను జెప్పునది సావకాసుడవై వినుము. ప్రపంచక మంతయు యిట్టి ప్రజలతోడనే కూడియున్నది. వారిభావముల కప్పిపుచ్చ జూచుచుందురు. ఇట్టి వారికి వృద్ధాప్యమున వేదాంతము వచ్చిన దన అక్కజము కానేరదు. వారు మరణమునకు భీతిల్లుదురు. ఇట్టిజాతివారు స్వార్థపరులు. ఆత్మద్రోహులు. వారి భావములలోని ఆత్మ గ్రహించుట లేదని తలతురు. ఎన్ని యోగాభ్యాసములుసంవత్సరముల

కొలది నల్పినను పవిత్రహృదయము శాంతి సమత్వభావము నిర్భీతి మనోబలము అహింసలేనిది ఈశ్వర సాక్షాత్కారము కాజాలదు. మన యాత్మతో విశ్వమును కౌగిలించవలెను. మానమును బూనవలెను. పై జాతివారి యందహంకారము మెండు. అహంకారము నశించనిదె మోక్షము రానేరదు. భగవంతునకు జీవునకు అహంకారము తెర అది తెగినగాని విశ్వసాక్షాత్కారము కానేరదు. మాలజాతియేమి తన కప కారము నల్పుజీవమందేమి తన ప్రేమస్వరూపమగు ఆత్మను గాంచవలెను. అప్పుడు ఆనందము లభించును. జీవించియు జీవించనట్లుండవలెను. అనగా ఎప్పుడు అహంకారము లేక జీవత్వము నశించునో అప్పుడతడు దేవత్వమును బొందు చున్నాడు. దేవత్వమును బొందినవాని కందఱు సమానులే. తన రాజ్యమంతయు పంచములు కూలివాండ్ల ద్వార ఏర్ప డినదని గ్రహించవలెను. తాను జీవించియుంటినను మాట మరువవలెను. తన యాత్మతో విశ్వమునువలను నేయవలెను. అందు భగవంతుడు పట్టుపడవలెను. నిరాడంబరజీవనమే పవిత్రతకు మూలము ఆత్మ సాక్షాత్కారమందలి వాడెంత మాత్రమును పల్లెత్తియేని బ్రహ్మవిద్యను గుఱించి చెప్ప నర్హుడుకాజాలడు. ప్రపంచకమంతయు మదోన్మత్తులచే మలి నము కావింపబడినది. పూర్వపు ఆశయములనె పట్టుకొని కూర్చుండు మూర్ఖులెందఱో గలరు. మానవుడిట్టివారినుండి తప్పించుక తిరుగవలయును. సరె! నీవిషయమేమి ఎవరి విషయమునో జెప్పసాగియుంటివి. నీవీ కఠినవృత్తిని బూను టేల నీపెటకు రానుండుటేల?

కిరా—అయ్యా! నమస్కారములు. మీయాశ్రయమున కపకార మొనర్చినవాడనైనను సత్పురుషులగు మీరు నాయందాగ్రహము బూనక సత్యమును గుఱించి బోధించిరి. మా ముసలిరాజు కుమారుడిప్పుడీ కపోతకోటను పాలించుచున్నాడు. యౌవ్వనుడు. విద్యాధికుడు. దగ్గఱ దగ్గఱగా అతనిచారిత్ర మీరీతిగు నె ఉండనోపును. ఇతని తండ్రి యోగి, ఇతడు మహాభోగి. అతనికడ నే సేవ జేయుచుంటిని. మాగ్రామములో అమృతవల్లియను వేశ్యగలదు. దానింటికికొంతకాలము క్రిందొకకన్య వచ్చియున్నది. బహుసుందరి. గుణవిశేషములం దసమాని. ఆమెను మారాజు వలచియున్నాడు; కాని బాబ-వేశ్యయైతె ఆమె మహారాజగు మారాజును వలచకుండునా? ఏమిచిత్రమో వలదనుచున్నది. ఎన్నివిధములో ఆమెను ఒప్పించమని నన్నాయుద్యోగమున నియమించినాడు. రాజాజ్ఞ, ఆమెకు ప్రియమైన వస్తువులనెన్నియో బంపును ఆతల్లి వలదనును. హేమమును సైతము హేయముగ జూచుచున్నది. సుందరమైన, నూత్నమైన, పిట్టలబట్టి తెమ్మని మారాజాజ్ఞ వాటినాకన్యకంపి జూచుచున్నాడు. అందుకై నేనీవనమునకు రావలసివచ్చినది. వచ్చియు పిట్టల సంపాదింపకుంటిని. సంపాదింపకుండియు పులినొకదాని జీవముల దీసితిని. బాబ మీరు జెప్పినమాటల వింటె నాగుండెయలు వ్రయ్యలగుచున్నది. ఆపులిసంతానముపుసురు నన్ను బాధించగలదని జెప్పియుంటిరే ఇదిగో నాఖడ్గము. నాకు నేను జంపుకొని ఆపాపసంహారము జేసికుందును.

అశో—ఆగుమాగుము- ఏమిసీమూంక్షము-నీహృదయము నిశ్చయముగా మార్పుజెందినట్లున్నది. మీరాజుబాబుకు మిన్నయగుదు వీవు. భగవానునకు-వేష-భాష-అధికారము-భాగ్యములజూచి జడచి కన్పించువాడుకాడు. వాడు పూరి గుడిసెలందు జీవించువారల రక్షించుచుండును. ఇక మీద మనస్సునందేమి-క్రియారూపముననేమి హింసను జేయబూనకుము. సాత్వికాహారివిగమ్ము. పాపభూయిష్టమగు నీసేవకావృత్తిని వెంటనె విడనాడుము. నీదు పశ్చాత్తాపము, చిఱుత పులిని హింసించినహింసనుమాపుజేయుగాత! సతతము భగవన్నామము నుచ్చరింపుము. శరీరము భోగలాలసమున ముంచిన స్వధర్మమును మఱపుజెందును. కనుక యికమీద నీశరీర పోషణార్థమై భుజింతువుగాక! నీయిచ్చవచ్చుచో నా ఆశ్రమమునం దుండగలవు.

ఆనందసాగరుడు—కాళ్లపై బడును. అయ్యా మీబోధనాహృదంతరాళమున ప్రతిధ్వనించుచున్నది. నన్ను సంసార విముఖుని జేసివైచినది. పాపభూయిష్టమగు బానిసవృత్తినాకిక వలదు. నేటినుండి నాకుమీరు గురువర్యులు. మంచియందు చెడ్డయందు మంచిగలదని పెద్దలు వాక్రుచ్చుదురు. సత్యము. ఇదివరలో పరస్త్రీలను దుర్భావముగానెంచితిని. నాహృదయము నూత్నవికాసమును జెందినది. ఇప్పుడు ప్రపంచకమందున స్త్రీజాతియెల్ల నా అంతర్నేత్రమునకు మాతస్వరూపముననానవచ్చుచున్నది. నేటితో నామాత పాదములపై మనస్సు నిల్పి ప్రమాణపూర్వకముగాపలికెడిదేమనగా హింసనుజేయ

బోను. నేను బీదవాడ నైనను సామ్రాజ్యాధిపత్యము వహిం చిన చక్రవర్తివలె తలంచుచున్నాను. ఒకవేళ రాజునై సింహాసనాసీనుడనగుచో జనకునివలె బీదవారిలో బీదవానిగ నెంచుకొందునుగాక. నాకర్మ పరిపాక మందినది.

అశో—ఆనందము. నీహృదయము పవిత్రమైనది. నేటినుండి పవిత్రముగాను, నిరాడంబరముగాను, స్వార్థరా హిత్యముగాను, ప్రేమపూర్వకముగాను, జీవితమును గడుపు కొందువుగాక. నాటినుండియు ఆనందసాగరుడు, అశోకరాము నితో జీవితమును గడుపుచుండెను. గృహమున కేనియు వెళ్ళ నోపలేదు. ప్రతిదినము ఆగోవును చక్కగ మేపుకొని వచ్చు చుండును. అశోకరామునితోపాటుగా క్షీరమును, పండ్లను, రొట్టెనుమాత్రమే భుజించుచుండును. నాటినుండియు అతని నేత్రద్వయములందొక నూత్నవికాస మంకురించెను. అది ప్రేమాతిశయము, విశ్వప్రేమ. ఆత్మతేజస్సు. ప్రతిజీవనము నందు తిరుగాడునది యితని ప్రేమముఖారవిందమును గ్రోల వెంటాడుచుండును. ఇతని నేత్రములకు స్త్రీజనమంతయు మా తస్వరూపమును దాల్చియుండిరి. ఆహా ఏమిభాగ్యము? ఎన్ని యోజన్మములు కష్టించువానికి దొరకని సత్పురుషుని సాంగ త్యము, మంచినడత ఒక్కపరి దొరకెను.

ప్రథమభాగము—సమాప్తము.

# మో హ పి శా చ ము

## ద్వి తీ య భా గ ము

### తొ మ్మి ద వ ప్ర క ర ణ ము

సౌదామిని విషయమేరీతి అభివృద్ధిని పొందుచుండెనో చూతము. శక్త్యాశ్రమమును సౌదామిని నిర్మించియుండెను. అందలి జనులెల్లరు మనోహరమైన, జ్ఞానోదయంబైన ఓంకార నినాదమునిచ్చు రాట్నమును ఆశ్రమవాసులెల్లరు త్రిప్పుచుందురు. చేతిపనులను వృద్ధిజేయుచుండిరి. ఖద్దరు వ్యాపారము కొనసాగియుండెను. అందుచే చుట్టుప్రక్కల ప్రజలు ప్రత్తి ఉత్పత్తిని హెచ్చుజేయుచుండిరి. శంకరాచార్యులు మొదలైన వేదాంతులు, కాషాయవస్త్రధారణ సన్యాసికేటుల నిర్బంధించి యుండిరో, యిక్కాలమున ఖద్దరు వస్త్రమును ప్రతికర్మయోగి ధరించ నవీనమై, ఆనందదాయకమై యొప్పారుచుండెను. సౌదామిని కర్మయోగులలో గొప్పదై రాజయోగులలో మిన్నగ నొప్పారుచుండెను. ఆమెకు ఆశ్రమమందొక ప్రత్యేకస్థలముకలదు. ఆశ్రమము—ప్రపంచవాసులు—దుర్బలులు, కాను వీలులేనట్లుగా పర్వత శిఖరమునందు ఏర్పాటు జేయబడియుండెను. ఆశ్రమమందు

నిలబడి దృక్కునిగుడించుచో ప్రకృతిసౌందర్యము నిరుపమానముగా గన్పించుచుండును. శాంతిప్రదేశము. ఆత్మతో సంభాషించుటకు వీలగు స్థలము. ఆత్మ ప్రదర్శనముల గాంచుటకు చక్కని స్థలము. తనకు ప్రత్యేకముగా సౌదామిని భూగృహ మొకదానిని నిర్మించుకొనియుండెను. ఆగృహము జ్ఞానయోగుల చిత్రితములచే అలంకరింపబడి యుండెను. ఆమె జీవితలక్ష్యమును జేరుటకు యిందునే తగిన శక్తిని హృదయాగారమందు పూరించుకొనుచుండును. దినమునకు రెండుపర్యాయముల చొప్పున ప్రాణాయామము నభ్యసించుచుండును. ఆచిన్నవయస్సున సౌదామిని మనోబలమేమి? ఆమెకాయోగము కొద్దికాలముననే పట్టువడెను. కొన్నిసిద్ధులను సంపాదింపగలిగెడి సామర్థ్యతను పొందెను. ఆహా! స్వయం సాహాయమువల్లనే యీరమణి ఎంతటితపస్విని యాయెను. ఆమె ప్రాణశక్తిని కుంభించి, శంకరాచార్యులబోలె, శరీరమును విడనాడి యింకొక కళేబరమునందు ప్రవేశించు ధీరురాలాయెను. ఇట్టి వనాయాసముగ నెన్నియో జరుపుచుండును. అనాయాసముగ ఏస్థలమందు కాలమేరీతి ప్రవహించుసామర్థ్యమును పొందగలదాయెను. ఆహా ఆమె ముఖారవిందమేమి? నూత్నవికాసమేమి? పరులననాయాసముగా ఆకర్షింపుచుండెను. ఆత్మతేజస్సు ముఖమందు తాండవించుచుండెను. ఇక్కాలము వారివోలె పరిశుద్ధాత్మలేకయు,

బుద్ధిబలమున ఉపన్యసింప సాహసించు వాగాడంబరి కాదు. ఆముఖారవిందమె ఉపన్యసించుచుండును. ఆమె చరిత్రల ద్వార 'భీమతాల్' అను స్థలము బహురమణీయమైనదని చదివియుండెను. భీమతాలు అల్మోరాకు దక్షిణదిక్కున గలదు. అచటి ప్రకృతిసౌందర్య మింతింతని జెప్పనలవికాదు. అట్టి ప్రకృతిసౌందర్యము నిరుపమానముగా నుంటచే హిందూదేశ ప్రజలట్టి స్థలమును జూడగా నేగుచుందురు. ఈస్థలము మొదలుకొని యేకూర్మాంచల పర్వతములు వరుసలుదీరి ప్రయాణీకులకు పచ్చని తోరణములతో అందు పుష్పములమర్చబడియుండగా, స్వాగతమిచ్చుచుండును. వాటి ప్రక్కనే పవిత్రతోయము పారుదలజెందుచుండును. హిమము కొలదికొలదిగా నుండును. భీమతాలొక గ్రామము. రాంఘడ్ అను పట్టణమునకు ఏడుమైళ్ళదూరమున విరాజిల్లుచుండెను. ప్రకృతి గారాబుపుత్రిక—సౌదామిని యని యందఱెఱుంగుదురు. అందుచే ప్రకృతిచే జన్యమగు పర్వతరాజములందు నివశించుచుండెను. ఏస్థలములందు ప్రకృతీమ కన్య హెచ్చుగా నలంకరించబడి యున్నదని తెలియునో! ఆ ప్రదేశములకు సౌదామిని వెళ్ళితీరవలసినది. చరిత్ర మూలమున భీమతాల్ విశేషమును చదివినదై ఆ పవిత్ర స్థలమునుజూడ నిశ్చయించిన దాయెను. ఈ కోరిక ప్రాణయామమున మొదలుబెట్టు సమయమున మనోరాజ్యమునందు గాఢముగ నాటబడియుండెను. జ్ఞానదృష్టిచే —

రాంఫుడ్ సమీపమున ఒక శవముయునికిడిగాంచి యుండె
ను. తత్క్షణమే తన నిజశరీరమును విడచి రాంఫుడ్ సమీప
మునయున్న కళేబరమును ప్రవేశించెను. అది ప్రొద్దు
పొద్దు. దేదీప్యమానముగ చందురుడు అంబరవీధినివిహరించు
చున్నాడు. ఆసమయమున సౌదామిని ఒంటరిగా, నిర్భీతితో
ప్రకృతి రమణీయమగు స్థలములన్నియు నేత్రానందముగ
జూచుచుండెను. ఈఆనందమునందు ఆమె హృదయమున
శోకపిధమైన అలజడిగలిగెను. రోదన ఆప్రొద్దుప్రొద్దున
రోదన ఏమియాయని వినసాగెను. గ్రామమునుండియే ఆ
రోదన హృదయభేద్యముగ వినవచ్చుచుండెను. ఆరోదన
చల్లగవీచు మారుతమును మరింత, శీతలముగా మార్పుజెంద
జేయుచుండెను. కర్మవీరురాలు సౌదామిని. ఈనిశీధసమయ
మున ఎంతటి ధైర్యోత్సాహములతో అంబరవీధిని చంద్రమ
విహరించుచుండ భూమిని సౌదామిని విహరింపగలిగెనో-
అంతటి బాధాకరమగు ఘాతుకము ఆమె హృదయము జెంది
యుండెను. భరింపలేక పోయెను. కర్మవీరుని హృదయము
లన్నియు ఈశ్వరునిచే ఆతీరునె నిర్మింపబడియుండును. శిలల
వలె హృదయములు కాఠిన్యముగను, తామర రేకులవలె
మృదుత్వమును జెందియుండును. ఆరోదనము యీాపె హృద
యము చలింపజేసెను. ఈరోదన జేయునది స్త్రీయని స్పష్ట
ముగా తెలియనాయెను. పాపమెవ్వరో అనాధ. జ్ఞానిహృద

యమునకు ఓంకారము ఏరీతిని హృద్యమో! అదేరీతిని కర్మ వీరుని హృదయమునకు రోదన మలంకారము. కర్మను ప్రేరే పించుచుండును. ఈరోదనకు కారణ మరయ సౌదామిని త్వరిత పడుచుండును. అప్పటికి షుమారు రెండుఘంటలకాలము కావచ్చును. తెల్లవారుచో సౌదామిని పరువు నిలువ నేరదు. యిక్కట్టుల పాలుగావలసివచ్చును. ఎవరిశరీరమునో దాల్చి యున్నది. పరులకంట బడుచో కథానాయకుడగు ఆల్మోర రాజు యెదుటనే నిలువవలసివచ్చును. కథసాగనేరదు. ఇట్టి చిక్కులెన్నియో యొకవైపునగలవు. మరొకవైపున హృద య వేదన. ఆయబల దీనారవము హృదయమును భేదించు చున్నది. అట్టిదీనారవమునకు కారణమరయలేక సౌదామిని భీమతాల్ గ్రామములోనకు మెల్లన వెళ్ళియుండెను. దివ్యాలం కారియగు భవనము. ఆభవనగర్భమును భేదించుకొని దీనార వము పవనునిపట్టనమునింగి యున్నది. ఆభవనముచుట్టు ఉద్యానవన మొకటి గలదు. నిర్భీతిగా, జంకువిడచి సౌదామిని ఆ గృహములోనకు జొచ్చియుండెను. ఏమని చెప్పవలయు. ఆహా ఏమిదృశ్యము. ఒకవృద్ధుడు శయ్యనుబట్టియుండెను. శల్యావశిష్టుడై యుండెను. మృత్యుదేవత పిలుపును ఆలకించు చున్నాడు. కలువరించుచున్నాడు. ఆవృద్ధునకు దేహముపై మోహములేదు. గాని "చందూ చందు దేవి-దేవి-ఏరి-కను పడరా-విధాతకఠినుడా" యని నేత్రములవెంట అశ్రుధార

ప్రవహించుచుండ హాపోవుచుండెను. చింతాకరమగుదృశ్యమె ఆవృద్ధునిముఖము పాలిపోయియుండెను. ఏదియోలక్ష్యము నకై దిగులడియున్నట్లు దెలియుచుండెను. అతనిసౌభాగ్యవతి కాబోలు, అతనిపాదములబడి ఘోషిల్లుచున్నది. "దైవమా మాబిడ్డలనీ పొట్టవేసికొంటివి. కంటియెదుట కాంతునేనియుం చక దీసిక వెళ్లెదవా! ప్రపంచకమున ధర్మదేవతలేదా" యని విలపించుచుండెను. ధర్మదేవతను నేనె యనునట్లు వారియెదుట సౌదామిని నిలువబడియుండెను. మృత్యుశయ్యపై శయనించి యున్న వృద్ధుని బంధుమిత్రులతని చుట్టుమూగిరి. కొందరువిల పింపసాగిరి. కొందరోదార్చసాగిరి. ఆవృద్ధుని నేత్రములకు వీరి యాకారములు చలించుచుండెను. డగ్గుత్తికపడెను. క్రమేణ శాస్త్రరీత్యా వాక్కు బుద్ధిని జేరెను. బుద్ధి ప్రాణమును జేరెను. ప్రాణము జీవుని జేరెను. జీవుని యాత్రకు ఘంట ఘణఘణ మ్రోగుచుండెను. స్పృహ తప్పిపోయెను. కాని అతని నేత్ర ములు పైకి నిగిడియుండెను. కొందరది యమకింకరుల దృశ్య మని భావించుచుండిరి. "యమకింకరులు వచ్చిరా భయపెట్టు చుంటిరా తండ్రీ ఎంత భీతిల్లుచుంటివో"యని ఆవృద్ధుని భార్య మరింతగా విలపింపసాగెను. యమకింకరులు కాదు. అతని జీవితమంతయు ఎవరిని ప్రేమస్వరూపులుగా జూచి యుండెనో ఆచందు దేవులు. వారికై జీవుడు దుఃఖించు చుండెను. లోలోన ప్రవాహమం దీదుచుండెను.

సౌదామిని—అమ్మా! యీరోగి ఏవ్యాధిచే నింత వరకు బాధజెందె!

వృద్ధునిబంధువు—వ్యాధి యేమిగలదు. నంజుజూపి యుండెను. ఇవ్వేళ వ్యాధియా అబ్బో మూడుసంవత్సరముల వ్యాధి.

సౌదామిని—అమ్మా! నీవెంతమాత్రము దుఃఖించ వలదు. జననము మరణము. మరణము జననము. అజ్ఞాన దశచే మనము వాపోదుము. మరణమందు తరువాయి జీవి అధ్యాత్మికవృద్ధి నూత్నవికాశము (Advancement) జెందును. పరిపూర్ణ మందుటకు జీవికి మరణము మహోపకారి. పై అంతస్థుకు నెట్టుచుండును. నీవేడ్చియు లాభములేదు. అతనిని కలత పెట్టవలదు. నేను మీకు నూతనము. నాకు కొద్దిగా వైద్యము తెలసును. చికిత్స చేయనగునా? భగవదనుగ్రహ మున్నచో జీవించగలడు—

వృద్ధునిభార్య—ఉపశమించి ధర్మదేవత నీవేనా? చికిత్స యింకెక్కడి చికిత్స క్రొత్తవైద్యమట. సీమవైద్య మట. యములువేరె లేరు. యమకింకరులవలె వచ్చి శరీర మంతయు పొడిచిపోయిరి. అసలే మరణవేద ననుభవించు వానికి సూదిపోట్లు. యమకింకరులు గాకిం కెవరు.

సౌదా—నేను సూదిపోట్లు పొడుచువాడకాను. ఒక్క మూలిక నాకడగలదు. ఆమూలికను ఆఘ్రాణింపజేతును.

అది మోసమొనర్చునది కాదు. మీయిచ్ఛయున్నచో యిదిగో మూలిక. నేను నూత్నపురుషుడ అపరిచితుడ గనుక పరీక్ష జేసికొనవచ్చు.

వృద్ధుబంధువులు—అయ్యా! ఇందు దోషమేమున్నది. ఆసలన్ని అడుగంటినవి. ఏలాగు మృత్యువాసన్నమై యున్నది. ఆతల్లి భాగ్యమున్నచో బ్రతుకగలడేమొ. చికిత్సించి చూడుడు.

సౌదామిని సంతసించినది. ఆపె కడగలసంచి నుండొక మూలికను వెలుపలకుదీసి ఐదునిమిషములమాత్ర మారోగిచే ఆఘ్రాణింపజేసెను. పరివర్తనము కలిగెను. ఆశ్చర్యనిమగ్నులైరి. ఆవృద్ధుని శరీరము కదులసాగెను. ఏమేమియో ఉచ్చరించ మొదలిడెను. చందు దేవుల జూచితినని గొణగ మొదలిడెను. రాజ్యాధిరాజునైనట్లుగ స్వప్నమందితిననెను. అందరనేక విధముల భావింపదొడగిరి. నేత్రముల నూత్నపురుషునకై మరల్చిరి. సిద్ధపురుషుడని తలపసాగిరి. రోగియొక్క భార్య నూత్నపురుషున కెన్నియో నమస్కారముల పెట్టమొదలిడెను.

వైద్యుడు—అమ్మా! నాకు నమస్కారములిడవలదు అంతయు సర్వేశ్వరునిఆజ్ఞ. మానవులప్రతిభ ఎంతమాత్రము లేదు. అట్లు తలచువారు వెర్రివారు. ప్రగల్భులు. నీ పెనిమిటికి ప్రస్తుతకాలమున ఎట్టిముప్పు రానేరదని నమ్ముచున్నాను. ఇతనికీవ్యాధి యేలదాపరించెనో జెప్పగలరా.

రోగిభార్య—అయ్యా ఏమని జెప్పుము. భగవంతుడు మాయందు ఈర్ష్యాళువై ప్రవర్తిల్లుచున్నాడు. మాకొక ఆపదకాదు. తరచి తరచి మమ్ముల పరీక్షించుచున్నాడు. పరీక్షించుచుండినను మాహృదయాగ్నియందు కొద్దినీటిని శమింప చిలుకుచునే యున్నాడు. లేకున్న మృత్యువాసన్నంబై యుండియు నాపతిజీవింపనేర్చునా! దైవమువవు. మాపాలిటి దేముడవు. నాయనా! నిన్నెప్పుడో చూచినట్లున్నదే. ఏమొ నాకు తెలియదు బాబు. పూర్వవృత్తాంతమును విందువా! ఆపదలనుంచి కాచిన నీకు జెప్పకున్న యింకెరికి జెప్పగలను. వినుము నాయనా! మాబ్రతుకిపు డష్టకష్టములపాలైనది. ఇదివరలో మేము మనుష్యులలో తిరిగినవారమే! నేటికి భగవంతుడు మమ్మునలుగురిలో నగుబాటొనర్చినాడు. ఏమని జెప్పుదును. తలచుకొనుచో గుండియలు ఝల్లుమనుచున్నవి. చంపు. చందు. హా దైవమా బాబు నాకు యిద్దరుసంతానము. వారును లేక లేక గలిగినారు. మాయానన్దత్యమును జూడలేక భగవంతుడట అయిద్దరిసంతానమును మాకండ్లెదుటనుంచి లేవదీసిక వెళ్లినాడు. నాటిమొదలు నేటివఱకు మాబ్రతుకు అంధకారమైనది. అయ్యా దుష్టుడు, ఆల్మోరారాజుట. నవీనుడు మాకులగోత్రీకుడె. అయిననేమని పాపి. వాని నామమాత్రంబుననే వాక్కు పాపభూయిష్ఠమగును. వాడు మహారాజని నాభర్తవలదన్నను నాఅనుంగుకూతురును

ఏమని జెప్పుదును, యిచ్చి వివాహము జేసి పాపము ఒడిగట్టు కొంటిని. నాకు జెప్పుటకు నోరాడుటలేదు. నవీనుడు.

రోగి—నవీనుడు ఆ. ఆ. వాని పేరువలదు. ఏడి ఏడి అబ్బ.

రోగిభార్య—అయ్యో చూచితిరా. వింటిరిగదా. వాని యాకారము మాకు నేటికి రావణాకారమైనది. వాని నామమును ఎత్తుట నీచమైనది. ఎట్టికార్యమునకు సాహసించెను. నాయనుంగు కూతురును అల్లారుముద్దుగా పెంచుకొంటిని. సర్వము నాకూతురుగా భావించితిని. ఆహా! అట్టికూతురును ఆనవీనుడు వివాహమాడి వలదని విడనాడెను. అబ్బా ఏమనిజెప్పను. మేము అల్లారుముద్దుగా బెంచుకొంటచే బైటకుబోయిన కందునేమో యని తలంచి పాఠశాలలకు బంపినవారముగాము. గారాబము కష్టములపాలు జేసెను. అది యుగాక ఆడపిల్లలకు చదివేల యని దుష్టురాలను నేనుపాపిని నాభర్తను మందలించితిని. ఫలితమనుభవించుచుంటిని. నవీనముగ విద్యనేర్చుకొనిన కన్యలు చెడుగా ప్రవర్తిల్లుచుంటిరని నాకూతురకు చదువు జెప్పించమైతిమి. చదువుకొన్నచో స్వయంవరమని కులమును తెగనాడి సిగ్గునువిడనాడి ప్రేమను పోనాడి మోహపిశాచియైఎవ్వనివరించి కులభ్రష్టత్వము తెచ్చునోయనుకొంటిని. యారీతిజరుగున దెవ్వరెఱుంగుదురు. ఇట్టి మూఢత్వముచే యింతపాపము. ఆపిల్లకు జననీజనకులమై ఒడి

గట్టికొంటిమి. ఆహా హృదయమా ఊరట చెందుము. ఏమి చెప్పుదును. మొట్టమొదట ఆనవీనుడు మాతల్లి అవిద్యావతి యని యెఱుంగడా! వివాహమైనతరువాత అవిద్యావతియని జ్ఞాన శూన్యురాలని విడనాడెను. కంటనైనను జూడకుండెను ఇంతభాగ్యమున్నదిగదాయని అతనికిచ్చి వివాహము జేసి యుంటిమి. మాతల్లి పట్టుదలగలది. మాతల్లికప్పుడుపదునెండు సంవత్సరముల కూనయే. అయినను కొద్దిజ్ఞానముకలది. అత్తవారింటికంపితిమి. యీవిషమస్థితికి నాముద్దురాలు గురియాయెను పశ్చాత్తాపమును జెందెనేమొ. ఒకనాటి ముచ్చుప్రొద్దున లెగచి ఎటకో వెళ్ళియుండెను. ఆహా ఆపిన్నవయస్సున ఎటకు వెళ్ళియుండనోపును. మృత్యుముఖంబున బడియుండునేమొ ఏమి కఠినులము. విద్యజెప్పించని పాపమును జెందినవారము న్నాముగదా. మాగృహంబులకేమి రాగూడదా! పతిలేకున్న భగవంతుడె పతియని కాల ముబుచ్చరాదా! అటుల జేసినదికాదు. ఎటకో వెళ్ళియుండెను. ఆమఱుదినము పిడుగువంటి వార్తవృద్ధులగు మాకర్ణములందు పడెను. ఏమని జెప్పుదును. మాప్రాణములు మమ్మంటియుండలేవు. ఆహారమననేమియో యెఱుంగము. ఇరుగుపొరుగువారు ఓదార్చియుండిరి. ఓదార్చిననేమి! ఈవృద్ధాప్యమున దుఃఖమును భరించతరమా? అప్పటి నుండియే నాయనా నాపతికి రుగ్మతయేర్పడినది. సర్వాశలు ఆపిల్లనుండి మరల్చుకొంటిని. ఎన్నిఎన్ని దేశములకో వెతుక

బంపితిమి. ఇంకెక్కడి కూతురు. హాకుర్రా. కుఱ్ఱడొకడు గలడు నాయనా చెప్పమందువా. మాచరిత్రవిన సాహసింతువా? కుఱ్ఱడు, ఆకుర్రడే మాకుదిక్కని జీవములు ఎట్టెట్లో గడుపుచుంటిమి. సర్వమా బిడ్డయేయని తలంచితిమి. వంశమును వృద్ధిరించు మాతండ్రియనుకొంటిమి ఏమిజెప్పవలయు మాయందు యమకింకరుడై ఆనవీనుడు ప్రవర్తిల్లెను. మాతిన మీసములేని పౌరుషశాలి. దొంగ నీచుడు నాతండ్రిని నా సర్వస్వమును అపహరించెను అయ్యో మాట్లాడలేను. గుండె కొట్టుకొనుచున్నది. అదుగో, అదుగో, మాచందు. అబ్బా, పాపి నవీనుడు. వాడుమాకు జ్ఞాతియట, కూతురును నోట బెట్టుకొనెను. అంతతో సంతృప్తిజెందక, వంశోద్ధారకునికూడ వాని నోటబెట్టుకొనెను. ఏడిమాచందు. ఎన్నాళ్ళక్రితమె గోల్పోయితిమి. మాప్రాణముల వీడితిమి.జీవచ్ఛవంబులవోలె యింకను తిరుగాడుచున్నాము. ఈదుఃఖముతో ఆభగవానుడు ధాత్రిమమ్మేల నింకనుజీవింపజేసెనో తెలియదు. మాయిక్కట్టులింక అంతమందలేదు కాబోలు వృద్ధాప్యమున బిడ్డలు పోషింతురనియేగదా తల్లిదండ్రుల ఆస కొందరు సంతానము లేమిచే కృశించెదరు సంతానము కలిగి మృత్యుదేవతాపహారణమునకై వాపోయెదరు, ఈదరిద్రుల కటులగాదు. సంతానముకద్దు. జీవించియుండనోపు. ఆమగబిడ్డ డెన్నడు నవీనుని మోసకృత్యముచే అపహరింపబడెనో ఆనాటినుండియు

నాపతియొక్క రుగ్మత మఱింత హెచ్చెను. ఆహారపానీయముల సరిగ కుడువడు. నిద్రజెందడు. స్వప్నములందు కలవరించును. కృశించినాడు ఎంతమంది వైద్యులు చికిత్సించిరి. లాభము లేకపోయెను. లాభము లేకుంటయేగాక శరీరమంతయు సూది పోట్లచే పచ్చిపుండుగా జేసినైచిరి. మనోరుగ్మత మానుప మానవుడున్నాడా! నాటి నాటికి వ్యాధి హెచ్చి నంజుజూపినది. నేటిదినమున జీవము పోవుననియే బంధుమిత్రులు వచ్చిరి. తండ్రీ, నీవున్నమున, నాకండ్లయెదుట, నిలుపగల్గితివి. మా పాలిటి దేముడవు. మాధనము నపహరించి వలెననెగదా రాజయయ్యు యీక్రూరకృత్యముల జేసెను. రాజులే పేరా శులై దుష్టప్రవర్తకులైనచో ప్రజలలో ధర్మముండునా?

వైద్యుడు—అమ్మా మీచరితము చాలవిచారకరమై నది. అయినను ఆపదలందు ధైర్యమును బూనవలెగదా! మీఅదృష్టము చక్కగా ఉండునెడల మీపుత్రుడు, పుత్రిక కొద్దికాలముననే తిరిగి మీకడకు రాగలరు. దుఃఖించ ప్రయోజనములేదు. ఓపికబూనవలెను.

రోగి—చయ్యన శయ్యపై లెగచి కూర్చుండును. "నాయనా బాబు మాచందు, చందుదేవులు వస్తారా చెప్పు చెప్పు"

వైద్యుడు—లెగువబోకుము. ఆత్రము జెందవలదు. హృదయనడక తీవ్రతజెందుటచే స్పృహతప్పిపోగలవు. ఎంత

మాత్రము విచారము హృదయరోగి చెందగూడదు. నీబిడ్డల వశ్యము రాగలరు. ఉత్సాహులాసములతో కాలమును గడుపుచుండుము. ఇప్పటికి నాలుగు అర్ధఘంట అయి యుండనోపు. త్వరితముగ వెళ్ళవలయును.

రోగి—నాయనా నన్నువిడచి వెళ్ళెదవా? ఏదేశము ఎవరోమీరు మీవృత్తాంతము నడుగదగునా?

వైద్యుడు—మా వృత్తాంతమంతయు కొద్దికాలము నకు మీకె విశదము కాగలదు. మీపుత్ర పుత్రికల ప్రసన్న మగుతరి నేనును కన్పించగలను.

వృద్ధదంపతుల ఓదార్చి అచటజేరినవార లాశ్చర్యు లుగా అచ్చోటునువీడి సౌదామిని వెడలెను. ఎచట పరకాయ ప్రవేశమందె నచ్చోటకు వెడలియుండెను. ఒక్కపావుఘంట లో ఆపురాతన శరీరము నొకవల్మీకముకడ విడచి యథారీతిగ తన ఆశ్రమమును ప్రవేశించెను. అప్పటికి నాదాపు అయిదు ఘంటలు కావచ్చును. అప్పుడె పికములు శ్రావ్యముగ మానవ జాతిని నిద్రలనుండి మేల్కొల్ప జొచ్చెను. రేయెల్లయు సౌదామిని జాగారముజేసి యుంటచే నిద్రజెందెను. ఎనిమిది ఘంటకు లెగచి కాలకృత్యముల నెఱవేర్చుకొనెను. కాని మన స్సంతయు రాత్రివిషయమందె లీనమై యుండెను. కొలది కాలములో కనపడగలరను లశను వృద్ధులకు గలుగజేసి యుండెను. అది నెఱవేరుటెట్లులాయని పరిపరివిధము లతని

శక్తినంతయు పూరించి ఆలోచింపజొచ్చెను. ఎట్టకేలకు తన శక్తి యుపాసనముచే విషయమును చక్కగా గుర్తించెను. అద్దానిని సాధించగా సమర్థుడాయెను.

---

## పదియవ ప్రకరణము

కర్కోటరాజు మోహాంధకార మందు పూర్తిగా మునింగియుండెను. అతని నామధేయము హేమచంద్రుడు నవీనకాలమందలి విద్యావిషయంబున తెలివితేటలు గలవాడు అతని వేష భాషాచారము లన్నియు నవీనములే. ప్రతిమానవునకు జననమరణముల భీతియుండును. భీతియే మతాంకురము. మతము నీతిని కాపాడునుగాని ఆత్మస్వాతంత్ర్యము నివ్వనేరదు. నిర్భీతి వేదాంతాంకురము, మానవులు నిర్వీర్యులై జనన మరణములకు భీతిజెంది మతావలంబు లగుదురు. వారికి మానసికబలము శూన్యముగా నుండును. ఇంద్రియలాలసులు. సజ్జనులకడ సన్మార్గులగుదురు. దుర్జనుల సహవాసదోషముచే మనోబలహీనులగుటచే వారిచే ఆకర్షించబడి దుర్జనులగు చున్నారు. ఇట్టివా రెల్ల దుర్జనుల సహవాసమును విడు నాడుట శ్రేయస్కరము. ఇట్టివారు పాపభీతి కలుగునపు డెల్ల పూర్వచేష్టలకు పశ్చాత్తాపము జెంది భగవన్నామ సంకీర్తన జేతురు. వీరి గతి జాలికరము. ఇట్టి వారిలోని

వాడు హేమచంద్రుడు. హేమచంద్రుడు విద్యావంతుడు. కళాపోషకుడు. కామాంధకారుడు. మనోబలము లేమిచే దుర్జన సహవాసముచే చులకనగా ఆకర్షించ బడుచుండెడు వాడు. వ్యభిచార దోషవ్యాధి బలంబుచే వైరాగ్యము జెందు చుండును. రామభజనల జేయుచుండును. విగ్రహముల నూరేగించుచో చేసినదోషము పలాయన మగునని ఊరేగిం పుల జేయును. ఉత్సవములందుస ంతర్పణలు సంతర్పణలందు బ్రాహ్మణభోజనము. బీద పంచములకు భోజన మిడుచో అతని సంతర్పణ సంకరమగునను భీతి. భాగ్యవంతులకు విందు జేయుట పాతకములలో నెల్ల మహాపాతకము. భగవంతు డెల్ల కాలముల దీనజాతిపక్షమున నే బూనియుండును. మూ ఢాభిప్రాయములచే హేమచంద్రుని ఆలోచనలు నిర్మింపబడి యుండెను. చిన్ని యిండ్లనబడు కుటీరములలో పదిమంది సంతానమును బూని పొట్టకూడు లేక కట్టగుడ్డ లేక పిల్లలు ఆకలి జెంది రోదన జేయుచుండ కూటికి బియ్యమని సతి బాధిం చుచుండ ఏమి జేయను తోచక గ్రామమధ్యంబునకు ధాన్యము నెరువుగా గొంటకువచ్చిన పంచమునిజూచి వాడంటరాని వాడు వాని కివ్వగూడదని తలంచు మూఢులు మూర్ఖులచే భారత దేశము మలినమందెను. సగుణాచారములు లేనివాడు యాగముల జేసినను భక్తిపారవశ్యుడైనను మహాజ్ఞాని యైనను కించిత్తు లాభ ముండ నేరదు. యీసూత్రముల

మర్మమును హేమచంద్రుడు గ్రహించకుండెను. గుబులు మరలునపుడు సంవత్సరమున కొకపరి సంతర్పణలు ఉత్సవములు మహావైభవముగ జేయుచుండువాడు. అతని సహావాసికులెల్లరు మహాదీరులను కొని వారి ప్రాధ్బలముచే ఉత్సవములకు వేశ్యల పిలిపించుచుండువాడు. వారి మోహాంధకారమున ఆయూరి యువకులెల్ల మునుంగుచుండిరి. సంఘమును రాజపుండుగా జేసివైచుచుండిరి. జగజ్జననీ ఆకారస్వరూపులగు స్త్రీలను పవిత్రవంతు డనిపించుచు విగ్రహాము లెదుట నాట్యము చేయుచుండెను. భక్తికిబదులు మోహాము పుణ్యమునకి యెంచిచేయు కార్యము పాపభూయిష్టము. సంస్కర్తలేమిదియని ప్రశ్నించుచో ఓహో యిదియా శ్రీరామపట్టాభిషేకమున వేశ్యలుగాదా నాట్యము సల్పిరి. వారులేనిచో భగవంతునకు ప్రీతిలేదు. అతనికి ప్రీతిలేకుండ మనకు మోక్షములేదను తత్వమును జూపించుచుండువాడు. పురాణములు చాలవఱకు కవుల చమత్కారములని యెఱుంగడు. వేశ్య లొకవేళ శ్రీరామునెదుట నృత్యము జేసినను 'రారాప్రియా' యను మోహాంధకారపు కీర్తనల ఆలాపించిరా! వారు వేశ్యలుకారు. వారు భక్తివంతులు. శ్రీరాముని సుగుణముల పొగడి జనమును భక్తిప్రేమలందు ముంచివైచు ధీమంతులు. మనోబలములేనివాడు స్త్రీయెదుట నిలువంజనడు. ఇట్టిసూత్రము లన్నియు హేమచంద్రుడు బూడిదలో గలిపియుండెను. వేశ్యలనృత్యము చేయించి వేశ్యా

లోలుడాయెను. అందుకొఱకై రాంఘడ్ పట్టణమునుంచి అనేక సౌష్టినులగు వేశ్యల తన పట్టణమందు నివశింపజేసెను. అతని పరితాపము జాలికరము. అతనిభక్తి వినోదకరము. రాజ్యకార్యముల నేని చక్కబఱచుకొనక కాలమంతయు వేశ్యలకే యర్పించుచుండెను. వారికై గ్రామమధ్యంబున సౌధంబును నిర్మించెను. ఉద్యానవనమును నాటించెను. వేశ్యలలో ఒకానొక కన్యగలదని హేమచంద్రుడు తనచారులచేవినియుండెను. కన్యగలదని జెప్పుచు, వారిపై మోహమంతరించి ఆకన్యకై తపించునని తలంచి సత్యమును వేశ్యలు జెప్పరైరి. ఆవేశ్యలు విద్యావతులనదగును. సౌందర్యవతు లనదగును. ఈరీతిగా మూడుసంవత్సరములు గడిచియుండెను. నూత్నకన్య ఏరీతినో హేమచంద్రునికంటబడియుండెను. నాటనుండియు హేమచంద్రునకు ఆహారపానీయములు సక్రమమైనవృత్తి జరుపుచుండలేదు. పురాతన వేశ్యల ఆకన్యనుగుఱించి ప్రశ్నించుచుండెను వారు మర్మమును జెప్పరైరి. వారికెంతయోధనము నిత్తునని వాగ్దత్తముచేసి యుండెను. వేశ్యలకింతకు మించి వేఱొండు గలద. ఆకన్య సుశీల, సహజసౌందర్యవతి, విద్యావతి. ఎవ్వరు పాఠకులెఱింగియే యుందురు. చమేలీదేవి ఆహా అట్టి సుశీల. కామాంధుడగు హేమచంద్రుని కంటబడియుండెను. పతివ్రత. చమేలీదేవి. ప్రేమస్వరూపినగు కాని మోహిని కానేరదు. ఆపె హృదయము నిష్కల్మషమైనది. నిర్మలమైనది. అట్టి

రత్నమును మలినము జేయ వేశ్యలు సమకట్టిరి. హేమచం ద్రుడు, రాజాధిరాజనియు, సౌందర్యవంతుడనియు, విద్యాధికు డనియు, సరసుడనియు, అట్టివానిని మోహించవలసినదని ఎన్ని యోవిధముల బోధింపసాగిరి. ఇట్టిబోధ లెన్నియైనను, చమేలీ దేవి సంచలింప జేయజాలకుండెను. ఐశ్వర్యముల ప్రేమ కోరుట లేదు. సౌందర్యమును, విద్యను, కోరుట లేదు. వాటికి దాసురాలను గానని వారికి తిరిగి చమేలీదేవి బోధించు చుండెను. ప్రేమమహిమాతిశయంబుల చమేలీదేవి చక్కగా గ్రహించినతల్లి. ఆపె హృదయ మదివఱకె కొకని కమ్మి వేయ బడెను. చమేలీదేవి యొక్క మూర్ఖపట్టుదలను హేమచంద్రు నకు వినిపించిరి. హేమచంద్రుని విరహతాపముచే క్రుగ్గుచుం డెను. ఆమెవలదనుట యితనిహృదయమును మఱింత గాయ ము జేసివైచుచుండెను. అంతవఱకు హేమచంద్రునకు వివా హము జఱుగలేదు. మూడుమాసములలో వివాహము జరుగ నున్నది. ఇంతవఱకితని, నీచబుద్ధివదుల లేదు. హేమచంద్రుడు కులమర్యాదల దగ్ధముజేయ సాహసించెను. కులకట్టుబాటుల విడద్రొగ్గ వెర్రిబూనెను. కులమునువీడి, పరాయికులమున వివాహమాడుట, నవీనమనియు, ఆదిసాంఘిక సాహసమనియు అప్పటికాలపు నవీను లెంచుచుండిరి. సత్యమైన ప్రేమ యున్నచో, కులకట్టుబాటు లడ్డుపడజాలదు; కాని హేమచం ద్రునిది మోహము. కులమును వ్యతిరేకించువాడు సాంఘిక

ద్రోహియనియు వానికి నరకమే ప్రాప్యమనియు, భగవద్గీత యందు శ్రీకృష్ణభగవానుడు నుడివిన మహోపదేశమునైన తలంచడు. వేశ్యాకులమైనను. ఆమెయందుగల మోహాంధకారముచే, చమేలీదేవినె వివాహమాడెదనని జెప్పవలసినదిగా తన ప్రియురాలగు వేశ్యలకు ప్రతిదినము వాగ్దత్తముల అనాయాసముగా జేసినైచుచుండెను. ఆమెను పట్టపురాణిగా జేసినైతు ననుచుండెను. ఆహా! మోహమా! నీదు సాహసమేని జెప్పనగును. ఇన్ని త్యాగముల జేతునన్నను, చమేలీదేవిహృదయము ధర్మదేవత పాదారవిందములందే యుండెను. ఇట్టి నీచ కార్యము తగదని, బదులు జెప్పుచుండెను. ఎట్టకేలకు వేశ్యలు ఆమహాకార్యము మావల్లకాదని చెప్పసాగిరి. తమగృహము నుంచి వెళ్ళదరిమెదమని చమేలీదేవి నొకొకపరి బెదరింపసాగిరి. ఒకొకపరి యింతగాలము పెంచిన, ప్రేమనైనను జూపుమని బ్రతిమలాడుచుండిరి. ఇట్టి బెదరింపులకు చమేలీదే వెంతమాత్రము జంకలేదు. ధర్మమునకై తను తనువు నర్పింతుగాని నీచకార్యముల కొడిగట్ట ననుచుండెను. చంద్రమతి, దమయంతి, సావిత్రి మొదలైన పతివ్రతాతిలకముల తనహృదయాంతరమునందు ఆదేశస్త్రీలుగా నెంచుచుండెను. హేమచంద్రుని ఉత్సాహము సన్నగిల్లుచుండెను. వేశ్యలు తన కోర్కెను నెఱవేర్పజాలరని తలంచి, తన సేవకాధురీణుడగు ఆనందసాగరుని సహాయమపేక్షించి యుండెను. అతని

ప్రతిదివసము వేశ్యాగృహంబున కరుగుచునుచుండెను. ఆమెను బలాత్కారముగ తస్కరించవలసినదిగా ఆనంద సాగరునకు బోధించి యుండెను. ఆనందసాగరుడు క్షత్రియుడు. ఇట్టికార్యముల కియ్యకొనకున్నను రాజాజ్ఞకు బద్ధుడుకావలసియున్నను, కార్యోత్సాహి కాడాయె. చమేలీ దేవి ప్రకృతిప్రియురాలు. గగనమున చరించు పక్షుల చక్కగా ప్రకృతలంకారముల ప్రేమించుచుండును. చక్కని వర్ణము, మాధుర్యము, స్వరముగల పిట్టలతో చమేలీదేవి కాలముప్రొద్దుపుచ్చుచుండెను. ఈతంతును హేమచంద్రుడు కనిపెట్టియుండెను. చమేలీదేవి నేలాగునె తన్ను ప్రేమించునట్లు జేయగావలెనని పట్టుదలను బూనియుండెను. ఎన్నో యుపాయముల బూనుచుండెను. వనమునందు మంచిపిట్టల బట్టించి చమేలీదేవికి కానుకగా బంపతలంచి తన సేవక బృందములోనివాడగు ఆనందసాగరుని వనప్రాంతముల కసిపి యుండెను. ఎన్నియో దినములాయెను. ఆనందసాగరుడు రాడాయెను. మనోవ్యథ హెచ్చుచుండెను. మోహము ముప్పుదెచ్చునని హేమచంద్రు డజ్ఞానపరవశుడగుటచే ఎఱుంగడు. మోహము మిక్కుటమాయెను. మంచిపై కార్యములు కాజాలవని మోహాంధకారుడు హేమచంద్రుడు తలంచెను. బలాత్కారముచే తనకోర్కెను నెఱవేర్చవలయునని సాహసించియుండెను. ఆహా మోహమా! నీయొాగ

డము మఱింత హెచ్చుచున్నదే ? తనకోర్కెలను యీడేర్ప వలసినదిగా పూర్వపు చుట్టాలగు తన వేశ్యల వేడుకొనెను. వారిహృదయమందు ధర్మభీతియున్నది. కాని, ధనాశాపిశాచమై కొంతకాలమునకీ నీచకార్యము నొనగూర్ప ఒప్పుకొనియుండ, నాటినుండియు హేమచంద్రుడు ఉత్సాహ పూరితుడాయెను. ఈవిరహజ్వరపీడితుడగుచుండిన కాలము నుంచి హేమచంద్రుడు తన రాజ్యకార్యముల సర్వము పూర్తిగా మఱచియుండెను. తండ్రి హెచ్చరింపుల లెక్క గొనడాయెను. తనరాజ్యమున చమేలీదేవి మినహా ఎవ్వరును కన్పించుటలేదని తలంచుచుండెను. సర్వము చమేలీ దేవిగా తలంచుచుండెను. చమేలీదేవి తన అందమును జూడలేదని జూచుచో తన్నువరించక మానదని ఉవ్విళ్ళూరు చుండెను.

ఈనీచకార్యమున కొకదినమును నిర్ణయించెను. అది సుదినముగా భావించుచుండెను. నాటి సాయంసమయము నుంచియే హేమచంద్రుడు హృద్యముముగా పొంగుజెందు చుండెను. ఆతని ఉత్సాహము స్రోతస్సుగా ప్రవహించుచుండెను. ఇద్దానికంతకు యధికరణము వేశ్యలు. అంగజముల చక్కగా నిమురుటందొక ఘంటకాలము, తన కాలమునుంచి, విడదీసెను. తన కఘటితకార్యము లేదని లోలోన ఆహ్లాదము జెందుచుండెను. చమేలీదేవిని అంతర్యాగము చేయుచుండెను.

అంగభవునిచే తన హృదయమును నిర్మింపజేసెను. అందు చమేలీదేవి రూపలంకారములచే అధివసింపజేసెను. కాలమెంత త్వరలోన రేయిగా మాఱునాయని అక్కసపడుచుండెను. చక్కని, పట్టువసనముల ధరించి తనహొయలు తాజూచుక సంతసించుచుండెను. వసనముల నిండుగా అత్తరువులనద్దియుండెను హేమచంద్ర నామధేయము తనకె సరిపోవుగాని ప్రపంచకమున మఱొకడానామధేయము ధరించయర్హుడుగాడనిగర్వము జెందుచుండెను. అతనికదినేస్వర్లోకముగా గన్పించుచుండెను పనితనముగల పడుచులచే ఎన్నియో స్రజముల నల్లించియుండెను. తనకెట్టి యడ్డవాట్లు రాకుండుగాక యని తనయిష్ట దేవుడగు పవిత్ర శ్రీరాముని యపవిత్రకార్యము నెఱవేర్చ వేడుకొనుచుండెను. భగవానుడా స్వభతబూనకు ఇంతకుమించిన మేలు నాకు చేయగలది మఱొండులేదని ప్రార్థింపుచుండెను. శ్రీరామున కెన్నియో ఉత్సవముల జేయించితనియు వాటిఫలితము నేటి తనసారస్యమును దీర్చుటందు గాన్పింపవలెనని తహతహ జెందుచుండెను. మనోహర శీతవాతపోతములు మేనిసోక మఱింతకుతూహలమానసు డగుచుండెను. ఎట్టకేలకు సంధ్యారుణకాంతులు నశించి సూర్యుడస్తమించెను. వెంటనే హేమస్థాలమునందు పుష్టిగా భుజించి తనసోమమునకు సమయమెప్పుడరుదెంచునాయని జూచుచుండెను. ఒక్కనిమిషమును మాసములుగా అతనిమనోసీమయందు లెక్కించుచుండెను.

తానంతకంటెనపరి మఱొండులేడట! అతని ఎంబెటికె మాత్ర డెఱుంగడు. స్త్రీయమున కాలవాలమగు అంధకార మప్పు డప్పుడే క్రమ్మదొడంగెను హేమచంద్రుడు, భోజనప్రియు డగుటచే అమితమైన క్షేమము జెందియుండెను. స్మయమాని యగు చంద్రమ హేమచంద్రుని జూచి అంతరిక్షమున స్మితము వెలిబుచ్చుచుండెను. అప్పటి సరిగ తొమ్మిదిన్నర ఘంటకా గలను వేశ్యావార్తకు డొకండు హేమచంద్రునకు సోబనము దెలుప వచ్చియుండెను. అతనిరాకకు హేమచంద్రుడు సామ నస్యముజూపియుండెను. అతనినుండి సౌంగంధ్యము స్రవంతియై పాఱుచుండగా మారుతమునందు, హేమచంద్రుడు సోయగ మున తన భవనమునుండి బయలడెను. అతనిరాకకు, వేశ్యలు సాదరముజూపిలోనికింగొంపోయిరి. సమీరుడు వేశ్యాగృహంబు నంతయు, సౌగంధ్యముచేసమాశ్లేషించెను. అబలయగుచమేలీ దేవి కీగొడవ, కుట్ర యెంతమాత్రము తెలియదు. తొమ్మిది ఘంటలవఱకు సుమనోరజముల పరిమళము వెల్లివిరియు చుండగా, ఉద్యానవనమునందు గీతముల మనోహరముగా, స్వారస్యముగా, వీణ తంతులందు, వాటి యర్థగాంభీర్యముల సామ్యము జెంద జేసియుండెను. అందున సేద జెంది త్వరితముగా శయ్యాభిముఖురాలై నిద్రాదేవి పరవశురాలయ్యెను. అద్దియే మంచియదనని వేశ్యలు గ్రహించి హేమచంద్రుని బిలిపించి యుండిరి. వేశ్యలు తమసోమమునంతయు వెల్లడించిరి. హేమ చంద్రుడు తన హాళిని వెలిబుచ్చెను. తన ప్రేమకిది యొక

సముత్థానమని యెంచి, చమేలీదేవి నిద్రించు గదిని, ఎట్టి సంరావము గలుగకుండ ప్రవేశించెను; కాని అతనిహృదయ వేగమును మనోచంచలత జెందియుండెను పాదములుతడబడు చుండెను. తనస్వప్లోకము సన్నిభమైనదనిఉవ్విళ్లూరుచుండెను. గదిని సంక్రమించెనుగాని, చమేలీదేవి మేల్కాంచుచో, తన ప్రేమయేరీతి పరిణమించునో యని, సంక్షోభము జెందుచుం డెను. చమేలీదేవి శృంగారమును సంభాళించుచున్నాడు. శ్వానములు మేల్కాంచి చమేలిని లెగపునను భీతియుగలదు ఆశర్వరియందు తన శేముషిని ప్రయోగించ వలసినదిగా హృదయమున దిట్టదనమును, నైయాత్యము జెంది యుండెను. దీపకాంతిచే చమేలి ముఖారవిందమును గ్రోలుచుండెను. చమేలి, శృంగారమునకు హేమచంద్రునినాడీమండలమంతయు నూత్నానందముచే నింపబడియుండెను. ముందు కడుగిడి చమే లిదేవిబింబోష్ఠములముద్దిడ సాహసించెను. చమేలీదేవినిద్రాదేవి జెప్పుసత్యకథనముల ఆలకించుచుండెను. అందు హేమచంద్రుని క్రియాస్వరూపమును జెప్పియుంటచే తన రావడికదరి మేల్కాంచెను. ఎదుట నిర్విణ్ణుడై హేమచంద్రుడు కొయ్య బొమ్మవోలె కన్పించుచుండెను. ఆపె శరీరము, కంపింప, ధైర్యక్రోధములు ఆమె ఆస్యమందు శక్తిస్వరూపము దాల్చ గా నతని యిటుల ప్రశ్నించెను. ఈ(ము)చ్ఛప్రాద్ధున, యిచ టకు వచ్చిన నీచుడ వెవండవు. ఇదియును వేశ్యాగృహంబని

తలంచితివా? నీసోమమునంతయు నీడుపధినంతయు అబల యెదుట జూపవచ్చితివా?

హేమచంద్రుడు—(ఈలక అచుకొని) విదుషీమణీ నేను చోరుడగాను, నీచుడగాను, కళాపోషకుడను. శృంగారరస పోషకుడను. రాజాధిరాజును. హేమచంద్రుడను. నీవెంతమాత్రము నేనొంటరిగా యిటకువచ్చినందులకు భీతివలదు. ఇది యంతయు నీయందుగల ప్రేమప్రవాహమే నన్నిటకు గొని తెచ్చెను. నిజముగా యిదియెల్ల నీయదృష్టమగును.

చమేలీ—హృదయమున తనరావడికై వనలజెందుచుండెను. తనరహీరాజిల్లగా యీరావడినుంచి తప్పించుకొన యోచన జేయుచుండెను. ఏమియాలోచనతట్టక విభ్రమము జెందుచుండెను. ఇతని నీచసోయగము జూడ లోలోన అసహ్యించుకొనుచుండెను. శేముషిచే యితని అవమానపఱుచ వలయునను ఒడ్డు తట్టెను.

చమేలీ—ఆర్యా నమస్కారము. రాజ్యాధిరాజులనియు అందు హేమచంద్రులనియు యెఱుంగక తూలనాడినందులకు క్షమింతురుగాక. ఈవక్కాణము నాసహచరులగు వేశ్యామణులకును తెలిసియున్నచో బాగుండెడిది. నాకెంతమాత్ర మిట్టివిషయములందు స్వాతంత్ర్యము లేదని జెప్పుటకు చింతిలుచున్నాను. మీరాక వేశ్యామణు లెఱుంగుచో వారధిక సంతోషవంతు లగుదురుగాక.

హేమ—చమేలీ—నీవొక వబలవని నేనెఱుంగుదును. నీచత్వముగా ఎవ్వరిఅనుమతియు లేకుండ నీవొంటరిగానుండ యీనిశీథసమయమున నేనిటకు ప్రవేశించువాడగాను.

చమేలీ—మీరట్టి నీచపురుషులు కారని నేనెఱుంగుదును. అయినను కట్టడముల మరితరవిషయముల గుఱించి మాట్లాడవలదా?

హేమ—చమేలీ కట్టడములా నాహృదయాసీనమందలంకరించియున్నావు. సర్వస్వాతంత్ర్యములు నీవ. నీహృదయమందు నీవిలీనమై యుంటిని. నాహృదయమందునేవి లీనమైయుంటిని. మనయిద్దఱకెట్టి భేదమును లేదు. కట్టడములనియుచ్చరింతువేల! సర్వమును నీవగావ ఇదిగో స్వర్ణశోభితమైన మణిహారము వైళమెకంఠమున ధరింతువుగాక.

చమేలీ—ఆహా మీప్రేమ అపారము. ఇట్టి సత్పురుషులు, త్యాగధనులు యిదివఱలో నేగ్రహించలేదు. నాయందు మీకెట్టి యనుమానముదయించకుండుగాక. నాయీసంతసమును మణిహారమును ననుబెంచిన నాతల్లులకు జూపించి వారిచే ఆశీర్వచనముల పొంది మీకడకు వత్తును. అంతదనుక ఓర్పుబూని పమరీకంకటమందె శయనించి యుందురుగాక!

హేమ—హృదయ స్వరూపమా! నీయందనుమానమా! ఏటిమాట. నీయిచ్ఛవచ్చిన రీతిగా వెళ్ళి త్వరలో వత్తువుగాక!

చమేలీదేవి వెంటనే మణిహారమును చేతిబూని వెలుప లకు వచ్చెను. హేమచంద్రుడు మోహాంధకారమున సౌధ ముల నిర్మించుచుండెను. చమత్కార చమేలీ తనధర్మమును నెఱవేర్చసమకట్టి ద్వారముల తటాలున బంధించి వెలుపలి గొళ్ళెమును బిగించెను. యీవిరావముతో బాటుగా హేమ చంద్రుని స్వర్ణసౌధములన్నియు కూలిపోయెను. వాటినుండి ముక్క చెడి లెగచెను. ఏమిచేయగలడు. తన మౌఢ్యమునకు విచారమందెను. చమేలీదేవిని రక్షింపుమని వేడునంతటికిస్థితికి వచ్చెను. వరముల కోరుకొమ్మని జెప్పసాగెను. గదినంతను కలయద్రొక్కుచుండెను. చమేలీదేవి పెద్దగా దొంగ దొంగ లని కేకలిడ మొదలెట్టెను. నిర్మలముగా, శాంతముగా నుం టచే ఆకేకల సులభుగా చుట్టుప్రక్కలవారువినగల్గిరి. యువకు లెల్లరు బాణాకర్రల చేతబూని పరువున ఏతెంచిరి. దొంగ యీగదియందుగలడని చమేలీదేవి బములుజెప్పగా వారుమె ల్లన ద్వారముల తెరచిరి. లోన వెలుతురు లేదు. అంధకారము గనుండెను ఎవ్వరు కానవచ్చుటలేదు. రేయిదుస్తులని నవీన ముగా హేమచంద్రుడు నల్లనిదుస్తులధరించి యుండెను. ఒక రిద్దరు యువకులు ఉత్సాహపూర్వకముగా కంకటముపై రెంటిమూటి దెబ్బలవైచిరి. హేమచంద్రుని ఫాలభాగము రుధిరమయమాయెను. అరచుచో, కాప్పించుచో తనపఱువు బోవునని. ఆదెబ్బలఓర్పుతో హేమచంద్రుడు భరించియుం డెను. మనిషికి మనిషి కన్పించుటలేదు. కాని గదినంతను

మనుజులే గ్రమ్మియుండిరి. దొంగ యెవరో దొరయెవరో ఇందు నేర్పరితనముగా హేమచంద్రుడు కంకటమునుండి డిగ్గి వారిలో మిళితమాయెను. వారితోపాటుగ చరించ మొదలెట్టెను. మెల్లన వెలుపలకు వెళ్ళి ఆనిశీథమున మాయ మందెను. అదియెల్ల నెతకిరి లేడాయె. ఇదియెల్ల చమేలీదేవి స్వకల్పితమని భావించి, వేశ్యలస్వభావమని నిందించుచు గృహాభిముఖులైరి. ఇట్టి కార్యములెన్నడు చేయవలదని చమేలీదేవిని గద్దించిరి. ఒకని అవమానపఱుతమన్న తానె అవమానపడినది. చమేలీ విచారమందెను. కాని తనమానుషము దక్కినందుకు సంతసిల్లె.

ఉద్ధురగతిని హేమచంద్రుడెట్టులో గృహము జేరగలిగెను. సంకులంబుగా నతని వెంటాడుదురని తల్లడిల్లెను; విత్తవంతుడనను గర్వముచే విలాసవై ఖరులకై వెళ్ళి అవమానము జెందెను. తన దురదృష్టమునకై తా తెగడుకొనెను. ఇందుకేదియో ప్రతిబంధము చేయవలయునని యోచించుచుండెను. భగయత్నుడగుటచే మనసున వేసట జెందెను. రాజువలె తాననుభవించిన నీచమునకై బాష్పపుందరగల గార్చుచుండెను. ఇంతకెట్టి అడియాసల గోరగూడదని తెలుపడాయె! చమేలిని అనాదృతిచే లోలోన పీడించుచుండెను. నాడీమండల మంతయు తీవ్రకార్యంబున నుంటచే ఆ రేయి నిద్రయనునేమొ ఎఱుగడు. వేకువకు ద్వార

ములు మనోహరముగా కూయదొడగెను. ఆ రేయి యెల్ల నిద్రలేకుంటచే, ఎప్పుడు అయఃపిండమును చమేలిపై దొర్లింతునాయని వీక్షించుచుండెను. ప్రాతఃకాలకృత్యములదీర్చి, తన కుట్రలకు సహాయపడువారినెల్ల యిందు యాలోచించెను. రహస్య కథనావిలోచకుల కొందఱ చమేలీదేవి గృహమునకంపి, ఆపె కంఠమందు, తనస్వర్ణహారముగలదేమొ తిలకించి రాబంచియుండెను. ఏడుఘంట్లకు పురవీధులందు డప్పుబ్రోవుచుండెను. ఏమని ? 'రాజుగారి గృహమున స్వర్ణహారము నెవ్వరో దొంగిలించిరనియు, రహస్యాగారు లెవ్వరే నద్దానిని గుర్తించుచో, బహుమతుల బడయగలరనియు' చాటించు చుండెను. జనవాతు లనేకవిధముల కూయ దొడంగెను. చమేలీ యింటిన ప్రవేశించిన చోరులే రాజుగారి గృహంబున ప్రవేశించి యుండనోపునని సామాన్యజను లనుకొనసాగిరి. ఇది మహాగాయకమని యుక్తిపరు లెంచసాగిరి. యీ కల్పిత వృత్తాంతమున కెంత మాత్రము కాతర వృత్తి నొందలేదు. దౌష్ట్యమును జూపలేదు. గంభీరశాంతములతో నిండి, సత్యపరీక్ష కెదురు జూచుచుండెను. గూఢపరిచారకులు, యీమె గదియందలి, సువర్ణమాలను, జూచి హేమచంద్రునికి దెలిపియుండిరి. తత్క్షణమే, చమేలీయుతనంబును, పరీక్షించ, రక్షకభటులతో గృహామునుముట్టడించెను. చమేలీస్వభావమా

యూరివారెల్ల రెఱుంగుదురు; అందుకై యనుకంపమందిరి. హేమచంద్ర, వేశ్యల యనుబంధము చెడగాయుట్టిపన్నుగడను బన్నినాయని యెంచుచుండిరి. గది యన్నికెలంకుల వెతకు టందు, సానుక్రోశవృత్తి నెంతమాత్రమే జూపగైరి. పుర జనుల నచ్చటకు రానివ్వకుండిరి. ఈచిత్రమును పయోాద హస్తబింబము తిలకించుచుండెను. వీరికెచట స్వర్ణమాళ కాన రాదయ్యెను. సత్యాగ్రహ—చమేలీ వెంటనె ఎటనుండియో స్వర్ణమాలను గైకొనివచ్చి హేమచంద్రుని నైపు విసరివై చెను విమల తటిత్ లతాద్యుతియగు యామాలనుజూచి అచటివారెల్ల అక్కజమందిరి. ఈసత్యశీలకు కైరవంపు మఱింతతీవ్రముగ ప్రకాశింపజొచ్చెను. చమేలీయు రోజమును అవిరళచుంబిత ములచే బహుమతుల కైరవంపు యంపుచుండెను. ఇట్టి సిలు గును చమేలీ తానంతట తాదెచ్చివైచుకొనెను. అప్పటికిం కను భుజించియెఱుంగదు. తనహృదయమూర్తిని తానెసమా శ్వాసించుచుండెను. హేమచంద్రుపాదకంజముల వడకసాగెను మత్ప్రియాస్యమని యెంచిన చమేలీ యాస్యము ధర్మదేవతా స్యమువోలె భీతిగొల్పుచుండెను. పెదవును కదల్పగానేని ధైర్యమిసుమంతయే లేకుండెను. ప్రకరమెల్ల అతనివంకకె జూచుచుండిరి. చమేలీ యెదుట నిలువజాలకుండెను. తన హారము దొరకెనను కౌతుకము జూపునట్లు నటించుచు మెల్ల మెల్లన గృహాభిముఖుడాయెను. ఏమి! ఒక్క ప్రశ్నే చమేలిని

ప్రశ్నించకుండెను. దీనికంతకు జనులు మహాశ్చర్యమును జెందుచుండిరి. అతని యెదుట మాట్లాడసాహసించరు. వీధు లందెచటజూచినను జనము గుంపులుగుంపులుగా జేరి యావిచిత్రమును జెప్పుకొనసాగిరి. ఇతనికుటిలస్వభావమును పురజనులెల్ల రెఱుంగుదురు. ఇదియంతయు నితనికల్పితకథయగుననిన చాలమందిని నిందింపసాగిరి. ఇట్టి సంక్షోభమును చమేలీదేవి నయనానందముగా తిలకించినది. ఏమాత్రమీ విషయమై విచారమందదాయెను. ఆహా! అబల ఒక్కట్రి ధైర్యస్వభావమేమనిజెప్పనగును. వేశ్యలీమెచుట్టునుమూగి విషయమరయజొచ్చిరి. చమేలీ ఏమియుజెప్పదాయె. దొంగిలించియుండుననిజెప్పుచుండెను. ఎన్నడులేని ముప్పును దెచ్చిపెట్టెదవాయేమని వేశ్యలు గద్దింపసాగిరి. ఎంతమాత్రము జంకుటలేదు. చమేలి హృదయము నిష్కల్మషమైనది. యీపె కఠినస్వభావమును జూచి అక్కజమందుచుండిరి. వెంటనె తనగదియందు శయనించవెడలియుండెను. చమేలి తనపూర్వజీవితమును దలంచుచుండెను. "ఆహా మాతా! జగజ్జననీ ధర్మదేవతాస్వరూపిణీ సత్యాధారీ! నీయొక్కలీల ఏమనిజెప్పనగును. నన్ను కఠిన పరీక్షకుగురిజేసినందులకు నాహృదయమెంతసంతసిల్లుచున్నది ధర్మపరీక్ష. ఇందమితానందముగలదు. ఇంతకుమించి యీ మానవలోకమున నాకుమఱొండెద్దికావలెనా? నీచముగా నూరేండ్లు జీవించుట. ఒక్కనిమిషము ధర్మదేవతను వీక్షించి

మరణించుట సరిపోలను. రమ్ము. రమ్ముతల్లి. ఇదియెల్ల నీ కరుణామృతమె. నాసత్యదీక్షను వెల్లడింతువుగాక! తల్లి దండ్రుల గోల్పోయితిని. పతిభావనకు దూరస్థురాలనైతిని. వనకుజాదుల వీడితిని. వేశ్యగృహంబునందు నివసించుచుం టిని. చోరత్వ మాపాదించబడెను. ఇంతవరకు నాయంత రాత్మ ధర్మదీక్షను బూనియున్నది. బూనను న్నది. ఇది ముమ్మాటికి సత్యము. నన్ను బంధింపనిండు, కుత్తుకను కత్తి రించనిండు, ధర్మమందు నాకానందవముగలదు. ధర్మరాజ్య మందు విహరించెదను. నాఅంతఃశక్తి అపారము. ఆశక్తియె ధర్మమనియు, సత్యమనియు, బ్రహ్మమనియు, ప్రేమ అనియు అనేకనామముల వ్యవహరించ బడుచున్నది. ఆతల్లి యిచ్ఛచే ధర్మము విజృంభించుచున్నది. కరుణామయి. ఆమహాతల్లి సర్వవస్తువులందు, మహత్తేజముతో వెలుగందుచున్నది. ఆతల్లి, . కదలికయే, కదలికరూపమే, చరిత్రలగుచున్నారు. ఆతల్లి సంచలనమే ప్రపంచనడుక. ఆమహాతల్లి కరుణచేతనే నాకీ తరుణ మబ్బినది. 'ఓహో! తల్లిదండ్రులందలి, పతి యందును, గల ప్రేమరాజ్యమా— నేటితో— నీకును— నాకుసరి. అంతరించి పొమ్ము. నిన్ను పోషించువారిని వెతకి గొనుము. హృదయమా, వేసట జెందకుము. ధర్మమును కౌగిలించుము. ప్రేమధారం గ్రోలవలసిన యీావయస్సున ధర్మమును కౌగిలించు భాగ్య మబ్బినది. ధర్మమందలి

యూష్ణము భగ్నింపగలశక్తినిమ్ము తల్లీ. తల్లీ! ఆవహించుము, నాయందు విహరించుము. మానవులకు నాయీకృత్యము ద్వారా, నీతిని ఉపదేశింపుము. ఏమి! హేమచంద్రుడు నాకై సర్వరాజ్యమర్పింతునని యీమోహావేశమున నుడివిన పలుకులు. ఆహా! ఏమి మోహప్రభావము. వలదు, వలదు, తల్లీ ధర్మరక్షణార్థమై సత్యాగ్రహినై, కూలిస్వభావము ధరింతుగాక! శక్తిహీనురాలగుచో, భిక్షమెత్తుదుగాక. అందునా కనంతమైన ఆనందము ఘటిల్లగలదు. ఆత్మ అభివృద్ధి జెందగలదు. మానవులు సంపదలకై వాపోయెదరు. వారు హస్తములతో వారు పాదములకు సంకెళ్ళ వేసికొందురు. ధర్మమా! నీకొఱకుగా హరిశ్చంద్రుడు సర్వాధిపత్యమును తృణప్రాయముగ వీడెను. వల్లకాటికాపరియాయె. ఆహా! అమహాపురుషుని భాగ్యమేమి. అది వల్లకాడు కానేరదు. ధర్మరాజ్యము, తల్లీ ప్రతినిమిషము నన్ను ధర్మమును మఱువనీయకుము, ధర్మముతోగూడిన కూటిని కుడువనిమ్ము. అదియే నాసత్సంపద. మోక్షద్వారము. నేను ప్రకృతిచే పరీక్షింపబడి పత్రికల కెక్కుదలుపను. నాకెంత మాత్రము కీర్తియను మహాసముద్రము నీదవాంఛ లేదు. నాకు ప్రపంచకము లేదు. నాహృదరాజ్యమె నాప్రపంచకము. ధర్మదేవత నారాధించుచుందును. తృప్తి జెందుచుందును. అందె మహానందము. ధర్మమునకై యీశరీరమును తృణప్రాయముగా వీడెదగాక. ప్రతిక్షణము, సత్యవ్రతుల ధర్మదీక్షుల, ప్రేమ

స్వరూపముల పఙ్క్తుల హృదయాంతరాళమున యుచ్చరించు చుండునుగాక. వారి యాకారముల నయనానందముగా వీక్షించుచుండునుగాక. వెర్రినడకతో సాగుచున్న ప్రపంచకమును విమర్శించ కుండునుగాక. ఆహా తల్లీ సూర్య చంద్ర నక్షత్రాదులందు ప్రకాశించు శక్తివి. నదియందు ప్రవహించు శక్తివి. అగ్ని యందలి తేజస్సు నీవు. మాట్లాడుశక్తివీవు. సర్వమునీవు. అమ్మాయని నాయంతరాత్మ హృదయారవిందముగాబిలచుచుండును. నేను నిరాడంబరజీవితము నేకౌగలింతుగాక. ప్రేమించుగాక. తల్లీనీయెదుటబిడ్డవలె నిష్కాపట్యముగ, నిరాడంబరముగా, సత్యముగాచరింతుగాక రాజాధిరాజుల యాడంబరము, అధికారులగర్వము, నాకు చాల అసహ్యకరముగా దోచుచున్నది. నాజీవితము సత్యముగా నీయది.'' అని చమేలీదేవి గంభీరమున హృదయాంతరాళమున భావించుచు పరుండెను. భావాప్రపంచకమున నిమగ్నమైన చమేలీదేవికి ద్వారకవాటముల నెవరోతట్టినట్లు వినవాయెను. ధర్మదేవతా తన్నుకరుణించి వచ్చెనని యువ్విళ్ళూరుచు త్వరితగమనమున తలుపులదెరచును. ఆఆహా సత్యముగా ధర్మదేవతయే చమేలినివెంటాడుచున్నది. ఆతలుపును తట్టినవారెవరు. ఎవరాగుండియలు వ్రయ్యలగు వేషముల ధరించిన కింకరులు. తోమ్మంద్రా గురుహస్తముల మెఱయుచున్నఖడ్గములధరించిరి. వారివేషములు సైన్యభటులనిచాటు

చుండెను. వెంటనే సైన్యసమూహమందలి పెద్ద ఒకలేఖను చమేలిహస్తమున నుంచెను. చమేలిముఖారవిందము నూత్న శక్తిచే పూతపూయబడియుండెను. హారియందిసుమంతయు, భయకోపముల జూపదాయెను. తన అంతరాత్మ స్వరూపులే సర్వమానవులని తలంచు స్వభావముగలది చమేలి. వెంటనె ఆలేఖనుయీాదిగువరీతిని చదువుకొనదొడంగెను. "చేసినకృత్యము చోరకృత్యమని మాప్రభుత్వముతలంచుచున్నది. వస్తువు స్వర్ణహారము, నీయనుమతినే గ్రహించబడినది. ఇదిబహువిచిత్రమైనచర్యగా కన్పించుచున్నది. నీవు నీచమైన వేశ్యాగృహంబున మెలంగుటచే వేశ్యవనియే తలంచుచున్నాను. జాతి మర్యాదగా నిను పురవీధులందుడూరేగింపుచు న్యాయస్థానమునకు వెంటనె దీసికొనిరా ప్రభువులమగు మేము తలంచుచున్నాము."

"హేమచంద్రుడు"

హేమచంద్రునినిరంకుశత్వమునకు, వ్రాతకు చమేలిదేవి ఒక్కపరి పరిహాససూచకముగాను ఆస్యమందగుపఱచెను. ఇట్టిప్రభువాజ్ఞవచ్చినను చమేలిచలింపదాయెను. సర్వమునకు సంసిద్ధురాలనని చమేలివచ్చిన సేవకభటులతోనుడివెను. ఇట్టి నీచచర్యకేని హేమచంద్రునిహృదయాగ్ని చల్లారలేదు. ఈధర్మదేవతను వీధులవెంట ద్రిప్పుటయందు, అవమానసూచకముగా డప్పుల నుపయోగపఱచ ఆజ్ఞయిచ్చియుండెను. వేశ్యలగృహముల వెలుపల, యీాసైన్యమునుజూచి వేనకువేలు

జనముగుంపులుగూడి మహాశ్చర్యులై నిలబడియుండిరి. వేశ్యలు కలవరపడుచుండిరి. ప్రజలీ నిర్బంధనను గర్హించుచుండిరి. చమేలి ధైర్యసాహసోపేతమగు ముఖారవిందమునకు అక్కజపడుచుండిరి. చనిపోవువానికి, నిన్నపాతముకన్పించు సామెతగ హేమచంద్రుని క్రూరత్వ మతనికూల్ప సమీపించెనని జనులు జెప్పుకొనుచుండిరి. "దుష్టప్రభుత్వమును స్త్రీలు సైత మెంచుచుండిరి. చమేలీ తనశక్తిని వెల్లడింప ధీరత్వముతో వెలుపలకు సైన్యమధ్యంబున నిలచి నడువసాగెను. ఆహా! చమేలీదేవి ప్రియపుత్రికవు కాకున్నచో అట్టి ధర్మపరీక్ష నీకుగాని యింకేరికబ్బును. నీనామము చరిత్రలందు సువర్ణాక్షరములతో చిత్రించబడుగాక! ఆబాలగోపాలము నిన్ను ధర్మమందు ఆదేశముగా గొందురుగాక! నీయందు ఆ మహాతల్లి శక్తి అవిరళముగా ప్రవహించుచున్నది. లేకున్నచో నీ హృదయము శిలాహృదయమగు నేను ముఖముం దొక్కజీరయే విచారసూచకమును చాటకుండునా? నీదు గంభీర వాక్కులు వినగాబోలు జనసమూహ మంతయు నిన్ను వెంటాడి న్యాయస్థానమునకు వచ్చుచున్నారు. స్త్రీజనంబెల్ల సౌధంబుల నెక్కి యీ చిత్రచర్యను వీక్షించుచుండిరి. ఆహా! హేముని కావరమేమని దూషింపసాగిరి. ఆపురమందలి జనమున కారోజున యెట్టికార్యమే లేదు. న్యాయస్థానము నిండునని ముందుగా ప్రజాసమూహములు ఆదిక్కుగా పరువిడుచుండిరి. చండకరుడు తీవ్రముగా తవ నిరసనమును దెల్పుచుండెను.

---

# పదిహేకటవ ప్రకరణము

ఎంతటి నీచకులజులైనను చాలకాలమునుండి అధిక ప్రేమచే చమేలీదేవిని పెంచుటచే హేమచంద్రుని హేయ కృత్యమునకు పెద్దగా వాపోవుచుండిరి. వారి పూర్వప్రయత్నము లీరీతి పరిణమించుననని దలుపలేదని యెంచుకొనిరి. హేమచంద్రు డింతటి కఠినుడని తలుపకుండిరి. ఈ ఆర్త నాదము ఒక భిక్షుకుని వీనులందు జేరెను. హృదయతాడనము సలుపదొడంగెను. ఆర్తనాదము విపనగువైపునకై జనదొడగెను. ఆహా స్త్రీలు వస్త్రములుల ముఖముల నిడుకొని దురపిల్లుచుండిరి. సామాన్య భిక్షుకుడుగాడు. భిక్షకస్వరూపుడగు భిక్కు. భిక్కు స్వరూపుడగు సేవాదురంధరుడు. అశోకరాం జనులహృదయపరివర్తనము వీక్షించవచ్చిన అధ్యాత్మికయోధుడు.

అశోకరాం—అమ్మా బాష్పతరంగములు. సంకులంబులై ప్రవహింపగా వాపోయెదరేల?

వేశ్య—అయ్యా సత్పురుషులు మీరుగాద. ఆరుదినములక్రిత మీ ఉద్యానవనంబున మాచమేలితో మాట్లాడుచుంటిరి.

అశోకరాం—అయిననేమి. ఆతల్లి యేదియో ప్రశ్నించియుండె.

వేశ్య—ప్రశ్నించియుండెనా! ఏమని చెప్పుదును బాబు. ఆచికొండమన్నను దుఃఖ మాగకున్నది. ఆపత్సమయముల సర్వమును జయించిన మహాపురుషులు. తమ జ్ఞాన తేజస్సుచే మాదుఃఖమును బారద్రోలుదురుగాక. మిమ్ము జూచిననుంచి ఊరటజెందినటులున్నది బాబు. యీ వృక్షరాజముక్రిందను కొద్దికాలము ఉపవేష్టించుడు.

అశోకరాం—అమ్మా ఉపవేష్టించుట యెట్లు. ఏదియే నావల్ల సత్ఫలము గలుగుచో ఉండగలను. ఇంతకు తల్లీ నేడు చమేలి కన్పించుటలేదేమి? ఆతల్లి భగవదారాధన జేయుచుండెనా?

వేశ్య—ఆహా! మహాత్మా ఏమందురు. చమేలీ నేడేదనియా! రక్కసిగ్రహించెను. ధర్మదేవత నిర్దయతతో గొంపోయెను.

అశోకరాం—ధర్మదేవత గొనిపోవుటేమి? వాపోవక చమేలి విషయమెల్ల వినిపింప అర్థించుచున్నాను. కష్టసౌఖ్యంబులు రేయింబవళ్ళవలె మానవుల వెంటాడుచుండును. ఆపత్సమయముల ధీరత్వమును బూనుటె మానవలక్షణము. చమేలి సుస్వభావి. ధర్మమామెనంటియే యున్నది. ఎంత మాత్రము భయపడ నక్కరలేదు.

వేశ్య—మహాత్మా! అట్టిధీరత్వము మీవంటివారలు గల్గియుందురు గాని మావంటి యబలులకా గుణమబ్బునా!

అయినను అట్టిధీరత్వ సహజస్వభావమును గల్గిన మీజ్ఞాన తేజంబె శాంతగంభీర్యవాక్కులె మాదుఃఖము వెడలించ గలదు. చమేలీ విషయము మహాత్ములు మీరడుగునపుడు జెప్పకుంట పాడిగాదు. ఇంతదనుక చమేలీవిషయ మీపుర జనుల కెవ్వారలకును గ్రాహ్యముకాదు. ఎందఱో తెలియ ప్రయత్నించినను తెలుపదాయెను. ఆపవిత్రాతిలకము మా వంటి నీచకులజుల గృహంబున నుంటచే నందఱాపెను వేశ్య యనియే భావించుచుండిరి. కాని యింతవఱకు చమేలి మా చేతివంటను ముట్టకున్నయది. మాగదులయం దడుగిడకున్నది. పవిత్రజీవితా పరిపాలి. పరిశుద్ధహృదయురాలు సదా భగవ త్తేజమున ఓలలాడుచుండు ననదగును. లేకున్నచో ధర్మ రక్షణార్థమై ఆ పిన్నవయస్సున నిర్భీతితో రాజదండనకై పరువిడు యువతిగలదా? ఏమని జెప్పగలము. మాకూటి కుడువక స్వహస్తపాకమునె భుజించుచుండును. అందున స్వల్పము గోక్షీరము, ఫలములు, గోధుమరొట్టెనుమాత్రమే సాత్వికాహారమని యెంచి భుజించు చుండును. ఏమదియని మాబోటి అజ్ఞానులు ప్రశ్నింప అదియెల్ల భగవదాజ్ఞ యని జవాబిచ్చు చుండును. భర్తవిహీనులు, కన్యలు, భర్తృగృహమున లేని కాలమందు స్త్రీజాతి సాత్వికాహార మునె మోహమును విజృంభింపనీయకుండ భుజింపవలెనని మా కుపదేశించు చుండును. ఆహా! ఆమె కఠినవ్రత మేమని జెప్పవలయును. మీవంటి పతితుల మినహా

పరపురుషుల కన్నెత్తినేని లుకరించనోపదు. మావలె శరీరాంకారములకై హేమవస్తువుల ధరింప నోపదు. ఆహా ఆమె నిరాడంబర-పవిత్ర-జీవిత రాజమేమి? వస్తువుల జూడ నసహ్యించును. బాహ్యాడంబరమని పరిహాసమాడును. అది కృత్రిమసౌందర్యమనును. హృదయపవిత్రతచే సహజ సౌందర్యము యినుమడించుననును. విలువగలవసనముల హేయముగా వీక్షించును. శాంతమునకు, హృదయతృప్తికి, ప్రాపంచక సేవకవి యాటంకములని బోధించును. ఆరోగ్యమున కడ్డుకలుగజేయునట. మానవ సమానత్వమును మరలించునట. వెర్రిశవాకారమును జూపునట. అందుచే కాబోలు ప్రతిదివసము యిసుగనియెంచక ఓంకారనినాదంబుల గ్రుమ్మరించునని జెప్పుచు రాట్నమునందు కాలము నెక్కుడుగా బుచ్చుచుండును. స్వహస్తములచేవడుకబడిన నేతవస్త్రము మాత్రమే ధరించుచుండును. స్త్రీ దేశమునకు జేయుసేవ అద్దియేనని జెప్పుచుండెడి. ఎల్లకాలము ధర్మశాస్త్రముల వీక్షించు చుండును. చమేలీదేవి ప్రస్తుతస్వభావమిద్ది. జన్మతః మేము వేశ్యాకులజులము. ఇప్పుడిప్పుడు సంస్కర్తల ఆందోళనచేతనేమి, మాకనుభవమైన యావిధులచేనేమి, చమేలి పవిత్రోజ్జీవితాకర్షణచేనేమి పెద్దలు పిలుచు నృత్యములకు వెళ్ళుటరుదై పోయినది.

అశోకరాం—ఇంతకాలమునుండియు చమేలిని సంరక్షించునదెవరు?

వేశ్య—మహాత్మా మొదటి పది దివసంబులేమొ, యింతవఱకు ఆతల్లి జీవితభారమూ తల్లియే మోయు చున్నది. పరుల కష్టమును కుడువనను ప్రతిజ్ఞావంతురాలు, సోమరితనమున యుండుట నీచత్వమని జెప్పుచుండుట అందుచే జీవితబాధ్యత తావహించుటకై రాట్నముపై వడుకు నూలుపై తన వస్త్రములకుపోగా యింకెంతయోడబ్బు మిగిలియుండును. జేతికుట్టును శృంగారముగా కుట్టుచుండును, ఇట్టి చేతిపనుల జేయుచూ నిరాడంబరముగా పవిత్రవంత ముగా, శాంతముగా జీవితమును గడుపుచుండును. గీతము లను యల్లుచుండెను.

అశోకరాం—సరి. యీమహాతల్లి ఋషికులసంజా తను గనిన పుణ్యాత్ములెవరో జెప్పగలవా!

వేశ్య—అదియెల్ల జెప్పమందువా? పూర్వకాలమున వేశ్యాకులవృత్తిచే ఆలోరమహారాజు మమ్మాహ్వానించుటచే మేళమునకై యేగియుంటిమి. కారణము తెలియకె వివాహ మాగెను. తిరిగి గృహాభిముఖులమై వనమధ్యంబున వచ్చు చుంటిమి. ఆహా! ఏమనిజెప్పవలయు, - భగ్గు, భగ్గున అగ్గి దేవుడు మండుచుండెను. కుమ్రకురంగ కుమారులు మనో హరముగ అగ్గిచుట్టును దుముకుచుండెను. అది సంధ్యవేళ, వాటిమధ్య చమేలి, చమేలీదేవి నిలబడియుండెను. అబ్బ, అప్పటి కరుణాభరితమగు దృశ్యమేమి! హస్తముల అభ్రము

నకై ఎత్తి వీక్షణములందె నిగుడించి, దైనముగా, ప్రార్థించు చుండెను. ఈదృశ్యమును జూచినతటి 'మాగుండియలు తల్ల డిల్లెను. వేగమె ఆస్థలంబును సమీపింపగల్గితిమి. మమ్ముల గాంచి, చమేలి—అగ్నిగుండమందు దుముక నుంకించుచుండెను. వారించితిమి. విషయమా మూలాగ్రముగ విచారించగడంగి తిమి; కాని చమేలి పూర్వవిషయము నేమాత్రమును సాక ల్యముగజెప్ప నొప్పుటలేదు. విషయము నాలోచింపగా చమే లికిదివఱలోనె వివాహమైనదనియు విద్యావిహీనురాలగుటచే భర్తవిడనాడి ద్వితీయవివాహమును జేసికొనుచుండెననియు, అట్టి కంటకవిషయమును భరింపలేక సహగమనము జేసికొన ఆవన మధ్యంబున. లేకన్య ఒక్కర్తె, ధైర్యోత్సాహములతో అగ్నిదేవుని హృదయారవిందంబుగా ఆహ్వానించుచుండెను. ఎన్నియోవిధముల వలదని ప్రార్థించితిమి. చమేలి ముఖవర్చ స్సను గాంచుతటి, సర్వప్రయత్నములచే ఆమె మూర్ధోద్దేశ మును ఎడలించ సమకట్టితిమి. చమేలి జిగిదేటెడుమేనిసౌరు యేమనిజెప్పనగును. అట్టి సౌందర్యాతిశయంబుల నొప్పుచున్న చమేలి మాకు లాభకరమని ప్రప్రథమమున ఎంచియుంటిమి. ఆతల్లి పవిత్రజీవితము మామూర్ఖమును పారద్రోలెను. ఎట్ట కేలకు, చమేలి కెన్నియోబోధించి, పరువుమర్యాదల కాపా డెదమని ఒప్పజెప్పి, యిటకు దీసికరాగల్గితిమి. నాటనుండియు మాకడ హిందీసాహిత్యము, సంగీతమును చక్కగా అభ్యసిం

చినదాయెను. సంగీత-సాహిత్యములం దప్రతిభ మైనది. బాలి కల కిప్పుడామె, స్వశక్తితో హిందీభాషను బోధించుచు వేతన మును గైకొనుచుండును. ఆమె ముఖవర్చస్సు పవిత్రోద్దేశ మునుగంభీరముగ చాటుటచే పరపురుషు డెవ్వడామెను పలు కరించనేని కోహసింపడాయెను. అట్టి చమేలియందు స్నేహ మును, హేమచంద్రుడుగట్టి, కడగండ్ల పాలు గావించినాడు. సర్వహారమును, చమేలిగ్రహించెనట. ఏటిమాట. ఇంతకు, యీ పాపపరిహారము మేమెయనుభవించవలసిన బాధ్యులము. ఈదుర్ఘటనమునకు కారణము-పరమేశ్వరాసత్యముగా మేము ఆమహాపాతకము మమ్ము పరిహరించుగాక మహాత్మా! చమేలి సత్యవతి, ధర్మవతి.

అశోకరాం—తల్లీ! ఆధ్వనియేమి ఆప్రజారవంబేమి.

వేశ్య—నేమని జెప్పుదును. యీనోటిద్వారా పై విష యమును జెప్పజాలను. శ్రమయనుకొనక మీరటులేగిన విష యమంతయు విదితముకాగలదు.

అశోకరాం వెంటనే వీధిని, త్వరితగమనమున నడవ సాగెను.

---

# పంద్రెండవ ప్రకరణము



నలుకెలంకుల కపోతకోటపురంబున విచారసూచనలె గన్పించుచుండెను. దేవి విషయ మేమినిర్ధారణయగునో, ఎన ప్రతివాడు నిరీక్షించుచుండెను. పురము నడివీథియందు "మహాకన్య-అబల-విదేశి-ఒక్కర్తె-ధర్మదేవత-ధర్మాధారి - నిర్భీతిశో-శాంతిగాంభీర్యముల - ధైర్యసాహసములు ముఖ వర్ణస్సున చర్పించబడియుండ, నిలబడియుండెను. కరుణా వీక్షణముల ఆపురజనులెల్లరు, ఆపైపై బరపుచుండిరి. డప్పు మ్రోగుచుండెను." "చమేలియను విదేశికన్యయొకర్తె రాజుగారి గృహమందు మహాపరాధ మాచరించి యున్నట్టు తెలియవచ్చె. ఈమహాపరాధమును విచారించ, చమేలీ, న్యాయస్థానమునకుగొంపోబడుచున్నది. ఆమెనుసమర్థించుట కేని, ప్రతికూలముగ సాక్ష్యమిచ్చుటకేని, ఎవ్వరేని పూను కొనవచ్చును అని చాటుచుండిరి. ప్రతి మధ్యవీథియందిటు లైదునిమిషము లాగి చాటి సాగుచుండిరి. ఇంతలో సన్యాసి స్వరూపి, యెవ్వడననేల, అశోకరాం.చమేలి వెనుకభాగమున మెల్లనవచ్చి ఆపెను తట్టెను. చమేలి వెనుకకై జూచెను. నిర్బంధితురాలు. మాట్లాడనోపలేదు.

అశోక—అమ్మా, ఏల ద్వితీయసందర్శన మిమ్మని యుంటివి ?

చమేలి—ఇమ్మనియుంటిని సంభ్రమమునం దీదుచుండగ, మునుగుచుండగ నినురమ్మని కోరియుండలేదె. ఇప్పుడు వచ్చిన లాభమేమిగలదు. ఇసుమంత సందర్శనలాభ మిప్పుడు లేదు. సర్వముగడచెను. ధరోష్ణ పానీయమును గ్రోలుచుంటిని. "మానవుడు ప్రకృతిరహస్యముల గనుగొని, యిందు రచింపబడిన ధర్మముల ప్రకారము నుడువవలెను. జగజ్జనని యిచ్చిన యీ దేహమును, ఆతల్లి-అధర్మదేవత ఆజ్ఞయైన వెంటనే ప్రతిజీవి కౌతుకముతో నర్పించవలెను. అప్పుడు మాత్రమె జనని కరుణబడయ నర్హుడగును. సృష్టించినది తల్లి. ఆతల్లి దీదేహము. ఇందు లీలావినోదిని. ఆతల్లి యాజ్ఞ బద్ధులమై ఆతల్లి కీదేహము నర్పించవలెను. స్వార్థపరత్వ మిందు జూపుచో. పశుతుల్యుడగుచున్నాడు" యీ నాసందేశమును. జగమున చాటుదురుగాక. నేను, దేశము నకై యీ వ్యాఖ్యలనై పాటుబడుటలేదు; వ్యక్తిత్వముచే నిచ్ఛగించుటలేదు; నా పోరాటము ధర్మమునకై; నాసేవ మానవజాతికి. ఏకత్వమున యిమిడియున్న ప్రేమయే నా ఖడ్గము. నాహృదయసీమయే యుద్ధభూమి-నాకు ద్వేషి లేడు. అందఱు నాఆత్మస్వరూపులే; కాని దుష్టత్వముతో పోరాటదానను, దుష్టత్వమును ప్రేమతో విదలించు ఓర్పుగలదానను,

అశోకరాం—కనుక నే-తల్లీ-నీముఖారవిందము, శాంత గంభీరములతో ప్రేమమయమై ఒప్పారుచున్నది. నీచకుల

వేశ్యాగృహమందు మన్నను మనోబలము గలదానవై, యోగి తుల్యురాలవైతివి.

రక్షకభటులు—ఓ సన్యాసిరాజా, నీవీమె జేసిన చోరత్వమందు భాగస్థుడవుగా కన్పించుచున్నావు; లేకున్న నీకింత చనువేల గలుగవలసివచ్చె. నీయందు మాకనుమానము మెండుగానున్నది; కనుక అవశ్యముగా నిన్నిందుమూలముగా నిర్బంధించడమైనది. ఇప్పటి చోరులవేషము లీతీరునె యుండును. న్యాయస్థానమునకు నిన్ను గొనిపోగలము.

అశోక—(చిఱునగవునవ్వి) ఇందులకింత యనుమాన మేల! రాజులవిషయములో, అనుమాన మవశ్యముగా, విధిగా, మారవలసినదే; లేనిచో, విషయము పూర్తిగానేరదు. ఆతల్లి మృదుహస్తములకు-సంకెళ్లు-వేయుటకు మారుగా-అవ్వాటి వదలించి నాహస్తములకె-కంకణములుగా తొడుగుడి. అవి భగవతీప్రసాదము, కంకణములు. ధర్మదేవత సాక్షి.

ఈచిత్రచర్యకు ప్రజలెల్లరు మిక్కుటమగు అక్కజమందసాగిరి. ఇతని గంభీర-సత్యవాక్కులకు వేనోళ్ళపొగడిరి. ఇట్టి విచిత్రచర్య ఎన్నడు జరుగలేదని యాయూరిప్రజలెల్ల రనుకొనసాగిరి. ఆహా! ఏమిప్రభుత్వము-సత్య మసత్యముచే కప్పబడియుంటచే అవలీలగా మోసపోవుచుండిరి. ఆతల్లి కరుణాస్వరూపిణీ మహాద్భుతమగు లీలస్వభావ మేమని జెప్ప

వలెను. రాణిని రక్షునకు దెచ్చును. రాజును రంగప్పగా మార్చును. ఇదియంతయు ఆతల్లివినోదము.

న్యాయస్థానమంతయు, ప్రజలచే క్రిక్కిరిసియుండెను. గొప్ప కుటుంబీకులు సైతము శకటారోహులై దీనిఫలితము వీక్షించ వచ్చియుండిరి. ముఖ్యాసనమందు, హేమచంద్రుడీ విషమసమ్యస్యను తానె స్వయముగాదీర్చ బాధ్యతబూని ఉపవేష్టించి యుండెను. ముక్కద్దములద్వార ప్రజల అలజడిని వీక్షించుచుండెను. హృదయ వేగమును భరింపలేక హేమచంద్రుడట్లె వీక్షించుచుండెను. నాటి యహంబు తీక్ష్ణతను దాల్చియుంటచే, హేమచంద్రునకు, పరిచారకులు శిశిరోపచారముల సల్పుచుండిరి. తీవిగా దృక్కుల, గర్వాతిశయంబున, దీనయగు చమేలికై బరపుచుండెను. అతని కిరుపైపులను చిత్రగుప్తులననకు, వాదనావేత్తలు ఉపవేష్టించి యుండిరి. వారియూహా ప్రపంచకమున సత్యమున కసత్యరూపణ జేయుచుండిరి. సన్యాసి, భిక్కునుజూచి, హేమచంద్రుడు త్తలపడెను. చమేలి, పరపురుషులకు కాన్పింపనొల్లని తల్లి—నేటి దినమున వేనకువేలు జనము ఆమెచుట్టు మూగియుండ వారి మధ్యంబున నిలువవలసిన దాయెను. ఆహా—ఆజననిచర్యయేమి ? వృద్ధివెంట నాశనము, కష్టముల వెంట సౌఖ్యములు, తిరుగాడుచుండును. అబలయగు చమేలిని, బోనునందు, నిలువ నియమించిరి. ఆహా? పుష్ప

రేకులబోలు ఆడ్రవేళ్ళకు, కఠిన సంకెళలతాకుడా? చమేలి, ప్రఫుల్లవదనయై, మనస్సును, జననీ పాదకంజములందు లయింపజేసెను. దృక్కుల భూదేవికై బరపెను. ప్రజాసమూహముయొక్క సద్దడచణార రక్షకభటులు నియోగింపబడిరి. హేమచంద్రుడు లోలో ననేకవిధముల యోచించుకొను చుండెను. "ఏమి! యీస్త్రీ ధీరత్వము. ముఖమందిసుమంతేని భీతిగాన్పించదు. ప్రభుత్వమనిన భయముజూపదు" అని తలంచుచుండగా భిక్కువిషయమై, రక్షకభటులు హేమ చంద్రున కీవిధముగా విన్నవించుకొన సాగిరి. "ఇతడు భిక్కు స్వరూపుడగు. చోరుడు. యీఅపరాధమం దితనిసంబంధము గలదు; లేకున్నచో, యీకన్యతో ప్రసంగించుటయు గలుగదు." అందరీ రీతిని ఎంచుచుండగా, హేముడు, చమేలికిని యీభిక్కున కెట్టిసంబంధమే యుండనోపును. అందుకే యీ కన్య నన్ను తిరస్కరించి అవమానించి యుండునోపు. కనుక యితని కఠినముగా శిక్షించుచో, ముందుకేని చమేలి నావశ ముకానేరద''ని నిశ్చయించెను. భూలోక చిత్రమన నిద్దియే.

విచారణ మొదలుపెట్టబడెను. ప్రజలెల్ల నిశబ్దతను కాపాడుకొనిరి. సాక్షులున్నచో రమ్మనిచాటిరి. అధికారమును వ్యతిరేకముగా సత్యమును బలుక సాహసించు ధీరుడు కతి కాలము నోచుకొనలేదు. హేమచంద్రుని కుబుద్ధినెఱింగి సాక్ష్యమున కెవ్వరు ముందునకు రాజాలరైరి. వారి తరఫున

వాదించు న్యాయవాదియే కానరాదు. ఒకవేళ వాదించ నున్నను మాటకు వరహాయిచ్చు మాన్యుడేడి. చోరులు నిశీధనమయముల చోరత్వమును జేతురు. న్యాయవాద వృత్తి యో అహంబున, అన్యాయమును జేయ సమకట్టెదరు. కూడు లేనివానికడనె క్రూరత్వము జూపింతురు చోరులు ప్రభుత్వము దండించగలదు. పగచోరుల భగవానుడు దండించగలడు. న్యాయవాదులను నామసార్థకులగుచో, అబలను చమేలి విషయమై మాట్లాడనొల్లరా? మానవులు శక్తిహీనులు, అల్పులు. సత్యమే సత్యమును సమర్థించును, పట్టణంబుల ముఖంబు లెఱుంగనివారల తర్కమీమాంసులు తర్కించుచో, మానసదుర్బలులై, పల్లెవాసులు, తంద్రజెంది, మానవనిర్మితనియముల నేర్వలేనివారగుటచే, తర్కమీమాంసుల తర్కమున కనుకూలురగుదురు. సత్యమునకు స్థానముబుద్ధి. వాక్కుమీదాధారపడి ప్రభుత్వములు న్యాయముదీయ నేర్తురు సత్యము దూరమగుచున్నది.

హేమచంద్రుడు—చమేలీ! నీయందు మాప్రభుత్వముచే చరత్వ మాపాదింపబడినది. తత్కారణమున నిన్ను నిర్బంధించి న్యాయస్థానమునకు గొనిరావడమైనది. ఈవిషయమై భగవతీ సాక్షిగా సత్యమునే జెప్పుదునని ప్రమాణమును గైకొనుము.

చమేలి—ప్రభూ! ప్రపంచకమునం దెట్టిమానవునకై జడియుదానను గాను. ప్రభువులకు ప్రభువెవండో వాని

యెదుట వణకుదానను. వాజ్మూలములు లేకనే సత్యముజెప్ప సామర్థ్యుడు. నేడు నన్నపరాధినిగా ఎంచుచుండిరి; భగవంతుని యెదుట ప్రభువులగు మీరు యీవిషయమై పునర్విచారణ జరుగునపుడు, అపరాధిగా ఎన్నపడుదురను మాట మఱువకుడి. ఇక్కాలమున దీనుల పోషించు దాతలేడు. నేనీ అల్పులగు మానవుల సాక్ష్యమును బడయుదాననుగాను. నాఅంతఃకరణమున ప్రజ్వలించుచున్న శక్తియేనాకు సాక్షి. కానిండు, నన్ను విచారించు నధికారము మీకెవ్వరిచ్చిరి ?

హేమ—నేను ప్రభువని తెలియకుంటివా ?

చమేలి—ప్రభువని మీరుతలచిన, ప్రభువెటులగును. హోదాయు, విద్యయు పవిత్రమైన సత్యము నంటజాలదు !

హేమ—చాలు—చాలు నీనీతులు. నేనడుగుప్రశ్నలకు జవాబిత్తువా ?

చమేలి—నేనివ్వజాలను.

హేమ—స్వర్ణహారమును దొంగిలించినదానవుకావా?

చమేలి—దొంగిలించితినను సాక్షులెవ్వరు

హేము—లేకున్న యీస్వర్ణహారము నీకడ కెట్లువచ్చినది.

చమేలి—ప్రభువులు స్తేయమందు నిపుణులైనను, ౹చ్చోటివస్తువే నెచ్చోటికేనియొనియు పోగలదు.

హేముడు—ఇది న్యాయస్థానమని యెఱుంగవా ! ప్రభువులు చోరులనియూ నుడువుట ! ఎవరైనది తెలియ

గలదు. సన్యాసిరాజా! యీకన్యకు, మీకెట్టి బంధుత్వమే గలదా?

భిక్కు—కలదు. శాశ్వత బంధుత్వము. సోదర బంధుత్వము.

హేముడు—నీపట్టణమెయ్యది?

భిక్కు—ప్రేమరాజ్యము.

హేముడు—నిన్ను వేదాంతము జెప్పుటకై, పట్టుక రాలేదని తలచుము. వేదాంతము వృద్ధులు — వెధవలేని జెప్పగలరు. సత్యమునుజెప్పి నీనిరపరాధమును సమర్థించు కొనజూడుము.

భిక్కు—సత్యమాలోచించు ప్రభువువేరు. నాభాష వేరు. నేజెప్పునదా ప్రభువునకు. వెలుచునదతనికి. మీకు నది ప్రార్థ్యము.

హేమచంద్రుడిక విచారించిన లాభము లేదని తలంచి, అపరాధుల తరపు నెవ్వారైన సాక్ష్యముజెప్పదలచుచో, జెప్ప కోరెను. ఎవ్వరుజెప్ప సాహసింపరైరి. సాక్ష్యభిత్తులేని పక్షమున హేమచంద్రు డప్పుడే తీర్పును యీవిధముగా వ్రాయ మొదలెట్టెను.

'మాప్రభుత్వమునందు, చమేలియను కన్యయు. ఆమె ననుసరించి కుతర్కమును బూనిన భిక్కు యిద్దఱకు సంబంధముగలదని తలంచుచున్నాము; పరిసరప్రాంతముల

చోరలీ వేషములధరించి, తిరుగాడుచున్నట్లు ప్రభుత్వమువారు తెలసుకొనిరి. ఇట్టి చోరత్వమును, చమేలిజేయ నసమర్థురాలు, కాని యిందామెకు చాల సంబంధముగలదనియే తలచడమైనది. భిక్కుస్వరూపుడగు చోరునివల్లనే యీఅపరాధమాచంరింపబడినట్లు ప్రభుత్వము నమ్ముచున్నది. చోరత్వమందు సంబంధీకురాలను నమ్మకముంటనే, చమేలిని మూడు వత్సరములు నిర్బంధించ నిశ్చయించడమైనది. నేటిదినమె భిక్కును శిరచ్ఛేదనము జేయ తీర్పుజెప్పడమైనది

హేమచంద్రుడు''

ప్రభువుల యిచ్ఛాశక్తియే పరిపాలనాస్వరూపము. వారి కరుణలేనిదే చరిత్రలేర్పడజాలవు. ఇందులకుపపత్తి హేమచంద్ర-నవీనమహారాజులు. వెంగనె, చమేలికారాగార నిర్బంధురాలిగా యొనర్చిరి. ఈమానవరూపుడగు హేముని తీర్పునకు, భిక్కు-అశోకరాం లోలోన నవ్వుకొనుచుండెను. ఆనవ్వుకిరణములే ముఖమందు మహాతేజముగా ప్రకాశించుచుండెను. ఇసుమంతయేని అశోకరాం, భీతినందు సూచనల గల్గియుండలేదు. ఆహా! బౌద్ధభిక్కుల పరీక్షలో ప్రధముగా ముగా నెగ్గినవాడీతడనియే జెప్పనగును; లేకున్నచో, క్రూర జంతువగు చిఱుతపులికి, అహంకారప్రేరితుడగు హేమునకు, తన శరీరమును తృణప్రాయముగా యివ్వసాహసించునా? ప్రేమకై చిఱుతపులి కివ్వదలచె; ధర్మమునకై హేమచం

ద్రుని క్రూరచట్టములకు శరీరమును బాయనుండెను. ఆహా! మాతా! నీగర్భమెట్టి ఫలము బొందియుండెను. నిజమైన బుద్ధేచ్ఛను, అశోకరాం జగమునకు చాటియుండెను. చాట నుండెను. అశోకరాముని పెదవులందు. హృదయాకుసుమము, కుసుమించెను. ఇతని ధైర్య-శాంతి-సత్యముల-చూడవచ్చిన ప్రజాసమూహమెల్ల వేనోళ్లపొగడజొచ్చిరి. "జయ అశోక" అను జయజయధ్వనులు మిన్నుముట్టుచుండెను. ఉరితీర్పును విన్నదిమొదలుగా ప్రజలితనిచుట్టు మూగజొచ్చిరి. అందఱు కరుణాదృక్కుల బఱపుచుండిరి. ఆహా! ఎంతటి క్రూరము. పలుకరించినమాత్రాన అపరాధిగా నొనర్చెను. ఇది హేముని కుట్ర. చమేలికి ఏ సంబంధము తెగిపోవు, అందున చమేలి ద్రోహముజేయవచ్చునను క్రూరస్వభావ మనుకొనుచుండిరి. స్వర్ణహారమేమి. భిక్షు దొంగిలించుట, ఇందొక యబలకు సంబంధముండుటా; పరుల భావనకేని బాగుండ వలదా! చోరత్వమును జేసియుండుచో, చోరులకు భీతి యెక్కువే! వారు నిరపరాధులమని ఏలవాదించుకొనరు? అనేకవిధముల ప్రజలు హేమచంద్రుని గూఢతనమునకు దూరజొచ్చిరి. ఆహా! మానవ నిర్మితచట్టముల నృత్యమేమి. చట్టములందు సత్యమా! ప్రభువులకు, ఒకజీవి ప్రాణమనిన బహు సులభముగా జీవరాసుల హత్యకులవలెనే గాన్పించుచున్నది. ఆహా! సత్యమా! ఎందుదాగియుంటివి. ప్రాణములు బహు

చాకగా చట్టముల కమ్మజూచుటజూచి భరించగలవా ? దుష్టత్వమును ప్రేమచే-శిక్షణచే-ఓర్పుచే- పోనాడవచ్చును; కాని సులభప్రాయములుగా గనిపించు క్రూరచట్టములచే పోనాడ జేయగలరా ? మృత్యుదేవతకడకు, అశోక రాముని దీసికొని వెళ్ళను, కొందరుభటులు ఆయుధపాణులై వచ్చిరి. ఏమి భగవచ్చిత్రము- "ఎవ్వరా విరాగిని" యను గద్దింపులు వినవచ్చుచుండెను.

ఎవ్వరా సర్వసంగపరిత్యాగిని. సత్యాగ్రహిణి. భూ లోక మింకను గొడ్డువోవలేదు.

హేమచంద్రు డింకను న్యాయస్థానమును వీడలేదు. ప్రజాకల్లోల మేదియే జరుగునేమోయని తిలకించుచుండెను. ప్రజ లుద్రేకపూరితులగుచుండిరి. పైమాటల లెక్కించకయే హేమచంద్రుడు గృహమున కరిగెను భిక్కు ఒంటరిని శిరః చ్ఛేదనమును హేమచంద్రు నాజ్ఞానువర్తులై చేయగా బ్రహిరా ప్రదేశమునకు దీసికొని వెళ్ళెను. భిక్కు వీరి అజ్ఞాన మునకు జాలి నొందుచుండెను.

ఓభిక్కు రాజాజ్ఞానువర్తులమై నిన్ను శిరఃచ్ఛేదనము జేయనున్నాము. ఇందు మాకెంత మాత్రము బాధ్యత ఉండ నేరదు. ఇది ఉద్యోగప్రసభము కడసారినీ ఇష్టదైవమును మనసార ప్రార్థించుకొనుము. అని ఖడ్గపాణి నుడివెను.

ఆహా! భిక్కు నీహృదయము సత్యముగా శైలఖండ మగును. లేకున్న మరణమునిన భీతినందవేమి! ఆ చిరునవ్వ

దేమి. నాడు ఏసు దేముడు శిలవేయబడెను. నేడు నీవతనికి తుల్యుడవుగా శిరఃచ్ఛేదనము గావింపబడనుంటివి! సత్యము ధర్మము ప్రేమ నీయందె యున్నచో నిన్ను కాపాడుగావుత.

భిక్కు వీక్షణముల అభ్రమునకై నిగుడించి మంద హాసము ఏదియో ప్రార్థించుచుండెను. మారుతమీ ఘోర మును జూడజాలకుండెనా యన వీచుచుండెను. ఖడ్గపాణి ఖడ్గము మెఱయుచుండెను. ధర్మప్రేరితుడై ఖడ్గపాణి తన ఖడ్గమును గాలికెత్తెను. అహో భిక్కు నీజీవితమంతయు ఒక్కని ఖడ్గ ప్రహరణచే మాయమందవలసిన దేనా?

"ఆగు మాగుము" ఆకాశవాణివోలె వినవాయెను. చుట్టును మూగినప్రజలు హాశ్చర్యనిమగ్నులైరి. ఖడ్గపాణి ఖడ్గము వణకసాగెను.

"ఆగుటేమి"

విరాగి—ఏమియా పశుపాలనమా? పశువులవలె వధించుటా.

ఖడ్గపాణి—రాజాజ్ఞ.

విరాగి—ఏమి రాజాజ్ఞయా.

ఖడ్గపాణి—పిచ్చదానవోలె కాన్పించుచున్నావు. రాజన్యాయముల నెఱుంగవు. పొమ్ము. నీకు జెప్పవలసిన యవసరము లేదు.

విరాగి—విరాగి పిచ్చిది. సత్యము. విరాగుడు పిచ్చ వాడు. పిచ్చవానిని వధించు రాజన్యాయమెచ్చటది?

ఖడ్గపాణి—రాజుయిచ్చిన న్యాయమద్ది? మరొకడు చట్టమును తిరస్కరించ నర్హతలేదు.

విరాగి—సత్యము. సత్యము. సర్వవిదితము. రాజో ల్లంఘించిన చట్టమును ద్వితీయుడు తిరస్కరించ వలనుగాదు. బాగు బాగు రాజసేవకుడే తిరస్కరించుచుండగా మఱొకని విషయమును చర్చించ వీలగునా?

ఖడ్గపాణి—ఎన్నడు రాజునియాజ్ఞను అతనిసేవకులు తిరస్కరించుట కలుగనేరదు. హెచ్చుగా నిచట మాట్లాడ వలదు. కాలమును వృథాపుచ్చక వెడలిపొమ్ము.

విరాగి—పోవలసినవాడవు నీవు. రాజాజ్ఞను తిరస్క రించువాడు శిక్షార్హుడగును. రాజుసేవకుడు వీవు. అతని తిర స్కరించుచున్నావు, నిన్ను వధించ నాదిభగవదాజ్ఞ.

అని విరాగిణి గుప్తఖడ్గపాణికై విసరబోవును. భిక్షు దీనవదనముతో విరాగిని మాహాత్మ్యమును జూచుచుండెను. ప్రజలు గోలలెత్తుచుండిరి. భిక్షుని వధించుటాపి, ఖడ్గపాణి విరాగినిని, రాజగు హేమచంద్రునికడకు గొంపోయెను. వీరిని వెంబడించి ప్రజలు పరువిడుచుండిరి. హేమచంద్రుడప్పుడే న్యాయస్థానము వీడనుండెను.

హేమ—ఏమిది.

ఖడ్గపాణి—అయ్యా విరాగినియట. యీపె అనవసర ప్రసంగమున నాతో జొరబడి నాప్రయత్నమును ఆపగలిగిన

దాయెను. రాజద్రోహినని గర్హింపదొడగెను. గర్హింపదొడ గుటెగాక ఖడ్గమొండు నాకై నిర్భీతితో విసరివైచెను. ఇది యెల్ల కుట్రగా దోచుచున్నది. భిక్కునకు చమేలితో సంబంధముండునట్లు, భిక్కుతో యీయామె సంబంధము గలిగించుకొన నాతో కయ్యమునకై వచ్చినది. ఈచోరత్వమందీమెకు సంబంధముండియుండవచ్చును.

హేమ—ఏమి పిచ్చదానా? నీకు ప్రాణమందు తీపిలేద వెఱ్ఱిదానవు యగుచో నీకడ గుప్తఖడ్గముండు టేల?

విరాగి—అగును. రాజద్రోహుల ఖండించుటకు.

హేమ—రాజద్రోహు లెవరు?

విరాగి—ఎవ్వరా ఖడ్గపాణి.

హేమ—ఎటుల.

విరాగి—ఏదిమీతీర్పును యీ వెఱ్ఱిదాన నొక్కసారి చూడనిండు.

అని తీర్పు కాగితమును విరాగిని చదువుచు, అద్రాతకు వ్యాఖ్యను జెప్పదొడంగెను.

విరాగిని—ప్రభూ! నామనవి. పిచ్చదాని పిచ్చభిప్రాయమును శాంతమనస్కులై విందురుగాక! మీతీర్పునందేమని వ్రాయబడెను. శిరశ్ఛేధనమని గదా, శిరమనగా అర్థమేమి? శిరమనగా అంత్యవస్తువు. చివరనుండునది, మొదటి వస్తువు. ఇతడు ఖడ్గమును పైకెత్తియుండగా యీవిరాగుని

బోడితల యందింకొకవస్తువు గలదు. ఝంఝామారుతముగా వాయువప్పుడు వీచుచుండెను. ఆవాయు చలనముచే అతనిపై వస్త్రమతని శిరమునర్వాలెను. అప్పుడతని శిరమేది? వస్త్రముకాదా? చేదనమనగా అర్ధమేమి. తొలంగిచుట, ఎడలించుట, శిరముపై నాడుచున్న వస్త్రమును తొలగించుట. ఇట్టి సత్యవంతమైన తీర్పును, మీయాజ్ఞను, వేఱుగ ప్రవర్తించుచో తిరస్కరించుటగాక యింకేమిగానోపును. శిరస్సున వస్త్రము శిరమై-వాయుదేవుని కరుణచే-ధర్మస్వరూపియై నాట్యమాడుచుండగా యీఖడ్గపాణిఖడ్గమేల ఆవిరాగునికంఠమునకు గుఱిజూడబడెను. మీచట్టమును తిరస్కరించుచున్నందుల కాగ్రహావేశురాలనై, రాజద్రోహినివధించ సమకట్టియుండనోపు.

అచ్చట ప్రజలెల్లరు అమందానంద పరవశులై విరాగిని యుక్తికెంతయో నవ్వసాగిరి. ఆహా ధర్మదేవతా! విరాగిని స్వరూపమును దాల్చితివా? హేమచంద్రుని ముఖవిలాసము ఒక్కపరి వాడిపోయెను. అతని బుద్ధిహీనతకు తానె నిందించుకొనెను. మఱొకతీరున, అతని అభిప్రాయమునకు సరిపోవురీతిగా తిరుగు వ్యాఖ్యజేయుటకు వలనుపడనందులకు చాల చింతిల్లెను.

హేమ—విరాగిని. సత్యముగానీవు విరాగినివికావు. నీదు సదుద్దేశమునకు మెయికోలు దెలుపుచున్నాను. భగవదాజ్ఞను దప్పించ సామర్థ్య లెవ్వరుగలరు? ఈభిక్కు అప

రాధి యని మటుకు ఒప్పుకొనకతప్పదు. తత్క్షణమితని మా త్రము నారాజ్య పరిసరముల దాటించవలసినదిగా నాసేవ కుల కాజ్ఞ యిచ్చుచున్నవాడను. అతని కింకను జీవితపరి పూర్తి కాలేదనియే తలంచుచున్నాను.

చుట్టును మూగియున్న ప్రజలు కంఠధ్వానముల ఆహ్లా దమును వెలిబుచ్చిరి. ఈనూత్నవిరాగిని ఎవ్వరాయని విచిత్ర ముగా చూడదొడంగిరి. విభాసమాన తేజోకలితమై విరా జిల్లుచున్నది. ఆత్మబంధువై విరాగునికాపాడెను. ఇట్టి సుహృదయోపేతమగు ప్రేమ దంపతులకు గాక యింకెరికుండ గలదు? భిక్షుని శాంతగంభీర ధైర్యమే యతని నిక్కముగా గాపాడినది. కాని ఎంతయో ప్రేముడితో పెంచుచున్న కుక్కుటకురంగమారిని ప్రకృతిసౌందర్యోపేతమగు తన ఆశ్రమ మును పవిత్రవృత్తయుండు, ధర్మావలంబియగు తన శిష్యుని చక్కనిగీతముల వినిపించు రాం గంగానదిని విడిచి పరదేశ ములకు తఱుమబడుట యెట్లు? భటుల ప్రయాణసిద్ధము గమ్మని త్వరితపెట్టుచుండిరి. బాహ్యప్రపంచవిరాగి, ప్రేమ స్వభావినియగు తనప్రాణదాత మెయికోలు బొందుటెట్లు. ఎచ్చటున్ననేమి నాతల్లి కరుణప్రసన్నవాఃపూరముగా నాపై ప్రవహించుచో నాకెట్టి ధర్మసందేహ ముండనేరదు. ఆజగ జ్జనని సర్వజీవులయందు క్రీడించుచున్న శక్తియే నన్ను ధర్మ మార్గములందు నడిపించగలదు. పరదేశములకు వెళ్ళెదను. ఋషికులసంతతియగు కృషీవలుల ధర్మ, ప్రేమ నిరాడంబ

ముల జూరగొనెదను. నా యీ దేశమును వారిద్వార నెఱి వేర్చుకొనగలను. వారిమధ్యంబున వారిబిడ్డనై తిరుగాడెదను. కాల[ప్రవాహమున కనుమూసెదను. నాజీవితనౌక భగవతీ యొద్దుపుగాడ్పుల కెటులనడచునో నడువనిమ్ము. పట్టణరాజము లందు [ప్రేమనశించినది. ధనపిశాచులై [ప్రకృతిపదార్ధముల పెంచుచుండిరి. వారియందు పూర్తిగా ధర్మము నశించినది. నిరపరాధులగు [గ్రామవాసులచెంతనే నాతల్లి తనధర్మక్షుధ ను దీర్చుకొనుచున్నది. మాతా హృదయపూర్వకవందన ములు. ఎటులనడిపెదో వత్తునాదారిని. అని అశోకరాం తలంచుచుండెను. ఇంతలో [ప్రయాణసన్నద్ధులైరి. విరాగిని వీక్షణములు అశోకరామునిపై [వ్రాలెను. అశోకరాముండు విలీనుడాయెను. ధర్మదేవతవై రక్షించినదానవు. నీదు పవి[త్ర [ప్రేమ నావెంట ఎల్లకాల ముండుగాక. పురుషుండగు నన్ను రక్షించినంతమా[త్రమునే నీధర్మము పూర్తికానేరదు. ఏసోద రికై మరణదండన విధింపబడితినో ఆపెను రక్షింపుము. ఆమె యీపురమందె కఠినముగా మూడుసంవత్సరముల దనుక నిర్బంధింపబడ విధురాలైనది. నీశక్తిసామర్థ్యములం దుప యోగింపబడుగాక! సెలవా?

విరాగిని—పర[ప్రదేశములం దేని [ప్రేమ తత్వమునే వహింతురుగాక. అంత మీవెంట ధర్మదేవత నివశించుగాత. పవి[త్రపురుషులు. మీయాజ్ఞను శక్తిసామర్థ్యంబులతో శిరసా వహింతునుగాక. ఇందునాచేష్ట ఏమియు నుండనేరదు. నా

చేష్టలు భగవతీయాజ్ఞలు. కొందఱు గొప్పవారమని గర్వింతురు. గొప్పతన మాతల్లి క్రీడావిశేషమేగాని వారి బుద్ధివిశేషము కానేరదు. మానవుడల్పుడు. ఆతల్లి కరుణావిశేషముచే గొప్పతనము పూర్ణవికాసము నొందుచున్నాడు. ఆతల్లి కరుణ జెందుకై మానవుడామె యిచ్ఛాస్వరూపికావలెను. ఆమె యిచ్ఛ, ప్రేమ, ధర్మము, సత్యము. భార్యయందు తల్లియందుండునది రూపమునకు ప్రేమ ఒక్కటె. అది ప్రవర్తిల్లినపుడనేకరూపముల దాల్చును. సర్వము ఆపవిత్రప్రేమమయమే. ధర్మము ప్రేమ, సత్యమన నొక్కవస్తువే. అద్దానిని మఱువకుందురుగాక! నాతల్లి ఆజ్ఞచే కార్యములెల్ల చక్కబడుగాక!"

భిక్కును రాజభటులు పరప్రదేశములకు గొంపోవ దొడగిరి. అంత్యదృష్టిని ఆశ్రమమువంకకే బఱుపనివ్వక పోయిరి.

---

## పదవమూడవ ప్రకరణము

సామముగా హేమచంద్రుడు, చమేలిని వదలునట్లు కన్పించుటలేదు. దండోపాయముచేతనె హేముని దుష్టత్వమును పారద్రోలవలయు. కర్మకారుని హృదయము పూరేకువలె ఎంతమృదుత్వమును ధరించునో, అంతటికాఠిన్యమును, శైలఖండమువలె నుండవలెను. శ్రీకృష్ణభగవానుడు బోధించున దిద్దియేగదా? నాకు ముఖ్యము ధర్మము. అట్టి పవిత్ర

ధర్మమునకే యావద్దేశమును, ఖండించినను పాపముండ నేరదు అట్టివాంఛయుండక, నిష్కామ్యముగా ధర్మార్థమైయాచరించ వలెను. వృద్ధివెంట నాశనము, నాశనమువెంట వృద్ధిగలదు. జనసమూహము నశించనిదే ధర్మము విరాజిల్ల నేరదు. కృష్ణ భగవానుని పవిత్రవాక్యానుసరణముగా నిష్కామదండన ధర్మమగునుగాక! దండనయగునని, కరుణాస్వభావమునుబూను చో అద్దిపాపభూయిష్టమగునుగాక! అందుకేగదా అర్జునుని యపారకరుణాస్వభావమున పిఱికితనమనియు, పాపభూయిష్ట మనియు, జగద్గురువగు కృష్ణుడుపదేశించి యుండెను. ధర్మార్థమై కరుణనువీడవలెగాక. కరుణస్వభావమగు ప్రేమార్థమై సత్యమును బూనుగాక. ధర్మస్వరూపము కాఠిన్యము, ప్రేమ స్వభావము కరుణాకనకము. సత్యస్వరూపము పరిశుద్ధాత్మ. ధర్మమునకై కాఠిన్యముగా హరిశ్చంద్రుడు సర్వరాజ్యమును విడనాడెను. ప్రేమకై బుద్ధమహాదేవుడు జీవరాశియందు కరుణావృష్టిని గురిసెను. క్రైస్తుదేవుడు సత్యమునకై పరిశు ద్ధాత్మ చెందియుండెను. రత్నములగు యీమూఁడుగుణములు లేనివాఁడెన్నడు కర్మయోగి కానేరడు గదా? ప్రేమచే యీ రాజుపై సామము నుపయోగించితి. ఫలితము కానేరదాయె. ప్రేమతోఁడుత సత్యమగు నాపరిశుద్ధాత్మను జూపియుంటిని; అనగా నీచతనముగాకుండ; దొంగతనమునువహింపక అతనికి నాయుద్ధసన్నత్వము, సత్యస్వరూపముగా తెలుపుదుగాక! ఇక

నాధర్మప్రేరణము యుద్ధమగును. నాసందేహము నాతల్లి దీర్చినది. ఇక నీరాజును యుద్ధముచేతనె దండింతుగాక! భీకరమగు రేయి ధర్మమగుగాక! నిష్కల్మషముగా వెలువడు ప్రాతః సూర్యుడె సత్యమగుగాక! సున్నితమగు, సంధ్యా-రవియే ప్రేమయగుగాక; ఈమూడు ప్రపంచమును, శక్తులై పాలించుచున్నవి. ఈమూటిని విడదీయుచో, ప్రపంచకము కదల జాలదు. ధర్మమును, నిబిడాంధకారమందు మునుంగుదుగాక" అని గంభీరముగ విరాగిని హృదయాకాశమున పలుకుకొనెను.

విరాగిని. జన్మవిరాగినియా! చదువరా! కానేరదు. ధర్మార్థమై విరాగము బూనినది. జన్మతో మెఱపు. అంధకారమందు మెఱపు. మరణదండన భీకరాకారముచే క్రమ్ముకొనిన అంధ కారమును చెండాడిన మెఱపు. సౌదామినీ. కర్మయోగము లేని జ్ఞానయోగము అరుచిగా, స్వారస్యము లేమిగా గన్పించు నని కాబోలు సౌదామిని ఎల్లకాలముల కృష్ణభగవాను వాక్యరీతి. రాజయోగిన్యైన, జ్ఞాన, భక్తియోగిన్యైనను, కర్మ నాచరించవలెనను, ధర్మమును పరిపాలించుచున్నది. తన జ్ఞానచక్షువుచే సర్వమును విదితము జేసికొనుచున్నది. హేమ చంద్రుని మాహాత్మ్యమునుజూచి వెంటనే సౌదామిని, తన శక్త్యాశ్రమమును జేరెను. ఒక్కనిమిషమేనియు వృధాపుచ్చ దలుపలేదు. వెంటనే శంఖానాదమును గంభీరముగ పర్వత శిఖరమున వెలయుచున్న శక్త్యాశ్రమమునయుండి సల్పెను. మూడువందల శూరుల వీనులనాటెను. కృష్ణుని — మురళీ

నాదము, గోపికల నాకర్షించినటుల — సౌదామిని శంఖా రావము, ఆబాలగోపాలమును ఆకర్షించెను. కృష్ణుని మురళి ప్రేమనాదము. సౌదామిని శంఖారావము ధర్మప్రేరితనాదము. వైశమె—వందలకొలదిగా, శక్త్యాశ్రమమును, నిముసములో జేరగల్గిరి. వారి సంతసమపారమై పొరజొచ్చెను. ఆహా సౌదామినియొక్క ఆకర్షణశక్తియేమి! ఆమె పవిత్రాత్మయే ఎల్లఱ ఆకర్షించి ధర్మప్రేరణ జేయుచున్నది. ఆశ్రమము వెలుపల జనులెల్లరు ఉపవేష్టించి సౌదామినిరాకకై నిరీక్షించుచుండిరి.

వసంతఋతువది. ఋతురాజుకై ప్రకృతీమకన్య జీవచ్ఛవంబై యింతవఱకు వేచియుండి అతని సందర్శనంబున చిఱునగవు నవ్వుచున్నది. అవ్వియే లతాదులు వృక్షములు చిగుర్చుచుండెను. ప్రకృతీమకన్య తన సౌందర్యాతిశయంబుచే ఒయ్యారమును జూపుచున్నది. పర్వతరాజము ప్రకృతీయకన్యకు స్వాగమిచ్చుచుండెను. సౌదామిని ధర్మప్రేరేపితమై ప్రకృతి భాసిలుచుండ జనమధ్యంబునకై వచ్చి నిలువబడెను. సౌదామిని ముఖ్యుడగు వీరుడు పుష్పమాలతో ముందడుగిడి ఆమె కర్పించెను. ప్రజలెల్ల ఆహ్లాదమును వెలిబుచ్చ జయ జయ ధ్వానముల సల్పిరి. మెల్లన సౌదామిని వారిమధ్యంబున లెగచి వారి నీపిధంబున ఉద్బోధించ మొదలిడెను.

'ఓ వీరాధివీరులారా! సహజశౌర్యో పేతులారా! ప్రేమస్వభావులారా! మీరెల్లరు సత్యముగా నాకు ఆత్మ బంధువులని జెప్పగలను. నారాకకై మీరుజూపిన కౌతుకము, కౌతుకముగాదు. నా ఆదేశమును నెఱవేర్చుచో నాయందభి మానులని నమ్మగలను. మీరహింసాలవంబులై, ప్రేమ పాత్రులై, సత్యవ్రతులై, ధర్మప్రేరితులై యింతవఱకు జీవించుచున్నారు. భగవతీమతల్లి కోరునదద్దియే. ఆమె యిచ్ఛ అద్దియే. వారే ఆమె కరుణాపాత్రులు. ఇంతవఱకు మీప్రేమను మీభార్యా భర్తలందు జూపుచుండిరి. సోదర సోదరీమణులందు సత్యవ్రతులై మెలంగుచుండిరి. తల్లి దండ్రులందు ధర్మానువర్తులై వర్తిల్లు చుండిరి. ఈతల్లులకు మించిన తల్లి యింకొకర్తె గలదు. అది దేశమాత. ఆపె గర్భమున జనించి ఆమె ప్రసాదమును భుజించుచు, ఆమె కడ దుష్టత్వము చెలరేగుటజూచి, ఎవ్వడేని మానముబూని యుండగలడా? ఆపె ఋణమునుదీర్చ తరుణము వచ్చినది. మేల్కొనుడు వీరావేశపరులుగండు. నిష్కాములై ధర్మా వలంబులు గండు. భగవద్గీతల పఠించుడి. భగవంతుని స్మరించుడు. భగవంతునియందు ప్రేమ, చైతన్యము, తేజస్సు గలవని గమనించుడి, ప్రేమ చైతన్యము సత్య స్వరూపము. తేజస్సు ధర్మస్వరూపము. ప్రేమ శీతలస్వభావి. తేజస్సు ఉష్ణస్వభావి. ధర్మమును కౌగిలించుకొనుశక్తిగల ధీమంతులు ముందునకు నడుచుడి. భగవద్గుణములగు యీ

మూడు గుణముల మానవుడుహృదయపూర్వకముగా నవలం బించనిచే ముక్తిగాంచ నేరడు. తేజస్సు జ్ఞానము. సత్యము కర్మ, ప్రేమ, భక్తి. ఈ మూడుస్వరూపములు ఒక్కటె. మూడుగా పరిణమించునది. ఓ నాఆత్మ బంధువులారా! ధర్మప్రేరితులై ముందడుగిడుడి. కర్కోటరాజు నీచుడై దుష్ప్రవర్తనుడై యామిన్యాముమను చెడగొట్టజూచుచున్నాడు దేశజులైనను, పరదేశజులైనను అధర్మప్రేరితులైనపుడు, మానమును వహించదగదు. కర్కోటరాజు హేమచంద్రుడు. నవీనోపేతుడై స్త్రీల నిష్కారణముగా చెఱగొనుచున్నాడు. అతని ఖైదీగ చమేలియను పవిత్రకన్య దీనయైకలదు. ఆమెను విడిపించ అతడు సామముచే నొప్పుకున్నడు. ధర్మప్రేరితమగు యుద్ధమే మన శరణ్యమె. మీమీఉత్సాహముజూపుసమయ మే తెంచినది. రేపటి రేయియే మన ప్రయాణదినము—"

సర్వజనులు, ఉత్సాహాతిశయమునుధ్వానముల, సమ్మతి జూపిరి. అందొకకన్య ముందటికురికి, మేమును మాతృసేవను జేతుమని గంభీరముగ పలుకదొడంగెను. సౌదామిని ఆమె వీరాతిశయంబునకు కడుంగడు సంతసిల్లి.

సీ. రణరంగమనసఖి రాణివాసముగాదు
    రక్తంపుటేరుల రణముగాని
ముత్తెంపుసరులేచి ముచ్చటాడుటకాదు
    మునిముందు కత్తుల పోట్లుగాని

నెరికొఱుల్ మవ్వక నిక్కులాడుట కాదు
  కాకులచేపోట్లు బడుటగాని
ఉద్యానవనమునం దుయ్యాలలూగుట కాదు
  ఘోరరౌద్రావేశ వీరరసము
ఇట్టిశదనంబు నీకేడ నింటనుండ
నిమిషమాత్రంబులో శత్రునివహమెల్ల
మనిమినై చియు దురములోతోయజాక్షి
జయము గొనివత్తుము స్థిరయశముఘటిల్ల.

ఈవిధంబున యుద్ధమన స్వప్నముగాదనియు, క్రియారూపమున ఘోరాకారమనియు, వర్ణించి. ఆస్త్రీనివారించెను. ఈమె కఠినయుక్తిపరీక్షకు నెగ్గినవారు మూడువందలు వీరులు గలరని పాఠకులెఱింగియే యుందురుగాత! వారలెగాక, వారి ననుసరించి రెండువందల జనముకుపైగా వత్తుమని సమ్మతి దెలిపియుండిరి. యుద్ధసన్నద్ధులుకండని, సౌదామినిచే ప్రేరేపింపబడి, యుద్ధమన-యాహ్వానపురుషుని రక్తనాళము-ఉష్ణతేజస్సు ప్రవహించుచుండును. ఆ తేజస్సె వీర్యమనియు, పర్యాయపదము వీరతనియు, చరిత్రకారులు వ్యవహరింతురు. యుద్ధవీరులెల్లరు సన్నద్ధులుగా గృహాభిముఖులైరి. సౌదామిని ఉత్సాహియై విరమించెను.

అప్పుడె కాలమనుకన్య. అంధకారమను మేలిముసుంగును లజ్జావిశేషంబున ఆస్యమును కప్పుకొని యుండెను.

సౌదామిని వీరపురుష వేషంబును ధరించుచుండెను. తురుష్కుని అశ్వము సౌదామినికి కలదని పాఠకులెఱింగియే యుందురు గాక. అశ్వము నధిరోహించెను. వెంట ఐదు వందల సైన్యము వచ్చుచుండెను. అందు మూడువందల వీరులు అశ్వసైన్యము. మిగిలినవారు పదాతిసైన్యముగా ఎంచబడిరి. నిశ్శబ్దముగా వీరెల్లరు వివాహమునకేగురీతి మహోత్సాహముతో వెడలుచుండిరి. నాటి యహంబెల్ల వనమధ్యంబునే గడపిరి. రేయి పదునొకండు ఘంటలకు కప్ కోటకు చేరియుండిరి. గ్లానము జెందితి మని విశ్రాంతి నేనియు తీసికొనరైరి. ఏవిధంబునయేని యరివర్గమును ఓడించుటే వీరి కర్తవ్యము. ఎవ్వరిశక్తికొలది వారి వారి ధర్మముల సౌదామిని ఆజ్ఞానుసారముగా నెఱవేర్చుచుండిరి. ఎచ్చట చూచినను ఉత్సాహమె వెల్లివిరియుచుండెను. గుడారముల వేయువారు కొందఱు, యుద్ధసామగ్రుల సిద్ధముజేయువారు కొందఱు, యుద్ధమని, సవాలని శత్రుసేనకు చాటగా డప్పులు కొట్టువారు, శంఖారావమును బూరించువారు బూరించుచుండిరి. హేమచంద్రుడు, విరాగిని, సౌదామిని స్త్రీ యని తలంచి, మదోన్మత్తుడై అజాగ్రత్తచే చమేలి నివసించు నుపాయములతో స్వప్నరాజ్యమందు మత్తిల్లియుండెను. వీరరసవంతమగు నాదములు కర్ణకుహరములందు ప్రతిధ్వనించుచుండెను. దిగ్గునశయ్యనుండి లెగచెను. ఆహా! ఏమి చిత్రము. రవ్వంతయేనియు హేమచంద్రుడు యుద్ధసన్నత

జెందలేము. విధికృతమేరీతి పరిణమించునో జ్ఞాతము. యుద్ధసన్నద్ధుడు కాకున్నను ఇతనికడకు మూడువేలకుపైగ సైన్య సమూహముకలదు. ఉండినను వారునిద్రాపరవశులై యుండిరి. చేయునదేమి? హేమచంద్రుడు, మోహాంధకారుడు. యావ్వనప్రాయుడు. ఇంతదనుక యుద్ధమన ఎఱుంగడు. ఏమిచేయుదమనిసను హేమునకేదియు దోపకుండెను. వెంటనే తన సేవకులలెగపి సైన్యాధిపతి పిలువనంపెను. యుద్ధప్రకటనాసూచకనాదములతో నగరమందలి జనులెల్లరు భీతిల్లి దిగ్గున లెగచిరి. కోటపైగ దేదీప్యమానముగ దిపిటీలకాంతి గన్పించుచుండెను. నాదము భీకరముగ వినగుచుండెను. ఆనాటి విరాగి కృత్యమేయిది యనియు, యీసంఘటనము నకు హేమచంద్రుడేకారకుడనియు నతని నిందించుచుండిరి. సైన్యమంతయు మేల్కొల్పబడెను. సర్వము గాబ్రాజెందియే యుండిరి.

యుద్ధసామాగ్రిని చేకొని పరువిడసాగెను. బురుజులపై బారులు వరుసగ దీర్చబడియుండెను. యుద్ధానుక్రమము మొదలుపెట్టబడెను. అప్పటికి దాదాపు నాల్గుఘంటలైయుండును. నగరమంతయుకల్లోలముగనుండెను. ఫిరంగులు ప్రేల్చుచుండిరి. సౌదామినికిమిక్కుటముగా సైన్యము, మిక్కుటముగా యుద్ధసామగ్రి లేకుండెను. యుద్ధతీవ్రత దట్టతనము జెందుచుండెను. ఖడ్గధ్వనులు ఖంగున మాఱుమ్రోవుచుండెను.

పౌరుషాతిశయంబున ఖడ్గములు, మెఱయుచు, శత్రువర్గముపైకి దుముకుచుండెను. రక్తప్రవాహము మొదలిడెను. ఎచ్చట జూచినను వీరరసమె ముఖ్యముగా గాన్పించుచుండెను. సౌదామిని తన సైన్యమును ప్రోత్సాహపరచుచుండెను.

సీ. వీరులారా! మీరు వీరరంగమునందు
వీరతన్ జూపుడీ వెఱపులేక
శత్రులబరిమార్చి సంగరమందున
స్వారాజ్యలక్షణ సలుపరయ్య
పేరుప్రతిష్టల పెంపొందజేసియు
పిన్నపెద్దలగూడ వేడ్కతోడ
రణరంగమను పెండ్లి రాజిల్లుచున్నది
ఖడ్గముల్ బంపుడీ కంకణముగ
వీరుడే పెండ్లికొడుకని నెలయరయ్య
సంగరపు భూమియే పెండ్లిస్థలముకాగ
కొమరుమంత్రాక్షతంబుల గ్రుమ్మరయ్య
వేదవిధి మంత్రములజేర్చి వేడ్కమీర.

పై ప్రోత్సాహమునకు ప్రతివాని రక్తనాళముల అమితోత్సాహము, ధైర్యసాహసములు పాఱదొడంగెను. అంతః శక్తి విజృంభించెను. వారిమధ్య – మహాశక్తితాండవమాడుచుండెను. సౌదామిని సైన్యమున కిదివఱలో క్రమశిక్షణ లేకుండెను. ప్రథమయుద్ధము, పౌరుషాతిశయముచే క్రమ

శిక్షణ లేకున్నను, వారి బాహుబలపరాక్రమముచే, అరివర్గ మును దునుమాడుచుండెను. సౌదామిని దేవి విహరించు చున్నది. ఆహా! ఆమెపరాక్రమ మేమి! యుద్ధకౌశలమేమి! ఇదివఱలో యుద్ధముఖంబులు జూడని స్త్రీ. ఈమె సోమ మేమి అశ్వముపై నుండి, తనఖడ్గప్రహరణ సలుపుచున్నది. బురుజు లపై హేమచంద్రుడీమె పౌరుషాతిశయమగు ముఖంబును జూచి వణకుచున్నాడు. ఈమె జీవించియుంటిని, తనువొకటి కలదని మఱచియే విహరించుచుండెను: ఈమె విహరణకు అంబరంబున సూర్యభగవానుడు సిగ్గిలి, నీదరకదంబులనుండి యీామె పౌరుషాతిశయంబును, ఘోరరౌద్ర వీరావేశమును, ఖడ్గప్రహరణను, నయనానందముగా భారతభూమిని ఎంతకా లమునకీ స్వాతంత్ర్య సంగర మేర్పడెనని సంతసించుచుండెను ఆహా అందులకే దేవివిహార్, అల్లదె జూడ రేమని ఉషఃకాంత లతో సూర్యభగవానుడు హెచ్చరించుచుండెను. లేవయస్విని యుద్ధానుక్రమశిక్షణను లేకయే ఎంతటియుద్ధకౌశలతను జూపు చున్నది. పర్యాయమునకొకనినే ఆపెఖడ్గరాజము బలిజెందు చుండెను. అప్పుడప్పుడెతూర్పుదిశనుఉషఃకాంతలు దేవివిహార్ గుఱించిముచ్చటించుకొనుచుండెను. ఆఉషఃకాంతలనె పూర్వ యుద్ధంబుల కవీశ్వరులు, దేవతలు జూచిరనియు, మెచ్చిరనియు వ్రాయ సాహసించియుండిరి. ఇంకొకవైపున దేవీఆలయమును ధైర్యసాహసమును ప్రకటించిన వీరుడు సౌదామిని అత్న

శిష్యుడు తనఖడ్గప్రహరణ సల్పుచుండెను. వీరాతిశయంబున వీరుడొకొక్కకపరి అశ్వమునుండి పైకెగయును. యుద్ధప్రోత్సాహికనాదంబులు మ్రోగుచుండెను. సైన్యఅంతఃశక్తిని విజృంభింప జేయుచుండెను. ఆమహాశక్తియే తన యిచ్ఛానుసారముగా నాట్యమాడుచుండెను. ఆమె ఆకారమును రక్తమయముగా జేసికొనెను. ప్రేవుల కంఠము ధరించెను. పుర్రెలహస్తముల బూనెను. రక్తమనేత్రములతో అగ్నికణముల రాల్చుచుండెను. ఆమె కదలికకు యిరువైపుల సైన్యము పడియుచుండెను. ఆమెగయొక్క దాహము దీర్చుకొను చుండెను. భయంకరనాట్యము. నవీనులు రానొల్లనిస్థలము. ఎవ్వని హృదయమున ప్రత్యేకముగాకరుణకాన్పించుటలేదు. ధర్మమే ముఖ్యస్వరూపిణియై వారిద్వారా తన ఇచ్ఛను నెఱవేర్చుకొనుచున్నది. హేమచంద్రుని సైన్యము మూడువేలు. సౌదామిని సైన్యము అయిదువందలు. ఇదేటిన్యాయము. సౌదామిని వీక్షణములు ధర్మమందు లీనమైపోయెను. సేనాధిపతియయ్యు సైన్యబలంబును జూచుకొనదాయె? ముందునకుఱుకు ఉత్సాహాతిశయమెగాని వివేకతను గన్పించకుండెను. రక్తచర్చచే నూత్నవధువుగా గన్పించుచుండెను. ఖడ్గము ఇంద్రధనుస్సువోలె ఎట్టినై కన్పించుచుండెను. ఆమె స్వహస్తముతో ఎందఱనో దునుమాడెను. కాని తన సైన్యమునకు క్రమశిక్షణ లేమిచే చాలవఱకు పడిసిరి. ఇది ఆమె దృష్టికి కొద్దిగా తట్టెను. ఆమె ధర్మమును తర్కించుకొనెను.

ఆమె శిరోజములు విడివడెను. అశ్వపద తాడనము భూమినంతయు ప్రతిధ్వనించుచుండెను ధూమము సూర్యుని దృష్టిని కప్పిపుచ్చుచుండెను. సైన్యాబలంబు సౌదామినిని ఆకర్షించెను. రౌద్రావేశంబున తన్మయియైయున్న సౌదామిని వివేకమును బూనెను. సేనాబలంబు క్షీణించెనని తలంచెను. వెంటనే యుద్ధము నాపు దళారవంబు సల్పెను. ఇరువంకల డస్సినవారై యుద్ధమును ప్రస్తుతకాలంబున కాసిరి. క్రమ శిక్షణచే లేమిచేచాల సైన్యముమడిసెనని తలంచెను. బాహు బల రౌద్రావేశ ప్రదర్శనము గావించినది. దేవతాధిపతిచే దేవి ఆహార్ యను బిరుద మీభూలోకమున బడసినది. జయము దెచ్చుటకై ఆసించుట వీరుని లక్షణముకానేరదు. సైన్యమంతయు మడిసినను ధర్మమునకై తనశరీర మర్పణ జేయవలయు జయాపజయములు రానిండు. ఎల్లకాలము నిష్కామముగా కర్మ నాచరించుటె కర్మవీరుని ధర్మమని సౌదామిని విదుషీమణి గ్రహించెను. ఇకను తన బుద్ధిబల ప్రదర్శనమును జూప నుద్యుక్తురాలాయెను. సైన్యబలము తగ్గినపుడు బుద్ధిబలమే అనుసరణీయము. అప్పటికి భోజన వేళ లగుటచే యుద్ధభటు లెల్ల శాకాహారమును భుజించిరి. విశ్రాంతి గైకొనిరి. మూడుఘంటలకు సేననంతయు ప్రోవు జేసి సౌదామిని భగవద్గీతనుండి కర్మవీరుని కర్తవ్యమును దెల్పుచు ఉద్బోధించెను. ఖడ్గబలమును కట్టిపెట్టదలచెను.

బుద్ధిబలముచే ఒకపన్నాగమును బన్నెను. ఆ సాయంతనము నకు యుద్ధము గలదనియే చాటెను. యుద్ధమునకు ముందు సౌదామిని కొయ్యతో ఒక విచిత్ర అశ్వమును మంచిపని వానిచే చేయించెను. ఆయశ్వమును చక్కగా శృంగారించి యుద్ధస్థలమునకు ముందుంచెను. సాయంత నము నాల్గు ఘంటలకు తీవ్రముగా యుద్ధము మొదలిడ నుండెను. తన ఆత్మవిశ్వాసియగు వీరుని బిలచి ఉద్బోధించెను.

ఘోరమైనను యుద్ధంబు వైరులధిక
శౌర్యవంతులెయైనను సైన్యమందు
బలయుతుం డొక్కశూరుండు చెలగుచుండ
జయముగలుగదె రాజన్య సమితికెపుడు.

వీరుని ఉత్సాహమతిశయిల్లెను. సౌదామినికై శిరం బును వినయపూర్వకంబుగావంచి ఆతల్లి యాజ్ఞానుబద్ధుడై నిలచెను. "వీరపుంగవా! నామధేయమునకు తగినవాడవు నీవు. ఆత్మవిశ్వాసివి. అహింసాధర్మమును ప్రకటించినవా డవు. ఈ సేనాసమూహమందు, బుద్ధి, బాహుబలములందు నిన్ను మించినవాడుండ నేరడు. అహింసకై శరీరమునర్పించ సాహసించినవాడవు. మాతృధర్మమునకై నేడు నీవెనుకను దీక్షవహించినవాడను. అంతఃశక్తికిమించి ప్రపంచమున మఱొండులేదు. ఆశక్తిని గుర్తించుము. జయము చేకూర గలదు. మన సైన్యబలము చాల క్షీణించియున్నది. కార

ణము క్రమశిక్షణ అభ్యాసము, లేమి. ఇకను మనకు బుద్ధి బలమే శరణ్యము. ఇందుకై నీవీయుద్ధంబున, శత్రువర్గము నకు పట్టుపడుము. స్వామిద్రోహిగా నటించుము, శత్రుల సహవాసిగా చరించుము. మన మర్మమును వెల్లడించువానిగా ప్రకటించుము. వారు నిను పూర్తిగా నమ్ముతరువాయి, ఈ విచిత్ర-కొయ్యచే నిర్మింపబడిన అశ్వమును గుఱించి, అశ్వ మొక మంత్రబలంబుచే నిర్మింపబడినదనియు, అది యనేక కోర్కెల నెఱవేర్పగలదని, అదియున్నచో, జయమువాటిల్లు ననియు చాటుము. వార లశ్వమును ఆనగరలోభాగమునకు దెచ్చుతరువాయి, అందు దాగిన మేమొక రేయి, బయలుకు వచ్చి, సులభముగా శత్రువులబరిమార్పగలము." అని సౌదామిని వీరుని ఉద్బోధించెను. వీరునకు సౌదామినివాక్కు. ధర్మవాక్కు. యీమె చెప్పిన చొప్పున ఆచరించ, వీరుడు తన మెయికోలును దెల్పెను. ఆహా! యిట్టి పవిత్రవంతమైన ధర్మము, మాతృదేశాను ఋణవిముక్తికగు కార్యము, నా కొసంగబడుట నాపూర్వసుకృతమని, వీరుడు అత్యుత్సాహ మును వెలిబుచ్చెను. నాల్గుఘంటలకు, యుద్ధము ప్రారంభము కాబోడంగెను. ప్రథమపరీక్షనె, వీరుడు అవలీలలో శత్రు సేనకు చిక్కెను. వీరుడు, సేనాధిపతి చిహ్నమును ధరించెను. వీరుడు చిక్కుబడెను. సైన్యమును నడుపు సాహసికుడులేడు. వైరమె వెనుకకు మఱలుడని, సౌదామిని యుక్తితో తన

సేనను హెచ్చరించెను. సౌదామిని వాక్యరీతిగా సేనయెల్ల నెనుక కడుగిడజొచ్చెను. రాంగంగానది యందు సౌదామిని పూర్వప్రయత్నరీత్యా, కొన్ని ఓడలు వీరిరాకకై వేచియుండెను. సేనా సమూహమంతయు ఓడలనెక్కి రాంగంగా నదియం దదృశ్యులైరి.

వీరుడు పట్టుబడెను. తనమనస్సునుశత్రువర్గమున కర్పించెను. గాని హృదయము నీయడాయె. ఇతనియుక్తి బలమునకు హేమచంద్రుడు లొంగిపోయెను. అతని యధర్మము ప్రబలుచుండెను. దానివెంట నతని నాశనము వెంటాడుచుండెను. హేమచంద్రుని సేనలకు మాయోపేత యశ్వముకన్పించుచుండెను వీరుని అద్దానివిషయమై ప్రశ్నించిరి. అశ్వము యొక్క ప్రభావిశేషమును చక్కగా వీరుడు హేమచంద్రునకు నచ్చజెప్పెను. అత్యాశి హేమచంద్రుడు. వీరునిమాటల చక్కగా నమ్మెను. కొండజాతివారికిట్టి క్రియావిశేషము లుండునని అతనినమ్మిక. వెంటనే కోటద్వారముల తెఱచి కొంతసేనతో నూత్నమాయానిర్మితమగు అశ్వమును లోనకు గొనితెచ్చెను. అతని మృత్యుదేవత నతడు స్వహస్తములతో గొనితెచ్చుకొనెను. ఆదిశక్తి కనేక స్వరూపము. ఆరూపముల తమన్యాయములతో నామములతో జనసమూహమున క్రియారూపమున నుండును. అధర్మమందొకటి. అవిద్యాశక్తి హేమచంద్రుని నాశనమునకు బంధించెను. ఆరాత్రిని హేమ

చంద్రుడు యుద్ధంబున గెలిచితినను సంతసంబున విందులగుడిచి నిద్రాదేవి కౌగిలియందు మత్తిల్లియుండెను. అశ్వమునుండి వీరులు బయలడిరి, అదిఅశ్వముకాదు హేమచంద్రునిపాలిటి మృత్యుదేవత. అదికొన్ని కీలకములతో నిర్మించబడెను. అందు సౌదామిని, ఆమెసహచరులు పదు హేనుమంది దాగియుండిరి. నిశీథసమయమున వెలువడి కోటద్వారముల తెఱచిరి. రాం గంగానదియందు సౌదామిని సేన విలీనమాయెనా? వారెల్ల రొక్కుమ్మడి కప్ కోటను ప్రవేశించిరి. వీరాతిశయంబున వీరుడు నగరమర్మంబుల మఱలింప పెనుభూతమువోలె హేమ చంద్రుని సేనపై దుమికిరి. నిద్రమత్తుచే గర్వాతిశయంబుచే మేల్కొనిరి. చేయునదేమి? ఎల్లాచెదరైరి. సౌదామిని సేనా సమూహముచే వధించబడిరి. ఎవరు నిలబడి యుద్ధముచేసిన వారు హేమచంద్రుడు ఎట్టెట్టో కోటనుండి వెలువడి మృత్యు ముఖంబును దప్పుకొనెను. నగరమంతయు శత్రుభీతిచే హాహా కారముల సల్పిరి. జయమెవ్వరిదాయెను? సౌదామిని ధర్మ స్వరూపినిని సన్మానించెను. సౌదామిని తరువాయికర్తవ్య మేమి! ఆమె యీయుద్ధము జేయకారణమేమి? హేమచంద్రుని దుష్టప్రభుత్వమును బోనాడి చమేలి విడిపించగలందులకు! వెంటనే చమేలిదేవిని, కారాగారవిముక్తురాలిగా నొనర్చెను. సౌదామిని, చమేలికి, క్రొత్తఅయినను వారి పవిత్రహృద యము లొకరినొకర ఆకర్షించుకొనెను. హృదయములు లీన

నుండెను. హేమచంద్రుడెట్టులో పాఱిపోయెను. కపోటను పరిపాలించు రాజెవండు! తాను ఏలుటకై ఆశాబంధురాలై సౌదాబంధురాలై సౌదామిని యాక్రియాకలాపమును జరిపి యుండెనా? లేదు. ధర్మమునకై! ఇక నాపట్టణమునకై రాజును నియమించ, సౌదామినిఆలోచించుచుండెను. చమేలి తన సలహాను-దేవీస్వరూపియగు, సౌదామిని కెఱింగించెను. ఏమని! రాంగంగానదీ ప్రాంతమున ఆశ్రమముకద్దు. అందొక సద్గుణవంతుడు - పూర్వభిక్షు, శిష్యుడుగలడనియు, ఆతడు క్షత్రియుని ధర్మస్వభావమును గలిగినవాడగుటచే నతనిని రాజుగానియమించకోరెను. వెంటనే సౌదామినిఆసత్పురుషుని ధర్మనార్థమైఏగి, తనసంతసమును, చిఱునగవున వెలిబుచ్చెను ఏమది! ఆతడు, ఆనందసాగరుడు. సౌదామినిని, నవీను ఆజ్ఞా వర్తియై, వనమధ్యంబునకు వెతుకవచ్చినవాడు. సుక్షత్రి యుడు, కరుణారాశి. ఇతని నిష్కాపట్యమునకై ఆవనమధ్యం బున సౌదామినియు క్తి నెగ్గగలైను.తురుష్కుని, దీనత్వమును జూచి, తన అశ్వమాతనికొసంగి ఆహ్వారకంపెను. ప్రయత్న భంగుడగుటచే ఆనందసాగరుడు ఆల్స్మర కేగలేక, కపోటకు వచ్చి, హేమచంద్రునికడ నిరాడంబర జీవితమును గడుపుచుండెను. ఇతడు నీచసేవకత్వమునువీడి, ధ్యానతత్ప రుడై, యుండెను. గురువురాకకై వీక్షించెను. లేదు. సౌదామినిరాక, ఒకరిముఖంబు లొకరుజూచుకొనిరి. పూర్వ

కలుషితంబులు మంటగలిసెను. పవిత్రహృదయులైరి. సౌదామిని అతని పవిత్రతకు, సంతోషభరితయై, అతనికి ధర్మమునుబోధించి, జనకుని జ్ఞానము బోధించి, రాజుగా కప్కోటకు హేమచంద్రునిస్థానే పర్వాటుచెను. విందు సేనా సమూహమున కొనర్చి, బలాతిశయంబుల జూపినవారిని బహుమతులచే సత్కరించెను. చమేలిదేవితో, తన సహచరులతో, ఆనందసాగరుడు వీడ్కోల్ప శక్త్యాశ్రమమున కేగెను. నాటినుండియు ఆనందసాగరుని పాలనకు కప్కోట ప్రజలు ధర్మవర్తులై సంతోషిల్లుచుండిరి.

---

## పదునాల్గవ ప్రకరణము

---

మాతాహృదయపీడనసే–మానవ్ మర్ తాహై
పార్సియాసేకంఠ్–బంద్ కర్ తాహై
పూర్ణవికాస్‌కు–భూల్ గయాహై
దౌలత్ కాఖుషీమె–ధర్మత్యాగ్ కర్ తాహై
ప్రేమసుధారస–పీనెహమేషా
బంధర్ సేబాహిర్–పడ్‌నాహైమానవ్
ఆఫ్‌సోస్ ఆఫ్‌సోస్–అద్మీకా హాలత్.

అని పై గీతమును మనోహరంబుగా విరాగినియొక్క రై వాగేశ్వరమున పాడుచుండెను. హస్తమున వీణగలదు. కొందఱజనులకు వెఱ్ఱిదానివలె కాన్పించుచుండెను. ఆలోస్మర వాగేశ్వరం యుద్ధము వృద్ధుడగుకృష్ణసింహుని బంధించుటలో పరిణమించెను. కృష్ణసింహుడు వృద్ధుడు. నవీనునిమించిన సేనా బలాధికారి కానేరడు. కఠినవిధికి లొంగిపోయెను. ఆహా కూతుం గోల్పోయిన దుఃఖభారమేగాక వయస్సా దూషిం చబడి కారాగారబద్ధుడగుటయా? ఇతని భవిష్యత్పరిమాణ మేమి? నవీనుడు పూర్ణముగా వాగేశ్వరమును లోబఱచు కొనెను. నాటనుండియు ఆహారమును తృప్తికరముగాభుజించ డాయె. రాజ్యకార్యానిర్వాహకత్వము సరిగ నెఱవేర్పడాయె. ఎటుల నెఱవేర్ప గలడు. వివాహ ప్రయత్నా భంగుడై యుండెను. ఎప్పుడు పూర్వప్రేయసి నేత్రములెదుట గాన్పించు చుండును. విద్యాశూన్యతయని ప్రేమరాశిని గోల్పోయితినె! ఆఉసురె ద్వితీయ వివాహప్రయత్నభంగత గలుగజేసె. ఆహా! చమేలి విద్యాశూన్యురాలవని విడనాడితినా? విమలీమణు లకు మిన్నవై మెలంగితివే! నానోట మాటరాకముందె క్రియారూపమును దాల్చుచుండెడిదానవే! నాఅంధకారబం ధురమైన హృదయసీమయందు నీపవిత్రాత్మచే దీపపుకాంతిని నెలకొల్పితివే? విద్యాశూన్యురాలవని గినిసినమాత్రంబునే నన్నీ అంధకారమందు విడనాడవలెనా? హృదయసీమాలం

కారి? నీయుపచారముల మఱచు టెటుల? నాకు మేలొన గూర్చుచో నీకు కీడుగా పరిణమించు కార్యమునేని చేయ సాహసించెడిదానవే? ఆహా! నాడు నినువలదనినాడు నా పవిత్ర ప్రేమ నవీనమోహాంధకారమున మఱుగువడియుం డెను. అది నా దురదృష్టము. నాకై సత్యమైన నిష్కళంక మైన ప్రేమ యున్నచో జీవించియుందునుగాక. పరితాపమును గాంచుచో నీహృదయపరివర్తన మెటులుండునదో? ఈశ్వరా! యిదె వినుము. నాజీవితేశ్వరిని, సర్వసాక్షిగ వివాహమాడితి. నాహృదయాను సరణిని నాహృదయసీమను పరిపాలించనిమ్ము. లేకున్న మఱొక వివాహవిషయంపుమాట నెత్తకుందుగాక. యావజ్జన్మపర్యంతము బ్రహ్మచర్యమునె బూనుదుగాక" యని నవీనుడు నవీనుడై హృదయావేదనచే పశ్చాత్తాపము చే మనోవ్యాకులతచే నాటి నాటికి కృశింపసాగెను. వైద్యు లెల్లరు నిరాశులైరి. అంబరమందేమి! భూమియందేమి గృహమందేమి ప్రతిచోట దేనియె ప్రతిబింబించుచుండెను. ఇతని హీనస్థితికై బంధువులెల్లరు చింతిలసాగిరి. సర్వరాజ్య ముల పరిపాలించువాడైననేమి? తన సౌధముప్రక్కనె మనోహరమైన గీతము వినిపించెను. అందు ప్రేమస్వభావము వర్ణింపబడియుండెను. హృదయపీడన తనకై పోల్చుకొనెను. ఆహా! ఆపదగాంభీర్యంపు శరీరము పులకలెత్తగా పాడుచున్న వ్యక్తిని జూడవలెనను గాఢమైన యిచ్ఛ నవీనునకు జనిం

చెను. వెంటనె విరాగినికై కబురంపెను. విరాగిని రానొల్ల దాయె! కారణమేమి? రాజభవనములకు విరాగులు రాగూడదని నవీనుడు గర్వాంధకారతనుండి బయలడి నూత్న వ్యక్తికై వచ్చెను. ఎవఱువారు? విరాగిని.

అమ్మా! మాగృహంబులజొచ్చి మమ్ము పవిత్రుల జేయగూడదా?

విరాగిని—ఆత్మస్వరూపమా! స్వస్వరూపమా! విరాగులు రాజభవనముల రాజొచ్చరని ఎఱుగవా!

నవీనుడు—తల్లీ! నీగీతగాంభీర్యమేమి! మానవుడు స్వచ్ఛమైన ప్రేమనుఁబీడి హృదయపీడను మోహాంధకారతచే స్వస్వరూపమును మఱచుచున్నాడు. సత్యము. ఆమోహాము నకు మందేదిగలదా?

విరాగిని—ఔషధమా! హృదయపీడనకా! ప్రేమయే పరమౌషధము.

నవీనుడు—ప్రేమను గోల్పోవువాడు!

విరాగిని—ప్రేమకై మడియవలెను. భగవద్భక్తికి బూనవలెను.

తల్లీ! నావ్యాధి మహావ్యాధి. మనోవ్యాధి, శక్తి స్వరూపివగు, నీవ—నన్ను యీవ్యాధినుంచి దరిజేర్పవలెను. పూర్వమున, పాపకృత్యముల నాచరించియుంటిని, వాటి ఫలితము, సత్యముగానేమ, నాహృదయ సీమయందు, పడ

తాడనము జేయుచు, నను పీడించుచున్నవి. వైద్యుల ప్రయత్నములు భంగమైనవి. ఇది శారీరక వ్యాధికాదు. మానసికవ్యాధి. మానసికవ్యాధికి అధ్యాత్మికులు, మానసికవైద్యులు, మీవంటివారె పోనాడవలెను. పూర్వదుష్టకృత్యములకు నేడెంతయు పశ్చాత్తాపమును జెందుచున్నాను. నాహృదయము సంపూర్ణముగా మాఱినది.

'ఏమి—ఏమి—మాఱెనా, సత్యమును జెప్పుము'

నవీనుడు—తల్లీ! ఏలబాధింతువు. సంపూర్ణముగా నిశ్చయముగా మాఱెనని వేఱొకమారు జెప్పవలయునా?

విరాగిని—అటులైనచో నీవ్యాధి కారణమెద్దియో జెప్పనగునా? నీవు నీవ ద్వితీయవివాహమాడ నెంచియుంటివా?

నవీనుడు—అగునగు తల్లీ.

విరాగిని—అయినచో ఆపెమరణించెను.

నవీనుడు—హా దైవమా నవీనుని పాపమును హెచ్చించుచుంటివా? తల్లీ అందులకు కారణభూతుడ నేను. తల్లీ—హా.

విరాగిని—నీపశ్చాత్తాపముచే పాపము శమించుగాత. ఇంతదనుక ఆపాపమె నిన్ను క్షీణింపజేయుచున్నది. ఆపెతండ్రిని బంధించియుంటివా? సత్యమును జెప్పసాహసింపుము.

నవీనుడు—తల్లీ యీపాపి ఆ ఆవృద్ధునిబంధించియుండెను. అనుంగు కూతురు మరణవార్తను విన్నచో ఎంత

దుఃఖించునో శపించునో. హా ఇందులకు చేయగలకార్యమెద్ది ఆత్మహత్యయా !

విరాగిని—వలదు. వలదు. నీపశ్చాత్తాపమునకు భగవంతుడు నీకోర్కెను నెఱవేర్చుగాక.

నవీనుడు—నాకోర్కెను నెఱవేర్చునా? సౌదామినిని బ్రతికించునా ? చమేలిని యిచ్చునా ? తల్లీ ఏటివాక్యములు.

విరాగిని—చమేలినికోరచూ సౌదామినినిజీవింపనిత్తువా?

నవీనుడు—సౌదామినిని జీవింపనిచ్చుటేమి? ఈరాజ్యమును ఆమెకివ్వకుందునా ! నాహృదయపరితాపము దెల్పి కృష్ణసింహుని విడిపింపనా ?

విరాగిని—ఎవ్వతె నేను సౌదామినిని జూచుచుంటివా ? 'హా హా క్షమించుము. తల్లీ క్షమింపుము. కృష్ణసింహునికడ కేగిరమ్ము. హృదయతాపము శమించుగాత' అని నవీనుడనును.

వెంటనే కృష్ణసింహుని కారాగారావిముక్తునిగా జేతురు అతనిపాదములపై నవీనుడు పశ్చాత్తాపహృదయుడై వ్రాలును. కృష్ణసింహు యీవిచిత్రమునకు సౌదామినిరూపమున కెంతె కౌతుకమును జెందును. నవీనుడుఅమితానందమున కృష్ణసింహుని వాగేశ్వరము సింహాసనముచే తిరిగి అధిష్టింపజేయును. జనులెల్లరు నవీనుని పశ్చాత్తాపమున కతని ఎన్నోనోళ్ళ బాగడిరి. నాడు నగరమంతయు శృంగారించబడెను. సౌదామిని

బుద్ధికుశలతకు కృష్ణసింహుడు ఆనందబాష్పము రాల్చెను. తాను కొద్దికాలములోనె వత్తునని నవీన కృష్ణసింహులకు జెప్పి వెడలెను.

భిక్షునకు, అశోకరామునకా క్రియాశూన్యుడుగా భగవదిచ్ఛయగు కర్మను సలుపలేనని గ్రహించెను. అతని హృదయము కృషీవలులందు నాటుకొనెను. అతడు శక్త్యాశ్రమమున కనతిదూర మందొక గ్రామమున హేమచంద్రునిచే పరరాజ్యప్రాప్తిని బొందినవాడై నివశించుచుండెను. కృషీవలులతో బాటుగా క్షేత్రకర్మనాచరించుచు ప్రేమసుధారసపాననిమగ్నుడగుచు ధ్యానతత్పరుడై కాలమును గడుపుచుండెను. ఆదినము మకరసంక్రాంతి. దేవీఆలయమున గొప్పఉత్సవము జరుగగలదు. జనమంతయు ఆఉత్సవమును జూడ నేగుచుండిరి. దేవిఆలయమున ఒకఆశ్రమముగలదనియు అందొకవిరాగిని నివశించుచు సత్యమును ప్రకటించుచుండునని వినియుండెను. తనునివశించు గ్రామమున జనులెల్ల అహింసాప్రవర్తకులైరి. కొండజాతి అట్టినీతిని ద్రొక్కుటజూడ భిక్షుని కమితానందముగల్గెను, ఇందుకు కారణము శక్త్యాశ్రమమందు నివశించు విరాగిని బోధయని గ్రహించి ఆమెను దర్శించ కుతూహలుడై జనసమూహముతోడ బాటుగ తాను వెళ్ళెను. ఉత్సవమందు ప్రవక్తవోలె పవిత్రప్రేమను గుఱించి విరాగిని బోధించుచుండెను. భిక్షునిహృదయ మాకర్షించెను. సభ ముగిసెను.

బోధనా ప్రతిధ్వని ముగియలేదు. భిక్కు, విరాగిని దృష్టినాకర్షించెను. సౌదామిని కపోలయందె భిక్కు నెఱుంగును. సావకాశమున మాట్లాడదలచినను హేమచంద్రుని కఠినని ర్బంధముచే వీలుపడలేదు. విరాగిని అట్టి భిక్కునువీక్షించి అతని హృదయమున చొరెను. ఒకరినొకరు కర్మధ్యానమంత రించ గుర్తించుకొనిరి, విరాగిని భిక్కుపాదముల ప్రణమిల్లెను తగును విరాగులు విరాగులకై ప్రేమజూపుట నిరవి ఉపహాశించుచుండెను. సౌదామిని గోకులచందులు ప్రేమయందు ముగ్ధులైరి. నాడు సౌదామిని ప్రేమనుగురించి ఉపన్యశించి యుండెను. ఏమని! కర్మయోగము గృహస్థుని ప్రతిజీవితావస్థ యందు ప్రకాశించుచుండెననియు, ఆప్రకాశమానముద్వారానె మానవుడు కర్మాచరించ వీలగుననియు, భగవంతుడు తన ప్రేమను సృష్టియందు జూపెననియు, అద్దానిని స్వీకరించకుండుట మానవుని తప్పిదమనియు విశదీకరించెను. కఠినసన్యాసమునుండి తక్షణమె అశోకరాం గోకులచందుడై ప్రేమప్రభావమునకు తలయొగ్గి సౌదామిని తనకొఱకై పడిన కష్టములు ఆమెయొక్క ధర్మ, సత్య ప్రేమలచే అమితానందమును బొందెను. ఆశ్రమము వీరుని కొసంగెను.

వెంటనె, సౌదామిని, గోకులచందు, చమేలితో, భీమతాలున కరిగెను. శయ్యపై వృద్ధుడు, పూర్వవైద్యునికై నిరీక్షించుచుండెను.

సౌదామి—పరీతిని మెలంగుచుంటిరి.

రోగి—"చందు-చందు. దేవి-దేవి." అని కలువరించుచుండును. చమేలి-తల్లియగు వసంతాదేవి, తండ్రియగు జలంధరుని పాదముల కొఱగెను. ఒకరికొకరు ఆనందబాష్పముల రాల్చుచు పూర్వస్థితికై విలపించుచు, ప్రస్తుతస్థితి కానందించుచుండిరి; కాని గోకులచంద్, యీ చిత్రమునకు ఆశ్చర్య నిశ్చేష్టితుడై జూచుచుండెను. "ఆర్యా! నీతల్లి దండ్రులకు ప్రణమిల్లవేమి" అని సౌదామిని హెచ్చరించెను తండ్రియగు జలంధరుడు, మృత్యుశయ్యపైనుండి "చందు" ఎచటని నలుకెలంకుల జూచుచుండెను. సౌదామిని, చందును జూపగా తల్లిదండ్రుల ప్రేమబాష్పతరంగముల గార్చి అతని కౌగిలించిరి. ఈదృశ్యమే వారిస్వర్గలోకమై విలసిల్లెను. గోకులచందును చిన్నతనంబునే, జ్ఞానచక్షు వికసనపూర్వమె, పసివాడైయుండగా, నవీనుడు, దుష్టస్వభావముచే యీకుర్రని దొంగిలించి హత్యకై, గూఢచారులచే పర్వతప్రాంతముల కనిపియుండెను; కాని గూఢచారులు, గోకులచందును, కంఠమును నొక్కుచుండగా, ఊపిరాడమి, పసిపిల్లడు కెవ్వన కేకవైచియుండెను. చుట్టునుడున్నగొల్లబోయిలీ, కేకనువిని. రాగ హత్యాచారులు పరువిడజొచ్చిరి. ఆగొల్లబోయున కప్పుడు సంతానలేమిచే, యీకుర్రని సౌందర్యాతిశయంబునకు, వారి అదృష్టమునకమితానందులై, గృహమునకాబిడ్డనుగొంపోయి

అల్లారుముద్దుగ పోషించెను. ఆహా! ధర్మమెంతటిశక్తి గలది. సత్యస్వభావమే! ప్రేమప్రకృతియేమి! వేశ్యకాదు చమేలి సుక్షత్రియకన్య. గొల్లబోయడుకాడు. గోకులచంద్రు, సుక్షత్రియుడు. ఇట్టి వింతలో మాయమందినవాడగుటచే గోకులచంద్రు, తనస్వకులమును, కనిన మాతాపితృల మఱచెను. దేవిప్రసాదముచే అంతయు జ్ఞప్తికిరా గోకులచంద్రు అమితానంద పరవశుడై, తల్లిదండ్రుల పాదములకొఱలెను. ఆహా! ఆతల్లిదండ్రుల ఆనందాతిశయంబులేమి? ప్రకృతి విచిత్రమున కేమనవలయును!

సౌదామిని లజ్జావనితురాలైన దనవచ్చును. సౌదామిని సర్వబంధుసమేతముగా వాగేశ్వరమున కఱిగెను. ఈపె రాకను గాంచిన కృష్ణసింహుని ఆనందమున కేమనవలయును పూర్వపుహృదయ యాకారియగు చమేలిదేవి విదుషీమణి సందర్శనమునకు నవీనుని సంతసమున కెల్లలుండునా? చమేలి విద్యకు, ఆమెయందున్న నూత్నప్రేమ ప్రకాశమునకు, నవీనుని సంతసమునకుమేఱలేకుండెను. నవీనుని హృదయపరివర్తనచేగల్గిన ప్రేమప్రకాశమునకు చమేలీదేవి లోలోన, ఉప్పొంగుచుండెను. సౌదామిని తనసహసకృత్యముల నెఱవేర్చిన, అంతఃశక్తిని వేనోళ్ళ పొగడుచుండెను. హృదయమందామెను చిత్రించుచుండెను. గోకులచంద్, తన ప్రేయసియొక్క ధైర్యసాహసములకు అమితానందము జెందసాగెను. జలంధరుడు, వసంతాదేవి, నవీనుడు-కృష్ణసింహుడు, అతనిభార్య హేలా

వతి, చమేలి-గోకులచందులకు తాజేసిన కర్మనంతయు గంభీ రోక్తుల వినిపించెను. వారి సంతోషాతిశయముల ఎవడు జెప్ప నొప్పును. కృష్ణసింహుడు, వివాహప్రయత్నముల జేయ మొదలెట్టి, శుభలగ్నంబున, సౌదామిని-గోకులచందునకు, చమేలిదేవి-నవీనునకు, వివాహము మహావైభవముగా జేసి యుండెను. కృష్ణసింహుడు వృద్ధుడగుటచే వాగేశ్వరమును, గోకులచందును పట్టాభిషిక్తుని జేసెను. అతని పాలన క్రింద జనుల సంతోషాతిశయులుగాగ, నవీనుని పాలనక్రింద, ఆల్మోర జనులు సంతస సముద్రులైరి.

ఆహా! విచిత్రమేమని జెప్పనగును. శక్తి విజృంభించుచో కాకుండునట్టి కార్యము జగతినుండునా! ఆమహాశక్తియే చరిత్రల, భగవాను వినోదమునకై జేయుచుండును. ఆతల్లికి మూడుస్వరూపములు, ధర్మము-ప్రేమ-సత్యము. ఈ మూటితో ముజ్జగంబుల నేలుచుండును. ఆపె కరుణచే హీనునేని, గొప్పవానిగా జేసివైచును. సహజప్రేమయే దేశకళ్యాణమునకు మూలము. అట్టి ప్రేమలేనిచో నిర్జీవమై శ్మశానవాటికగా మారును.

విశ్వమంతయు, ధర్మ — ప్రేమ — సత్యములతో వర్ధిల్లుగాక!

రెండవ భాగము

సమాప్తము

—

# పసబాలుండు

కుముదనాథుడు, నాతని భార్యయు, రెండుసంవత్సరముల ప్రాయముగల వారికుమారుడు శైలీషుడును డిశంబరు మొదటి తేదీనాడు సిమ్లాకు బయలుదేఱిరి. జ్యోతిష శాస్త్రవేత్తలచే శుభదినము నిశ్చయింప బడెను. కాని అదృష్ట చక్రము ప్రతికూలముగా దిరిగినచో, ముహూర్త నిర్ణయమున తప్పిచ్చుట వర్తిలినదో చెప్పుటకష్టము పాపమా ప్రయాణ మాదంపతులకు కడుంగడు దురదృష్టకరముగ బరిణమించెను.

కొలది వత్సరములనుండి మలేరియాజ్వరముచే బీడింపబడుచుండిన కుముదనాథుడు బలహీనతచే నస్థిపంజరమువలె నయ్యెను. సిమ్లావంటి శీతల ప్రదేశమున గొన్నిమాసములు గడపుట ఆరోగ్యదాయకమని డాక్టరు సలహానీయగా, కుముదబాబు–భార్య గిరిబాలను–సుతుడగు శైలీషుని తనతో దీసికొనిపోయెను. సిమ్లానివాసము ఆరోగ్యమును గలిగించునని గిరిబాల విశ్వాసము. ఆమె కొన్నివత్సరములు సిమ్లాలో గడపియుండెను. ఆమె జనకుడగు కాళీకాంతరాయి సిమ్లాలో జాలకాల ముద్యోగము చేసియుండెను. కుముదనాథుడు సిమ్లాకుబోయి యొకభవనము నద్దెకుదీసికొనెను. ఆనగరమున నే కలక్టరు కచేరిలో యదుబాబను నీతడు లేఖకోద్యోగిగ

నుండెను. యదుబాబును కుముదనాథుడును గూడ ప్రాణ స్నేహితులవలె మెలంగుచుండిరి. మొదట కుముదనాథుకు చాలదూరము నడువజాలకుండెను. ఆతడు వరండాలో బడక కుర్చీపై బరుండి సిమ్లాగైడ్ బుక్ (Simla Guide Book) గాని యేదైన పత్రికనుగాని చదువుకొనుచుండును. వీధిలో నడచు నొంటెలను ఎక్కి టాంగా, జంపాన్ మున్నగు బండ్లను జూచి యానందించుచుండును. ఆపర్వత ప్రాంతముల వసించు లెప్చాజాతి స్త్రీల సౌందర్యము నాలోకించి యానందించుచుండును. అదియునుగాక 20 వ తేదీని హిమవర్షము కురిసెను. అయ్యది కుముదనాథున కత్యధిక సంతోషము నాపాదించెను.

నేడు 25 వ తేదీ ఉదయ మెనిమిదిగంటలైనది. యదుబాబు విలాసదండము నిటునటు త్రిప్పుకొనుచు బాలీగంజిలో నివాసమున్న కుముదనాథుని సౌధమున కరుదెంచెను. ఇరువురును టీ త్రాగిరి. యదుబాబిట్లు ప్రశ్నించెను.

"కుముదబాబూ! కొంచెము దూరమైన నడచుచున్నావా లేదా?"

"లేకేమి నిన్న జాక్ (Jacco) ను చుట్టి వచ్చితిని"

ఇరువురును గొంతసేపు వివిధ విషయముల గూర్చి ముచ్చటించినపిదప యదుబాబులేచి "ఇక వెడలి పోదు" ననెను.

"ఏమి యదుబాబూ! అంతతొందర? అవ్వాల నేమైన పనియున్నదా?"

"ఉన్నది నేడు తారాదేవి ఆలయమునకు బోవలెను. మాయింటియాపిడ పోరు పడలేకుండ నున్నాను."

"తారాదేవిని చూచుటకా? నాతో చెప్పలేదేమి. మేమిచ్చటికి వచ్చిననాంటి నుండియు నాచోటును దిలకింప నాసతి కుతూహల పడుచున్నది. ఎంతదూరము పోవలయును?"

"ఆరు మైళ్లు."

"రిక్షా నెక్కి పోవుట కవకాశమున్నదిగదా!"

"లేకేమి? కొండదిగువ వఱకును రిక్షాపై బోవచ్చును. బహుశః రిక్షా కొండ నెక్కజాల దనుకొందును."

"సాయంకాలమునకు దిరిగి రావలెనన్న-నో నిచ్చట నెన్నిగంటలకు బయలుదేఱ వలయును?"

"పదునొకండు గంటలకు. సరే నీవు భోజన మొనర్చి సిద్ధముగ నుండుము. నేను రిక్షాల దీసికొనివత్తు" నని పలికి యదుబాబు వెడలిపోయెను.

భోజనముతైనపిదప బదుకొండుగంటలన్నరకు యదుబాబు సకుటుంబముగ నరుదెంచెను, ఒకరిక్షాలో కుముదనాథుడు యదుబాబు శైలీషుడు నెక్కిరి. మఱొకదానిలో స్త్రీలు కూర్చుండిరి. వారందఱును తారాదేవియాలయమున్న శైలమును జేరుసరికి మధ్యాహ్నము రెండుగంట లయ్యెను.

అందఱును పర్వతము నారోహించి దేవాలయముం జేరిరి. స్త్రీలు పూజచేయసాగిరి. కుముదనాథుడును యదుబాబును దేవాలయపరిసరమును బరికింప నేగిరి. ఒకవంక మునిజనవాస యోగ్యమైన్య భయదకాంతారము. మఱొక్కవైపున నగాధ మగు లోయ, కొంచెము దూరములో హిమవత్పర్వతాగ్ర భాగము దృగ్గోచర మగుచుండెను. వారుకొంతసేపిటు నటు తిరిగి వచ్చినపిదప బూజారితో సంభాషణకుఁ గడంగిరి. ఇంతలో నెచ్చటనో పసినిసుంగు క్యారు క్యారుమని ఏడ్చుచుండుట వారి వీనులఁబడెను. పూజారి వారలనుద్దేశించి "బాబుజీ! రెండుదినములకుఁ బూర్వమొక కోయవనిత యాశిశువు నావృక్షము క్రింద నుంచి వెడలిపోయి యింతవఱకును దిరిగి రాలేదు. ఆ పసిపాప యాకఁటిబాధకుఁ దాళఁజాలక మరణించునేమో యని భయపడుచున్నా" ననెను.

ముప్వురును ఆపసి బిడ్డయున్న వృక్షముచెంత కరిగిరి. చర్మముతోఁ గుట్టబడిన యొక చిన్నకోటాబిడ్డ ధరించియుండెను. వింతెగ గన్పట్టు టోపీ శిరమున నుండెను. హారముగాఁ గట్టబడిన కొన్ని యెముకలు మెడనుండెను.

కుముదనాథుఁ డాపూజారిని దిలకించి "ఈబిడ్డను నేను గొనిపోవుదు" ననెను.

యదుబాబు "ఎందులకు?" అని ప్రశ్నించెను.

"పెంచుటకు—"

"ఈబిడ్డతల్లి వెదకికొనదా?"

"నా అడ్రసు నీపూజారికిఁ దెలిపెదను. ఆ ఆటవికస్త్రీ వచ్చినచోఁ దిరుగ నిచ్చివేయవచ్చును. ఈవిధముగ మఱొక దిన శీతలప్రదేశమున నున్నచో బిడ్డమరణింపడా?"

ఇట్లని యతఁడు గిరిబాలను పిలిచియడిగెను. ఆమె మొదట సమ్మతింపలేదు గాని కుముదనాథుఁడు "తల్లిచే నిరాకరింపఁడిన యీశిశువు నిట్లరక్షకునిగ విడిచినచో మృతినొందఁడా" యనుసరి కామెచిత్త మొకపరి కంపించెను. ఆమె యంతట వల్లెయని ఆవనబాలునిఁ బెంచ నంగీకరించెను. నౌకరున కాబాలుఁడు వప్పగించఁబడెను. సాయంత్ర మాఱు గంటల కందఱును స్వగృహములఁ జేరిరి.

౨

మఱుచటిదిన ముదయమున గిరిబాల యావనబాలునకు వేడినీటిస్నానము చేయించి, కంఠసీమనున్న యస్త్రులఁ దీసివైచి, ప్లానలుగుడ్డనుగప్పి పరుండఁజేసెను. కుముదనాథుఁడావనబాలునకు 'బూనో' యని పేరిడెను.

సాయంకాలము యదుబాబువచ్చి కూర్చుండి "కుముదబాబూ! ఈవనబాలుని పెంచఁబూనినందుల కొకనాఁడు నీవు విశేషముగఁ బశ్చాత్తాపము నొందవలసియుండు"ననెను.

"ఏమి? పెద్దపులి పిల్లవలె పెరిగినపిదప మనలఁ దిని వేయఁడుకదా!"

"కానీ, పెంచుము."

పగలంతయు నాబాలుఁ డాడుకొనెను. తెల్లవాఱుసరి కాతఁడు జ్వరపీడితుఁడాయెను. ఆనాఁడాతఁడు తెలివితప్పి పడి యుండును. డాక్టరుచూచెను. ఊపిరితిత్తులకు శైత్యముఁదగిలె నని చెప్పెను. మందిచ్చెను. గాని ప్రయోజనము లేకపోయె ను. డిశంబరు 29 వ తేదీని మధ్యాహ్నము రెండుగంటల కాబాలుడు గిరిబాలయొడియందు మృత్యువడయ్యెను.

గిరిబాల చాలసేపేడ్చెను. 'యీబాలుని మనము గొనిరాకయున్నను మేలయ్యెడిని. ఈబాలుని తల్లివచ్చి అడిగి నచో నేమని చెప్పగలము?'

శైలీషుడు 'అమ్మా! బూనో ఎచ్చటకు వెళ్ళినా' డని ప్రశ్నించెను.

రాత్రిభోజనానంతరము 9 గంటలకు కుముదనాధుడు శయ్యాగారమున గూర్చుండి పోస్టాజవాన్ కేకవినబడుటచే, నౌకరు లేఖల గొనివచ్చునని నిరీక్షించెను. గాని యెంతసేపటి కిని నౌకరగు విసూ రాకపోవుటచే కుముదబాబే లాంతరును కేలబూని క్రిందకుదిగెను. వీధిలో నౌకరగు విసూ ఒక ఆట వికస్త్రీ నడుముబట్టికొని యుండుటగాంచెను. ఆకొండజాతి వనిత యాపరిచారకుని బంధమునుండి విమోచన మొంద ప్రయత్నించుచుండెను. కుముదనాధునిజూచి యావననారి తన వస్త్రాభ్యంతరమునుండి యొకబాకును దీసెను. కుముద బాబు వెనుకకుదగ్గెను. ఆమె విసూపట్టు వదలించుకొని ఆ యంధకారమున మాయమైపోయెను.

'బాబుజీ! ఈమె దొంగ' అని పినూ అనెను.
'ఆతని భార్య లేక ప్రణయిని' అని గిరిబాలపలికెను.
'ఆమె ఎవరోనేనెఱుంగ'ననివినూ మొఱపెట్టుకొనెను.

3

ఆరోజున ఆకసము నిర్మలముగ నుండెను. శైలీషుని త్రోపుడుబండిలో గూర్చుండబెట్టి రోడ్డుమీదికి ద్రోసికొని పోయెను. మధ్యాహ్నము రెండుగంటలయ్యెను. కుమారుడింకను దిరిగిరానందున గిరిబాలయు కుముదనాథుడును వ్యస్తచిత్తులైరి. కుమారుని వెదకుటకై కుముదబాబుమఱొక పరిచారకుని పంపదలంచెను. ఇంతలో నొక రక్షకభటుడరుదెంచి, సబిన్స్పెక్టరు వ్రాసినలేఖ నిచ్చెను. అందులో జరురుగా స్టేషనుకు రావలసినదని వ్రాయబడి యుండెను.

కుముదనాథుడు స్టేషనుకు వెడలెను. అచ్చట నేమి జరుగునో చూచిరమ్మని గిరిబాల వినూనంపెను. కుముదబాబు పోలీసుస్టేషను చేరగానే అచ్చట జనసమూహమును దిలకించెను. స్టేషనువరాండాలో త్రోపుడుబండిలో నేడ్చుచు కూర్చుండియున్న కుమారునికై శైలీషునిజూచెను. ఆ బాలునిప్రక్క నొకరక్షకభటు డుండెను. రక్షకభటాధికారి 'కుముదబాబూ! తమకు మఱొకయాపద సంభవించినది. లెప్చాజాతిస్త్రీ తమ కుమారుని చంపయత్నించినది. తమ పరిచారకు డామెను నిరోధింపగా నామె వానిని గత్తితో బొడిచి గాయముల పాల్జేసినది. ఆతనిని రిపనువైద్యశాల కంపినాము' అనెను.

"అతడు జీవించునా?"

"ఏమో బాబుజీ! సంశయింప దగిన యవస్థలోనే యున్నాడు."

కుముదబాబు ఆయాటవికస్త్రీ తాను తొలినాటిరాత్రి చూచినదే యైయుండవచ్చునని తలంచెను. అతడు "దోషి యిక్కడనున్నదా?" యనెను.

రక్షకభటుడు కుముదబాబు నొకగదికడకు గొంపోయి చూపెను. ఆమెయే "నాకుమారు నీమె వధింపనేల ప్రయత్నించుచున్న?" దని కుముదబాబు మఱల ప్రశ్నించెను.

"మేమడిగితిమి బాబూ! తాము తారాదేవికొండకు బోయి ఆబాలుని తీసికొనివచ్చి చంపితిరని కోపముతో ప్రత్యపకారముచేయఁ దలచినది."

"నే నీమె కుమారుని చంపితివా?"

"లేదు బాబూ! తమ పరిచారకు డంత దెలిపినాడు. లెప్చాజాతి భయంకరమైనది. మీరు సదుద్దేశముతో అనాథుడై పడియున్న యాబాలుని గొనివచ్చిరని ఆమె యెట్లు గ్రహింపగలదు? మీరా పసినిసుంగును చంపుటకే దీసికొని వచ్చితిరని ఆమె విశ్వాసము."

కుముదనాథుడు విసూ, శైలీషుడు నింటికివచ్చిరి. తనయునిగాంచి గిరిబాల "నేడు నాపుత్రునకు బునర్జన్మ కలిగినది. ఎట్టి దుర్ముహూర్తమున బయలుదేఱినారమోగాని అన్నియునాపదలే. ఇక నొక్కక్షణమైన నిచటనుండరాదు. రేపు బయలుదేఱి పోవుదము." అనెను.

మఱునాడు గగనమండలము నీలమేఘావృతమై యుండెను. మంచు కురియసాగెను. నాల్గుగంటలకే దీపములు వెలిగింపవలసి వచ్చెను. శైలేషుడు నిద్రించెను. ఆఱుగంటలకే గిరిబాలయు కుముదబాబును భోజనములు చేసిరి. ఆమె పాకశాల పరిశుభ్ర మొనరించుకొనుచుండగా కుముదబాబు వరండాలోనికి బోయెను. వీధిలో దాను పోలీసుస్టేషనులో జూచిన ఆటవికస్త్రీ కనబడెను. కుముదనాథుడు భయకంపితుడాయెను. ఠాణాలోని రక్షకభటుని వధించి, ఆమె యొకటి రెండు నిమిషములకు బూర్వమే వచ్చియుండెను. ఉద్రేకపూరితుడై కుముదనాథు డామెను వెంటాడెను. ఆతడు వీధిలోనికి వెళ్లెను. పరిచారకుడగు విసూ చిత్రవధ గావింపబడి యుండెను. ఆప్రదేశము రక్తారక్తమై భీతిజనకముగ గన్పట్టెను ఆదృశ్యమునుగని కుముదబాబు భయకంపితగాత్రుడై తొందరచే దూలుచు మేడపైకి బోయెను. ఆతడు గిరిబాలగదిలో బ్రవేశించెను. గిరిబాల క్రిందబడి పొర్లాడుచు బిగ్గరగ హృదయవిదారకముగ విలపించుచుండెను. ఆ ఆటవికస్త్రీ తన నందనుడగు శైలేషునిజంపి యుండెను.

ఆవల నా నిబిడాంధకారబంధురమగు శీతలయామినిని మంచువర్ణమువలె నవిరళముగ గుఱియసాగెను.

---

# సంప్రహారము

శ్యామల కిటికీలో కూర్చుండి వీధివంక చూచుచున్నది. ఆమె హృదయాంబరమున ఆలోచనలు విద్యుల్లతవలె మెరయుచున్నవి. అసంతృప్తి ఆమె వదనమున తాండవించుచున్నది. ప్రక్క యిండ్లలోనున్న తన యీడు యువతులు విలువైన చీరలు మంచిఅందమైన చీరలు ధరింతురు. తన కొక్క మంచి చీరయైనను లేదు. తుదకు ఆభరణములైన ఏవియు లేవు. వారు నిరంతరము సువాసన నలుదిశల వెదజల్లు మల్లె పూలనో గులాబిపూలనో ధరించుచునే యుందురు. ఆనందము వారిసొమ్ము. ఆనంద మనుభవించుటకే వారు జన్మించినారు.

వారుపొందే సౌఖ్యసంతోషములలో తను నూరో వంతైనా పొందుట కవకాశము లేదు. తాను సౌందర్యవతి బంగారమును తిరస్కరించు మేనిచాయ. వినీలకుటిలకుంతలములు విశాలమైన ఫాలభాగము యివన్నియు శ్యామల సౌందర్యాధి దేవతయని తలపింపజేయక మానవు.

తాను ధరించుటకు మంచిచీరలు లేవు. అలంకరించుకొనుటకు ఆభరణము లంతకంటె లేవు. ఆమెపతి వేంకటరావు వ్యాపారములో నష్టపడి తన ఆస్తిలో చాలవరకు విక్రయించి భార్య ఆభరణములు విక్రయించి ఋణవిముక్తుడైనాడు. ఇప్పుడాతడు షాహుకార్లకు దలలోనినాల్క. ఎవరు పద్దులు

వ్రాయించినను ఉత్తరములు వ్రాయించినను యీతనిచేతనే ఎంతమంది కెన్ని వ్రాసినను వేంకటరావు నెల కిరువదిరూప్యములుమాత్రమే సంపాదింపగలుగుచుండెను. పాపము ఆతడొకప్పుడు మహోదానందమున లోపమనుమాట స్వప్నముననైన నెఱుంగక కాలమును గడపియుండెను. అటువంటి వేంకటరావుకాలవైపరీత్యముచే నేడెనిమిది గంటలకుబయలుదేఱి రాత్రి తొమ్మిది పదిగంటల కింటికి తిరిగివచ్చుచుండును. శ్యామలకు ఏలోపము కలుగకుండ చూచుటలో నాతడు ప్రమత్తుడై యుండెను. కాని ఇరువది రూపాయలైన లేసి ఆతని ఆదాయ మెట్లుసరిపడును? ఏసౌఖ్యము లనుభవించుట కవకాశ మొదవును? పాపము పదునాఱేండ్లైన గడువని ఆ నవయౌవనవతికి సంసారిణుల కోరికలు తీరనియవస్థ ప్రాపించినపు డెట్లుండును?

పొరుగిండ్లనుండు బాలికలు శ్యామలకడ కరుదెంచి లేసుకుట్టుట పాటలుపాడుట నేర్చుకొనుచుందురు. అట్టియెడల నామెవారికి పాటలు చెప్పుచున్నంతసేపును వారినగల దాను ధరించి బంగారపుగాజులున్న యాకోమలాంగులకడ తన కరములుంచి "ఆహా! ఈయాభరణములతో నలంకరించుకొని యానందించుభాగ్యము నాకు పరమాత్ము డనుగ్రహింపక పోయెనే" యని విచారించుచుండును. నిజము చెప్పవలసినచో శ్యామలకు దాను కాపురమున్న గృహమెంతమాత్రమును నచ్చలేదు. అబ్బా! ఆ చెల్లవేయక మాసిపోయిన

గోడలు కూర్చుండుటకు కుర్చీ పరుండుటకు మంచములేని ఆశూన్యగృహము ఆమెకు మాటిమాటికి పరమాసహ్యము కలిగించుచుండెను.

రాత్రి తొమ్మిది గంటలైనది. వేంకటరావింటికివచ్చి ఆనందోజ్వలమైన ముఖముతో "శ్యామలా! శ్యామలా!" అని పిలిచినాఁడు లోపలినుండివచ్చి శ్యామల "ఏమి? ఎందులకు?" అని అడిగినది.

"ఇదిగో! శుభలేఖ" అని ఒక కవరునామె కొసంగినాడు. శ్యామల యాశుభలేఖను జదివినది. కోటిపల్లికరణము గారి కుమార్తె వివాహము ద్రాక్షారామ భీమేశ్వరాలయమున జరుగునని యందున్నది. కోటిపల్లి కరణముగారామెకు బంధువు. ధనాఢ్యుడు. కుమార్తె వివాహము మహావైభవముగ జేయును. బంధుగులందఱూ వస్తారు. తానొసంగిన యాశుభలేఖ శ్యామలకానందదాయకమగునని యాశించిన వేంకటరావు కోరికవిఫలమైనది. ఆతడు చూచుచుండఁగనే, శ్యామల యాలేఖను దూరముగ బారవైచి "ఈశుభలేఖ యెందులకు? నెత్తిపైఁబెట్టి కొట్టుకొనుటకా యేమి?" అనినది.

"శ్యామలా! అదేమట్లనెదవు? మనము వివాహమునకుఁ బోవలదా?"

"వివాహమునకా? చాలు చాలు. దీపపుసెమ్మావలె నిల్లే ఒక్కనగలేక, ఒక్కచీరలేక, ఒక్కరవికలేక రావలయునా? పెండ్లివారు నన్ను తమబంధుగురాలనని గౌరవించు

టకు మాఱుగ "వారికి పసుపురాసి, తాంబూలము లియ్య వ్వా" అని ఏముత్తయిదువుగానో భావించుటకా?"అనినది.

"శ్యామలా! చీరలు లేవనియేనా నీసందేహము?"

"అవును? మంచి చీరలు ఉన్నవనెదరా?"

"నేమి కొనితేగూడదా? ఎన్నిచీరలు కావలెను? సాద చీరలైనచో నాలుగు, పెద్దచీరయైనచో నొకటి. బాగున్నదా?"

"సాదా చీరలెందుకు? ఉన్నవిపె, చినిగిపోయినవైనను జాలును. నలుగురిలోనికి వెళ్ళునపుడు పెద్దచీరయేయుండ వలయును" "శ్యామలా? కరణముగారు యీమారిట్లు ఆలయములో ఏకరాత్రి వివాహము చేయనేల?"

"కారణమేమున్నది? ఇదివరకు ముగ్గురు కుమార్తెలకు మహావైభవముగఁ జేసినపెండ్లింప్లు మంటఁగలిసినందున. ఇరువురు వితంతువులైనారా? ఒకతె చనిపోయినదా? ఆ అనుమాయ తప్పించుటకే యిట్లు చేయుచున్నారేమో."

"అటులనా? నీ చీరలమాట చెప్పుము."

"నాకు పది పదిహేను రూపాయల విలువగలవిరెండు చీరలు కావలయును. ముప్పై రూపాయలది కాని, పాతిక రూపాయలది కాని యొకటి కావలయును."

"అబ్బో! ( demand ) జాస్తిగానే ఉన్నదే." అని వేంకటరావు భోజనమునకు లేచెను.

౨

మఱుచటి దినముదయమున వేంకటరావు కొట్టులోని కుఱ్ఱవానిచే రకరకములచీరల బంపెను. ఆచీరలన్నింటిని పరిశీలించుచు నవియున్నియు దనకున్నచో బాగుండునని తలచి అదికాదని యిది. యిదిగాదని అది తిరుగవేయుచు రెండుగంటలసేపు ఆలోచించి తనకు నచ్చిన మూడుచీరలను తీసికొనినది. మధ్యాహ్నము ఒంటిగంటకు వేంకటరావు గృహమున కేతెంచెను. శ్యామల వదన మానంద కందలి తమై యుండలేదు ఆతనికి చాలకష్టము తోచినది.

'ఏమి శ్యామలా! చీరలు తీసికొనలేదా? వానిలో నెవ్వియు నీకు నచ్చలేదా?

'నచ్చినవి తీసికొన్నాము'

'మరెందుల కింకను కోపము. అబ్బే'

'వట్టిచీరలు కట్టుకొనిరానా? ఒక్క ఆభరణమైన నుండవలదా?'

'ఉండకూడదని యెవరన్నారు? యిబ్బందులలో నున్నారమని తెలిసియుండియు. నీవిల్లుమారము పెట్టనగునా? ఉన్నంతలో నీకేలోపము కలుగకుండ చేయుటలేదా? నగల నెచ్చటినుండి కొనిరాగలను?'

శ్యామల సమాధానము చెప్పలేదు. ఆమెనేత్రములు దుఃఖాశ్రుప్లావితములైనవి. వేంకటరావదిచూచి, ఆమెను

దగ్గఱకు జేరదీసికొని 'శ్యామలా! ఎందుల కేడ్చెదవు. డబ్బుదాచుకొని నీకు నగలు చేయించకుండ నున్నానా? చెప్పుము. పరిస్థితులన్నియు గమనించియు, నిట్లాలలుకబూనుట తగునా? వీరభద్రపురములోనున్న రంగమ్మగారి నడిగి ఏవైన నగల నొకటి రెండింటి నరువుగా దెచ్చికొనుము. పెండ్లినుండి రాగానే తిరిగి యిచ్చివేయుదము' అనెను.

ఆయుపాయ మామెకు అనుసరణీయముగ దోచెను. ఆమె 'సరే. నన్ను వీరభద్రపురమునకు బంపు' డన్నది. శ్యామలను బండిమీద వీరభద్రపుర మంపి, వేంకటరావు బజారులోనికి బోయెను. శ్యామల వీరభద్రపురములోని రంగమ్మగారి గృహమున కరిగినది. శ్యామలనుచూచి, ఆమె యపరిమితానందము నొందినది. కుశలప్రశ్నలైనతరువాత 'పిన్నీ! ద్రాక్షారము పెండ్లికి వెళ్ళవలసియున్నది. నీనగ—' లని ఆపివైచినది. రంగమ్మగారు 'వెఱ్ఱిదానా! అడుగుటకు సందేహమేల?' నని శ్యామలను లోపలిగదిలోనికి తీసుకొని వెళ్ళి, యినుపమందసముం దెఱచి, యొకపెట్టెనుదీసి చూపినది. ఆపెట్టెలోని కంటెను, ఒడ్డాణమును తీసికొన్నపిదప, రంగమ్మగారును మఱొకపెట్టెను చూపెను. అందు కనులు మిరుమిట్లు కొలుపు హారములెన్నోకలవు. శ్యామల ఆహారములన్నియుజూచి, యొక మేలైన కంఠహారమును, ముత్యములతో సమకూర్పబడిన దానిని గైకొనెను. ఆమె ఆహారమును ధరించి 'పిన్నీ! ఈహార మెంతోబాగున్న' దనెను. రంగమ్మగారు నవ్వెను. శ్యామల యింటికి వెడలిపోయినది.

3

తాను తెచ్చుకొనిన యాభరణములను ధరించి, సిల్కు చీరకట్టుకొనిన శ్యామలయును, వేంకటరావును మోటారుబస్సు నెక్కి ద్రాక్షారామ వెళ్ళినారు. అత్యంత సౌందర్యవతియగు శ్యామల ఆలయములో ప్రవేశింపగానే నారీసమూహా మామె చుట్టు చేరినారు. ఆమెధరించిన యాభరణము లన్నింటిలోనూ మిలమిల లాడుచు, దేదీప్యమానముగ వెలుగొందుచున్న ఆముత్యాలహారమును జూచి అందఱును ఆశ్చర్యాంబుధి మగ్నులైరి. ఆమె సహజసౌందర్యమునకు ఆ హారమత్యధికమైన శోభ నొసఁగూర్చెను. గ్యాసు లైట్లకాంతిలో ధగద్ధగాయమానముగఁ బ్రకాశించుచున్న ఆహార మందరదృష్టిని ఆకర్షించినది. అందరును శ్యామలను "ఏమమ్మా! ఈహారము నెంతకుచేయించుకొన్నావమ్మా" అని యడుగ నారంభించిరి. శ్యామల "మొన్ననే మావారు మదరాసువెళ్ళి రెండువేల రూపాయలకు కొని తెచ్చినారండి" అని బదులుచెప్పినది. అమ్మలక్క లందరూ నంతట "పెట్టి పుట్టాలమ్మా! అటువంటి నగలు పెట్టుకొనుటకు"అని ఒకరు, "ముద్దులు మూటగట్టుచున్నావమ్మా" అని యొకరును, "ఏనాడో బంగారుపూలతో పూజచేసితివమ్మా" అని మఱొకయామెయు నిట్లే పరిపరివిధములుగ బొగడసాగిరి. ఆస్త్రీజనమట్లు స్తుతించినకొలదియు శ్యామలకాయము ఆనందపులకాంకురిత మగుచుండెను. ఆమె చిత్తము నిరతిశయా

నంద సంయుతమగుటకు కారణము ఆకంఠహారమే. ఆముత్యాలహారమేగదా కారణమని యామె పొంగి పోయినది. ఆమె హృదయము గర్వముచే ఉప్పొంగినది.

వివాహానంతరము వేంకటరావు తనపనికి భంగము కలుగునని భయపడి రాజమండ్రికి రాబయలుదేరెను. కరణముగారు రెండుదినము లుండుడని కోరినను ఆతడు వినలేదు. వీలులేదని చెప్పినాడు. కరణముగారు వేంకటరావునకు జామారులు, శ్యామలకు చక్కనిచీరా పెట్టినారు. ఆకానుకలగొని శ్యామలా వేంకటరావులు బయలుదేరినారు.

అప్పుడు రాత్రి మూడుగంటలైనను కాలేదు. నడచియే వారిరువురును కారుస్టాండువరకుబోయి కారునెక్కిరి. రాజమండ్రి తెలవారకుండాచేరి, నిదురబద్ధకము తీరనందున శయనించినారు. ఇరువురూ కొంచెమాలస్యముగనే నిదుర నుండి మేల్కొనిరి. లేచి ఆమె సాదాచీర కట్టుకొని, ఎరువు తెచ్చుకొన్న నగలు తీసివేయుద మనుకొనుచునే అద్దములో తన ప్రతిబింబము చూచుకొనెను. వెంటనే ఆమె "అయ్యో బాబో" యని కేకవైచెను. వీధిలో దంతధావనము చేసికొనుచున్న వేంకటరావు త్వరితముగ లోనికివచ్చి "ఏమి! ఏమైనది శ్యామలా? అని యడిగెను.

"ఇంకేమున్నది? రంగమ్మగారిదగ్గరనుండి తెచ్చిన హారము మెడలోలేదు. ఎవరో తీసికొనినారోగాని—"

వేంకటరావు తెల్లబోయినాడు.

"రాత్రి ఆలయములో బయలుదేఱినపుడు హారము నీకంఠమున నున్నట్లు జ్ఞాపకమున్నదా?"

"ఉన్నది."

"ఎక్కడనో పడిపోయి యుండును. ఆహారము నిప్పు డెట్లు వెదకనగును? కారులో పడిపోయినదో, ఆలయములో పడిపోయినదో, లేక ఆలయమునుండి కారువద్దకు వచ్చునపుడు మార్గమున నెచటనైన పడిపోయినదో, అయ్యయ్యో, ప్రాణముమీదికి వచ్చినదే. ఎచ్చట వెదకుదు?" నని కారుస్టాండు కడకరిగి, బస్సులన్నింటిని వెదకి, ద్రాక్షారామ వెళ్ళి రాత్రి తాము నడచివచ్చిన మార్గమును పరిశోధించెను. హార మెచ్చటను దృగ్గోచరము కాదయ్యెను. రామచంద్రపురము పోలీసు స్టేషనులో రిపోర్టుచేసి వేంకటరావు రాజమండ్రి వచ్చెను. మహోత్కంఠతతో పతిరాక నిరీక్షించుచుండిన శ్యామల "హారము కనబడినదా?" యని యడిగినది. లేదని వేంకటరావు పెదవి విరువగానే నిరాశాతప్త హృదయముతో "ఇంక నేను బ్రతుకలేను. రంగమ్మగారు చంపివేయును. ఆహారము ఏనాలుగు వేల రూపాయలదో" అన్నది శ్యామల.

వేంకటరావు కాయ మాపాదమస్తకము క్రోధముచే నిండిపోయెను. కాని ఏమి చేయగలండు? శ్యామల ఉద్దేశపూర్వకముగ పారవేయలేదు. ఎవరికిని యీయలేదు. రంగమ్మగారికి దండుగయిచ్చుకొనుట ఎట్లు? ఆమెకు నగలు వివాహమైన మఱునాడే యిచ్చెదమని చెప్పియుండిరి. ఆతని కేమి

చేయుటకు దోచలేదు. కండువా భుజముపై వేసికొని వీరభద్రపురమువంక పోయినాడు. రంగమ్మగారి కడకరిగి వేంకటరావు "అత్తయ్యా! ఊరికి వేరేపనిమీద తీసుకవెళ్లుచున్నాను. నగలు వారమురోజులవరకూ ఉంచుకొనుటకు ఏమైనా వీలుండునా?" యని యడిగెను ఆమె "సరే నాయనా! అట్లే కానిండు" అనియెను.

వారము దినములు గడువులభించెను. భార్యను నిందించినను, శిక్షించినను ప్రయోజనము లేదాయెను. ఆమె శోకన్నాలు ముందుగానే మొదలుపెట్టియుండెను. షాహుకార్ల వద్ద సెలవుతీసికొని స్వగ్రామము వెళ్ళినాఁడు తనకొన్న ఎకరముభూమిని ఆరువందల రూపాయలకు విక్రయించినాఁడు. ఇరువురుముగ్గురు స్నేహితులకు ప్రామిశరినోట్లు వ్రాసి నాలుగువందలరూపాయలు పుచ్చుకొనెను. రాజమండ్రివచ్చి, తాను పనిచేయుచున్న షాహుకార్లవద్ద, మిత్రులవద్ద రూపాయి తొమ్మిదణాల వడ్డీకి వేయిరూపాయిలు అప్పుతీసికొనినాడు వడ్డీ ఎంతయగునాయనిగాని, ఎట్లుతీర్చగలనా యనిగాని వేంకటరావణు మాత్రమైన ఆలోచించలేదు.

భార్యాభర్తలిరువురును హారముకొనుటకు మదరాసు బయలుదేరినారు. బాపాలాల్ కంపెనీ, సురాజ్‌మల్ కంపెనీమున్నగువారి షాపులన్నీ చూచినారు. సురాజ్‌మల్ షాపులో శ్యామల ఎరుపు తెచ్చుకొనునటువంటి హారమును రు 1900 లకుకొని, పట్నమంతయుఁ జూచి, మెయిలులో బయలుదేరి రాజమండ్రి వచ్చినారు.

శ్యామలకింకను భయముగానేయున్నది. రంగమ్మ గారు తనహారము తనకీయలేదేమోయనునని. ఎట్లో గుండె దిటవుచేసికొని యామె బండినెక్కి వీరభద్రపురము వెళ్ళి ఆ నగలనిచ్చెను. నగలనుగాని హారమునుగాని రంగమ్మ పరీక్షింపకయే యినుపమందసములో బెట్టుకొనెను. శ్యామల హృదయమున నిపుడెట్టి వ్యథయును లేదాయెను.

౪

నాటినుండియు శ్యామల యింటిపరిస్థితులు మారిపోయెను. తనగౌరవము కాపాడుటకై భర్త యెన్నియిబ్బందుల ననుభవించెనో ఆమె గ్రహించెను. ఏలాగైనా సొమ్మును కూడబెట్టి ఋణముతీర్చుటకు దానుకూడ ప్రయత్నింపవలెనని యామె సంకల్పించుకొనెను. ఆమెపరిచారికను మాన్పించెను, కాఫీ త్రాగుట మానివైచెను. ఇంక వేంకటరావు తన జీతము నప్పిచ్చినవారికి పూర్తిగ తీర్చుట కంగీకరించి యుండెనుగదా! కుటుంబపోషణమునకై మరి యిరుపురివద్ద పద్దులు వ్రాయుటకు సమ్మతించెను. పాప మాతడు రాత్రులందింటికి వచ్చునప్పటికి పదిన్నర యగుచుండెను. ఋణవిమోచనమే యాతని చిత్తము నహర్నిశములు వేధించుచుండెను. అనుదినము శ్యామల రాట్నముపై నూలువడకసాగెను. పాపమా ఆదాయము మాత్ర మేమంత చాలును ? దారిద్ర్య

దేవత వారి గృహమున దాండవించుచుండెను. ఆతనికి ఋణము లొసంగినవారు ఎంతకాలమని ఓర్వగలరు? ముందు రిజిష్టరు నోటీసు లిచ్చిరి. పిదప దావాలజేసిరి. వారంటుల నములు జరుపెదమని కబురులంపసాగిరి. ఎవరువారంటుపెట్టినా పదిరూపాయలలో నాలుగురూపాయలు యిచ్చి సమాధాన పడి పంపెడివాడు. ఈ చాలీచాలనిస్థితిలో నాతడు కొన్ని దినము లుపవాసములు చేయుటకూడ తటస్థించెను. తుదకిక ఋణదాత వేంకటరావుపై గక్షవహించి, శ్రీకృష్ణజన్మస్థాన మున కంపెను.

వేంకటరావు కారాగృహమున కేగినపిదప శ్యామల కష్టము లొకదాని వెనుక నొకటి గోరుచుట్టుపై రోకటిపోటు వలె బాధాకరములు కాజొచ్చెను. ఆమె పతికొఱకు బెంగ పెట్టుకొనెను. తన్నుగూర్చి, ఋణములపాలై, తుదకవమాన కరమైన కారాగారవాసముకూడ చేయవలసివచ్చెనని తలచుకొనునప్పుడెల్ల ఆమె చిత్తము వ్యధితమగుచుండెను. చేతిలో గ్రుడ్డిగవ్వైన లేకుండెను. ఆమె యారోగ్యము పాడయిపోయెను. ఆమె గత్యంతరము లేక గోదావరిలోబడి మరణింపదలంచెను. మఱల తానట్లొనరించినచో దనపతి కారాగారమునందే మరణించునేమోయని భయపడి, ఆ ప్రయత్నము మానెను. ఆ దారిద్ర్యస్థితిలో నామెకు బంధు గృహమునకు బోదలచుకొనలేదు.

శ్యామల కాపురమున్నగృహమునకుబ్రక్కగా ప్లీడరు గారి గృహమున్నది. ఆయన వేంకటరావు జైలుకుపంపబడి

నాడనియు, శ్యామల వర్ణనాతీతమైన దురవస్థలోనున్నదనియు దెలిసికొని భార్యయగు సుందరమ్మతో నేదోచెప్పెను. సుంద రమ్మ తనతో భర్త చెప్పిన నాటి సాయంకాలము నాల్గుగంట లకు శ్యామల యింటికివచ్చి "శ్యామలా! శ్యామలా!" యని పిలిచెను.

తలుపుతీయుదునా మానుదునా యని శ్యామల యొక క్షణము సంకోచించెను. తనకు నిరంతరము సాయము జేయుచు తన స్థితిగతుల నెఱింగియుండుటచే "వస్తున్నానమ్మా" యని తలుపుదీసెను.

"ఏమి చేయుచున్నావో!"
"నీళ్లు తోడుకొనుచున్నానండి."
"జడ వేసెదవా శ్యామలా!"
"ఆ! వేసెదను."

సుందరమ్మకుమార్తె జానకి వెళ్లికొబ్బరనూనె, దువ్వెన తెచ్చియిచ్చెను. సుందరమ్మ శ్యామలగృహమును కలయ జూచెను. ఇంటిలో నొక్కబిందిగాని, చెంబుగాని లేదు. నూతి వంకజూచినది. చిన్నకుండఉన్నది. పొయ్యివంక దృష్టి ప్రస రించినది. అక్కడకూడాఒక్కగిన్నైనా లేదు. కట్టెలైననులేవు ఆపూట శ్యామల భోజనము చేయలేదేమో అనిసంశయించి నది. బహుశః తొలినాటి రాత్రికూడ భోజనముచేసియుండక పోవచ్చునని ఊహించినది. పాపము. శ్యామల ఒకరినడుగ లేక యింటిలోని పాత్రసామగ్రిని తాకట్టుపెట్టి యుండునని

గ్రహించినది. ఆహా! ఆమె ఎంతఅభిమానవతి, దండెమువంక చూడగా నొక్కచీరయిన లేకుండెను. వొడ్డిలో జాలచినుగులతో నిండిన యొకచీర యుండెను. సుందరమ్మ హృదయము దుఃఖభరితమైపోయినది.

ఇంతలో నెవరో "ఏమండోయి!" అని పిలిచిన కేక వినబడియెను. శ్యామల వెళ్ళి తలుపుతీసెను. ఆయింటి యజమాని అద్దెకై వచ్చియుండెను. వేంకటరావు జైలుకు బంపబడినట్లాయనకు దెలియదు. "వేంకటరావింటిలో లేడమ్మా" అని ఆయన ప్రశ్నింప, శ్యామలమెల్లగా 'లేరండి' అని బదులుచెప్పెను.

"ఏమమ్మా! ఆమాత్రము జ్ఞానముండనక్కఱలేదా? ఎప్పుడు వచ్చినను లేరు లేరనియే చెప్పెదవు. ఎనిమిది మాసముల అద్దె నీయవలసియుండి, ఒక్కనాడైన కాన్పించనిచో నేమనుకొనవలయును? అట్లు చెప్పుటకుసిగ్గయిన నుండవలదమ్మా మీరద్దె యీయనిచో మానె. ఇల్లు కాళీచేయుడు. రేపు కాళీచేయకున్నచో నేనే బలాత్కారముగ సామానులనావలబారవైతును. తెలిసినదా? నీతి ఉండవద్దమ్మా." అని ఆయజమాని గిరుక్కున తిరిగి వెళ్ళెను.

తలుపువేసి, చిన్నబుచ్చుకొనిన ముఖముతో శ్యామలవచ్చి సుందరమ్మకు జడ వేయసాగెను. అద్దెకొఱకాయింటియజమాని కేకలు వేయుట నాలకించిన సుందరమ్మ శ్యామల నుద్దేశించి "అమ్మాయీ! కష్టసుఖము లందఱకును సమానమే. సిగ్గు

పడు టెందులకు తల్లీ. అయితే శ్యామలా! మన మిద్దరము నక్క సెల్లెండ్రవలె నున్నారముగదా! నీవు యీపూట తిండి తిననట్లు కాన్పించుచున్నావు. మాయింటికి భోజనమునకు రావా!'' అని బ్రతిమాలెను.

శ్యామలనోట మాటరాలేదు. ఆమె కన్నులనుండి కన్నీరు జొటజొటకారెను. ఆమె బాలికవలె రోదనమొనరించెను. సుందరమ్మకూడ శ్యామల యనుభవించుచున్న కష్టములకు దుఃఖాశ్రువుల విడువకుండ నుండలేకపోయెను.

సుందరమ్మ శ్యామలనింటికి తీసికొనివెళ్ళి భోజనమిడినది. ఆనాటిరాత్రి సుందరమ్మభర్త కృష్ణరావుగారు శ్యామల నుద్దేశించి ''అమ్మా శ్యామలా! నీవు యిబ్బందిపడవలదు. మాపిల్లవలెనే ఏసంకోచములేక మాయింటనుండుము'' అని వెంటనే బజారునకువెళ్ళి నాలుగుచీరలు తెచ్చియిచ్చెను.

శ్యామల సుందరమ్మ నింటిపనులేమియు జేయనీయక తానే వంటచేయుచుండెను. పిల్లలకు నీళుపోయును. ఆమె యెన్నడూ కృష్ణరావుగారికి కనబడదు. ఆమెకు సుందరమ్మ యొకగదినిచ్చెను. సుందరమ్మ కుమార్తెయగు నీలాంబరికి శ్యామల ఊలుకుట్లు నేర్పుచుండెను. వారీయవలసిన అద్దెను కృష్ణరావుగా రిచ్చివైచిరి.

శ్యామల కిప్పుడేలోపమును లేదు. నిరంతరము ఆమె చిత్తమున భర్తనుగురించియే విశేషాందోళనము జెందు

చుండెను. వేంకటరావు కారాగారమున దనకొఱకు బెంగ గొని మనోవ్యథ పాలయినాఁడేమోనని యామె యాందోళ నము. తానా వివాహమున కాముత్యాలహారమును దీసికొని పోనిచో నీ కష్టము లెవ్వియు లేకుండునుగదా యని పశ్చాత్తాపము

౫

వేంకటరావు కారాగారమున నిశ్చింతుఁడై యుండ జాలక పోయెను. తనసతి శ్యామల తిండికి ఇబ్బందిపడి, మల మల మాడి చనిపోవునని యాతఁడు భయపడియెను. ఈతలం పుతోనే యాతఁ డిరువదినాల్గుగంటలును వ్యస్తచిత్తుఁడగు చుండెను. తుదకీ యాందోళన మాతని నున్మాదుని జేసి వైచెను. ఆతని యారోగ్యమునకు భంగమొదవెను. న్యూ మోనియావ్యాధిచే నాతఁడు బాధపడెను. భోజనము మాని వైచెను. డాక్టరులు ఔషధసేవ చేయించిరికాని ఫలము కలుగ దాయెను. మాసముదినము లాతఁడు జ్వరముతో బాధపడియెను. "మనోవ్యాధికి మందు లేదుగదా!" సంధి ప్రవేశించెను. ఆచైతన్యరహితస్థితిలో నాతఁడు "శ్యామలా! శ్యామలా! జీవించియుంటివా?" యనియే పలువరించు చుండెను. ఆతఁడు తుదకు శ్యామలకొఱకు పలవరించుచునే యసువుల బాసెను.

జైలువార్డరు వెదకికొనుచువచ్చి వేంకటరావుభార్య కృష్ణరావుగారి యింటిలోనున్నదని తెలిసికొని, యవ్విషయము

ను ప్లీడరుగారికి దెలిపెను. ఆయన హృదయాంబరము విషాదమేఘా వృతమయ్యెను. శ్యామల కీవృత్తాంతము నెట్లు చెప్పనగునా యని ఆయన సంశయించెను. తనభార్యతో యోచించి, వార్డరుతో నాదుఃఖవార్తను శ్యామల కెఱింగింప వలదని చెప్పి "అమ్మా! శ్యామలా! వేంకటరావునకుఁ గొంచెమస్వ స్థతగ నున్నదట, నిన్ను చూడవలెనని కబురంపినాఁడు. ఒక సారివెళ్ళి చూచిరాతల్లీ!" అనెను.

శ్యామల యప్లీయని బండినెక్కెను. ఆమె హృదయ మున నేదోచెప్పరాని యావేదన ముదయించెను. ఆమెకమం గళకరముందు తలఁపులెన్నోకలిగెను. అశ్వశకటము జైలు ఆవరణలో నాగెను. శ్యామల వార్డరుననుసరించెను. ఒకచో బడియున్న వేంకటరావు మృతకళేబరము నామెచూచెను. వార్డరామె నుద్దేశించి "తల్లి! తమకొఱకే బెంగపెట్టుకొని ఆయన మృతిఁజెందినారు. మధ్యాహ్నము రెండుగంటలకే వారు విగతజీవులైనను ఉద్యోగధర్మముచే నింతవఱకు రాఁ జాలనైతిని. కష్టము లోకదానివెనుక నొకటిగ కలుగును" అనెను.

శ్యామలగుండె చెదరిపోయినది. తానొనర్చిన గురుత రాపరాధముకొఱకాందోళనాయత్త చిత్తయై తనపతి ప్రాణ ములఁ ద్యజించెను. వినువారి హృదయములు విదారిత మగు నట్లు—భూనభోంతరాళములు ప్రతిధ్వనించునట్లు— ఆమె విల

పింపసాగెను. భర్తమృతకళేబరమును గౌగిలించుకొని యేడ్చుచున్న శ్యామలను వార్డరు సమీపించి "అమ్మా! చీఁకటి పడిపోయినది. నాపరెంటు వచ్చినచో మాపైఁగోపగించును. వలయుచో శవమును గొనిపొండు. లేదా ఉదయమునరండు. ప్లీడరుగారింటికే మృతకళేబరమును పంపింతు"మనెను.

వెళ్ళలేక, వెళ్ళలేక, వెక్కి వెక్కి యేడ్చుచు శ్యామల జగత్తునావరించిన యంధకారజలధి నీదుకొనుచు బయలు దేఱెను. ఆమె కృష్ణారావుగారి గృహమునకుఁ బోలేదు. ఏ మార్గము ననుసరించి నడచుచున్నదో యామెకుఁ దెలియదు. ఆమె కోటిలింగాలరేవు చేరినది. మార్గమధ్యమున నామె కుసుమకోమలములైన పాదములకెన్నో కంటకములు గ్రుచ్చుకొనియెను. ఆమిట్టపల్లములలో బడుచు లేచుచు శ్యామల నదీతీరమున కేగినది. అంధకార బంధురమై, నిశ్శబ్దాధిదేవత తాండవించుచున్న యాసమయమున గౌతమీనదీ తరంగ ఘోషతక్క మఱేద్దియు వినబడుటలేదు. ప్రవాహ మత్యంత వేగముగ నుండెను. శ్యామల ఒడ్డున నిలువబడి "నాకొఱకు బెంగగొని ప్రాణములఁ బాసిన మీఋణము తీర్చుకొనుటకు మీపాదసేవ చేయుటకు నేనుకూడ మీతో వచ్చుచున్నా" ననుచు నాగంభీర నదీప్రవాహమునఁ బడిపోయెను. గగన మండలమున నచ్చటచ్చట మినుకుమినుకు మనుచున్న తారకలుకొన్ని జాలిచేకాబోలు తెల్లఁబోయి క్రిందరాలిపోయెను.

౯

రెండుమాసములు గడచినవి. ప్లీడరు కృష్ణారావు శ్యామల దుర్మరణమునకు మిక్కిలి వగచినారు. పాపమా దుర్వార్త నాకర్ణించిన దినమున వారుభోజనము చేయనేలేదు.

* * * *

వీరభద్రపురములోని రంగమ్మగారు ప్లీడరు కృష్ణారావుగారికి బంధుగురాలే. ఆమె యొకనాఁడు వారిగృహమున కరుదెంచి సంభాషణవశమున శ్యామల విషయమడిగెను. సుందరమ్మ శ్యామలవలన వినిన యుదంతము నెఱిగించి, ఆమె భర్త జైలులో మరణించిన విషయము, ఆతనికొఱకామెకూడ బలవన్మరణము నొందుట, యావత్తు తెలిపెను. ఆమె చెప్పిన దంతయు నాలకించి, రంగమ్మగారు నిశ్చేష్టురాలై "రామ రామ! ఎంతఘోరము జరిగినది? ఆహారము కొఱకు రెండు ప్రాణములు నాశము నొందినవా? ఇంతకు నది కృత్రిమ హారము. ఆ ముత్యములన్నియు యిమిటేషనువి. ( imitation pearls ) మావారు నేను రామేశ్వరము వెళ్ళినపుడు పట్నమున పదునెనిమిది రూపాయలకు కొనినారము. బంగారమువంటి సంసారము పాడైనదే" అనెను.

"పదునెనిమిది రూపాయల హారమాయది" యని సుందరమ్మ ముక్కుమీద వ్రేలు పెట్టుకొనినది.

సమాప్తము.

---

శ్రీ కొండపల్లి ప్రెస్, రాజమండ్రి—1948.

# నవలలు

| | | | |
|---|---|---|---|
| ఒన్నీతగాదాలే | 1 0 | హాంకీకవ్యాలు | 0 12 |
| అవును | 1 0 | మాహ్హోతుడు | 0 12 |
| బీజం | 1 0 | హనుమంతుడిస్వప్నం | 0 12 |
| మాటవరుస | 2 0 | "చలం" గారి నవలలు | |
| మేజువాణి | 1 0 | ప్రేమలేఖలు 1వ భా | 1 4 |
| పాపం | 0 12 | డిటో 2వ భా | 1 4 |
| అరుణ | 0 12 | మ్యూజింగ్స్ 1వ భా | 1 0 |
| అనామీలరు | 0 12 | డిటో 2వ భా | 1 0 |
| మారుపేర్లు | 0 12 | భానుమతి | 0 12 |
| కులంలేనిమనిషి | 0 12 | సావిత్రి | 0 8 |
| బడదీది | 0 12 | విడాకులు | 1 0 |
| పతివ్రత | 0 12 | వివాహం | 1 0 |
| పల్లీయులు | 1 8 | స్త్రీ 1, 2 భాగములు | 2 0 |
| దేవదాసు | 1 8 | చిత్రనళీయము | 0 12 |
| పరిణీత | 0 12 | చాచా | 0 10 |
| మాలో ప్రేమ | 1 0 | సత్యం-శివం-సుందరం | 1 8 |
| తోకచుక్క | 0 12 | దైవమిచ్చినభార్య | 1 0 |
| పాతమంగలి | 0 12 | మైదానం | 0 12 |
| వనఫూల్ రచనలు | 0 12 | త్యాగం | 0 12 |
| మూగజీవాలు | 0 12 | ఇతర నవలలు | |
| కదంబం | 0 12 | బిడ్డలశిక్షణ | 1 8 |
| రూం-టు-లెట్ | 0 12 | శ్రీకాంత (నీలకంఠం) | 10 0 |
| మంగమ్మ | 1 0 | శ్రీకాంత (శివరామకృష్ణ) | 7 8 |
| ఫలితకేశం | 1 0 | చరిత్రహీనులు 1వ భా | 2 8 |
| కదలిపాంగులు | 1 0 | డిటో 2వ భా | 2 8 |
| ప్రగల్భప్రేతము | 0 12 | శేషప్రశ్న | 4 0 |
| పాంచజన్యము | 0 12 | విప్రదాసు | 2 4 |
| ఋణవిముక్తి | 1 0 | గృహదహనం 1వ భా | 1 8 |
| సంజీవి | 1 0 | డిటో 2వ భా | 1 8 |
| బ్రాహ్మణీకం | 0 12 | సుభద్ర | 2 0 |

# నవలలు

| | | |
|---|---|---|
| అగ్గిరాముడు | 1 | 0 |
| భయంకరుడు | 1 | 0 |
| రమేశబాబు | 0 | 12 |
| సర్కిల్ రంగనాథం | 1 | 0 |
| శకుంతల బి. ఏ. | 1 | 0 |
| చదువుకున్న భార్య | 1 | 0 |
| నీ నేనా ? | 0 | 12 |
| ఛాందసుడు | 0 | 12 |
| శక్తికుమారి | 1 | 0 |
| పంజాబు మెయిల్ | 1 | 0 |
| కన్నపుదొంగ 1 వ భా॥ | 1 | 0 |
| పగటిచుక్క 2 వ భా॥ | 1 | 0 |
| డిటో 3 వ భా॥ | 1 | 0 |
| రమాసుందరి 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| రక్తవాహిని (అయిదు హత్యలా ?) | 1 | 0 |
| ఇంద్రజాలము | 1 | 0 |
| రాజద్రోహి | 1 | 0 |
| అర్ధరాత్రపువింత (8 హత్యలు) | 1 | 0 |
| దురాశ 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| దొంగల నాయకుడు | 1 | 0 |
| మోహపిశాచము | 1 | 8 |
| కాలసర్పము 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| విషహృదయము | 1 | 0 |
| వలపుల రాణి | 1 | 0 |
| నేనెవరి భార్యను ? | 1 | 4 |
| నేనెవరి భర్తను ? | 1 | 4 |

| | | |
|---|---|---|
| వ్యామోహము | 1 | 0 |
| జీవనప్రభాతము (రఘునాథజీ) | 1 | 8 |
| జీవనసంధ్య (తేజసింగు) | 1 | 8 |
| వాడే వీడు 1 వ భా॥ | 1 | 8 |
| నేనే 2 వ భా॥ | 1 | 8 |
| కాలూరాయి 3 వ భా॥ | 1 | 8 |
| ధర్మరాజు | 1 | 0 |
| అహల్యాబాయి | 1 | 0 |
| రాజరత్నం | 1 | 0 |
| కృష్ణవేణి | 0 | 12 |
| హేమలత | 1 | 0 |
| కర్పూరమంజరి 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| రామచంద్రవిజయము | 1 | 0 |
| సౌందర్యతిలక | 1 | 8 |
| నవ్వులగని | 1 | 8 |
| వినోదములు 1 వ భా॥ | 0 | 12 |
| డిటో 2 వ భా॥ | 0 | 12 |
| Tales of Rajasthan అను రాజస్థానకథావళి 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| మణిమంజరి | 0 | 6 |
| సువర్ణగుప్తుడు | 0 | 6 |
| చమత్కారమంజరి 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| Lives of Great men మహాపురుషుల జీవితచరిత్రలు 1 వ భా॥ | 1 | 0 |
| 2 వ భా॥ | 1 | 0 |
| 3 వ భా॥ | 1 | 0 |

శ్రీ సత్యనారాయణ బుక్కు డిపో, రాజమండ్రి.